అపరాధ పరిశోధన అనుబంధం—149

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నరరూప రాక్షసులు

రచన: భీమవరపు పురుషోత్తం

శ్రీ 18/4/86 Rangarao

రామస్వామి

## ఆత్మార్పణ

రచన: వసుంధర

## అగ్నినేత్రాలు

రచన: వి. యస్. రావ్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—149
మే, 1986
వెల: రు. 6-50
ఏడాది చందా: 78 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ పీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1

# నరరూప రాక్షసులు

భీమవరపు పురుషోత్తం

ఉదయం తొమ్మిది గంటలు దాటింది—

కాలకృత్యాలు ముగించుకొని ఫ్రెష్‌గా టీ తాగుతూ షిప్ డెక్ మీదికి మెల్లగా నడుస్తూ వచ్చాడు కిరణ్. ఖడ్గమృగంలా దృఢంగా వున్న ఇండియాకు చెందిన ఆ పాసింజర్స్ షిప్ సముద్రాన్ని చీల్చుకొంటూ తాపీగా సాగిపోతూంది ఆస్ట్రేలియా వైపు.

డెక్ మీదికి అప్పుడే పది, పదిహేనుమంది ప్రయాణీకులు చేరారు. అంతా తలో మూల ఉన్నారు. కొందరు చిన్న చిన్న కేన్ కుర్చీల్లో కూర్చుని యేదో మాట్లాడుకొంటున్నారు. కొందరు డెక్ అంచు దగ్గర నిలబడి అంతులేని జలాన్ని, పైన ఎగురుతున్న పక్షుల్ని చూస్తున్నారు.

కిరణ్ ఖాళీగా ఉన్న ప్రదేశాన్ని చూసుకొని, అక్కడికి నడిచాడు. విసురుగా వచ్చిన గాలితెర అతడి వత్తయిన జుత్తును చెరిపేసింది. జుత్తును అలాగే నిర్ల

క్ష్యంగా వదిలి, అంచు దగ్గరకు చేరి నీటివంక చూస్తూ టీ త్రాగడం పూర్తి చేశాడు.

"హలో కిరణ్ ఇక్కడున్నావా?"

చటుక్కున తలతిప్పాడు కిరణ్. కెప్టెన్ రాజేంద్ర సింగ్ నవ్వుతూ వస్తున్నాడు.

చిన్నగా నవ్వాడు కిరణ్ "ఏమిటీ పొద్దుటే కెప్టెన్ గారికి నన్ను పలకరించేటంతి ఖాళీ వచ్చిందా!"

కెప్టెన్ రాజేంద్రసింగ్ సిక్కు. ఆరడుగుల ఎత్తు చురుకయిన కళ్ళతో కెప్టెన్ అన్న పదానికి తగ్గట్టుగా ఉంటాడు. "ఇవాళ పెద్దగా పనింలేదు" చెప్పాడు సింగ్.

షిప్ కెప్టెన్ వంక నవ్వుతూ, చనువుగా మాట్లాడుతున్న కిరణ్ వంక దగ్గరలో వున్న వాళ్ళు కొందరు ప్రత్యేకంగా చూశారు.

"ఇంకా ఎన్నిరోజులు పడుతుంది మనం గమ్యం చేరడానికి?"

"ఏం అప్పుడే బోర్ కొడుతుందా షిప్ లైఫ్, మరో పదురోజుల్లో ఆస్ట్రేలియా చేరుకొంటాం" అన్నాడు సింగ్.

చిన్నగా నవ్వి చెప్పాడు కిరణ్ "మొదట రెండు రోజులు రకరకాల దేశాల ప్రయాణీకులతో పరిచయాలు, శబ్దకాలుష్యంతో నిండివుండే నగర జీవితంలా కాక ప్రశాంత వాతావరణం, చల్లని సముద్రపు గాలి ఎంత చూసినా తనివితీరని సముద్రపు అందాలతో ఉల్లాసంగా గడిచిపోయాయి. కానీ రాను రాను యేదో అనాసక్తి, ఒంటరితనం ఫీలవ్వక తప్పడంలేదు."

"షిప్లో దూరప్రయాణంచేసే ప్రతి ప్రయాణీకునికి

ఎదురయ్యే సమస్యే ఇది" అని గొంతు తగ్గించి, తగ్గు స్వరంగా అడిగాడు సింగ్, "అన్నట్టు నువ్వు ఆస్ట్రేలియా వెళ్ళేది, అక్కడ ప్రత్యేక శిక్షణ తీసుకొంటున్న మా యేజెంట్ల ప్రోగ్రెస్ చెక్ చెయ్యడానికేనా లేక అంతర్గతంగా యేదయినా కారణం ఉందా?" కిరణ్ ఇంటెలిజెన్స్ డిపార్టుమెంట్ ప్రత్యేక గూఢచారి అన్న విషయం తెలిసిన వ్యక్తి షివ్‌లో సింగ్ ఒక్కడే.

"సింగ్, అలాంటిదేమయినా వుంటే నీకు చెప్పనా, ఇండియాలో నీకంటె ముఖ్యమైన స్నేహితులు యెవరున్నారు చెప్పు నాకు!"

"ఓకే.... ఓకే.... సందేహం వచ్చి అడిగానంతే" అని, టైమ్ చూసుకున్నాడు సింగ్. "కంట్రోల్ రూమ్‌కి వెళ్ళాల్సిన పని మా ఛీఫ్, అక్కడ గత రెండురోజులుగా యేదో డిఫెక్టు కన్పిస్తూందని చెబుతున్నాడు, మధ్యాహ్నం రూమ్‌కొస్తా వీలుంటే" అని హడావిడిగా వెళ్ళిపోయాడు.

## 2

సన్నటి పొడుగాటి కారిడార్‌లో నడుస్తున్నాడు కిరణ్. కారిడార్‌లో వుడ్‌తో నిర్మించిన గదులు యెడంవయిపు పొడుగునా వున్నాయి. కుడివయిపు కొంతవరకే ఉన్నాయి గదులు. ప్రక్కన కంట్రోల్ కనెక్షన్ రూమ్ ఆపై స్టోర్స్ గదులు.

బాగా రాత్రి అవడంవల్ల కారిడార్‌లో చాలావరకూ దీపాలు ఆర్పేశారు. అన్ని గదుల తలుపులు మూసి ఉన్నాయి. జాగ్రత్తగా వింటే కొన్ని గదుల్లోంచి సన్నగా మాటలు వినబడుతున్నాయి.

కిరణ్ కుడివయిపు వరసలో ఆఖరి రూమ్ సమీపిం

చాడు. మరో ఆరడుగులు నడిస్తే ఎడంవయిపు అతని రూమ్ వస్తుంది.

ఆఖరి రూమ్ దాటుతుండగా అతడి చెవికి స్పష్టంగా వినిపించింది ఎలక్ట్రానిక్ వేవ్!? 'బీ....ప్ ప్ ప్'మంటూ.

సర్వసాధారణంగా ఎవరూ పట్టించుకోరు అలాంటివి. కిరణ్ కి పుట్టిన సందేహం ఒక్కటే అక్కడ అలాంటి శబ్దాలు కంట్రోల్ కనెక్షన్ రూమ్ నుండి రావడానికి మాత్రమే ఆస్కారం ఉంది. కానీ ఆ రూమ్ స్టీల్ తలుపులు పూర్తిగా లాక్ చేయబడి వున్నాయి—మరి యెక్కడనుం....

చిన్న శబ్దంతో ఆఖరి రూమ్ తలుపు తెర్చుకొంది. సూక్ష్మంగా చూశాడు కిరణ్ అటువైపు.

తలుపు తెరిచిన వ్యక్తి కిరణ్ ని చూసి అవాక్కయి తలుపు వేసేశాడు. తలుపు తెరవడానికి మూయడానికి దాదాపు మూడు క్షణాల పైనే పట్టింది.

అది చాలు కిరణ్ కి. అతడి చురుకైన చూపు, ఆ వ్యక్తిని దాటి వెనగ్గా వెళ్ళి, కాస్త గోధుమ రంగులో అక్కడక్కడ చిన్న చిన్న లైట్లు వెలుగుతున్న ఓ. రౌండ్ టేబుల్ లాంటి వస్తువు పైపడింది. దానిని పరిశీలించే లోపే మూసుకుంది తలుపు.

అన్యమనస్కంగా తన రూమ్ కి వెళ్ళి పడుకున్నాడు కిరణ్. అతడి శరీరం పూర్తిగా అలసిపోయింది. కళ్ళు మూసుకొన్నాడు. తలుపు తెర్చుకోగానే ముందు తన దృష్టిలో పడిన రూపాన్ని గుర్తు తెచ్చుకోసాగాడు.

పొట్టిగా లావుగా తెల్లగా వున్నాడతను. ముఖ్యంగా క్రిందిరెప్పలు బరువుగా సాగివున్న ఎద్దు కళ్ళు వాడివి.

ఎందుకో లేచి, ఆ విషయం సింగ్ కి చెబుదామా?

అనిపించింది కిరణ్ కి. కానీ, చిన్న విషయానికి అంత ప్రాముఖ్యత ఎందుకులే అని ఊరుకొని, నిద్రలోనికి జారుకున్నాడు

అతను తీసుకొన్న ఆ నిర్ణయానికి ఫలితం సుమారు ఆరుగంటల తరువాత అత్యంత భయానకంగా ఎదురవ్వబోతుందని అతడికేం తెలుసు!?

## 3

హఠాత్తుగా మెలకువ వచ్చింది కిరణ్ కి!?

చప్పున లేచి కూర్చున్నాడు. అతడికి మాటల్వ స్పష్టంగా తెలుస్తుంది. కేకలు అరుపులు, తుపాకీ చప్పుళ్ళు కలగాపులగంగా వినిపిస్తున్నాయి.

గట్టి వస్తువుతో అతడి గది తలుపులు బాదుతున్నారు ఎవరో!?

లూజుగా వుండే చారల నైట్ డ్రస్ లో వున్నాడు కిరణ్. ఏదో ప్రమాదం క్రమ్ముకొస్తుందని అర్థమౌతోంది అతడికి. వేగంగా కదిలాడు. మూలనున్న చెక్క తలుపు లాగాడు. అందులోనుండి వైర్ లెస్ ట్రాన్స్ మీటర్ కమ్ ఆటోమేటిక్ కంప్యూటర్ తీసి జేబులో వేసుకున్నాడు.

అప్పటికే పెళ్ళున విరిగిపోయింది గది తలుపు సగానికి. ఆ ఖాళీలోనుండి నల్లటి గండ్రగొడ్డలి లోపలికి వచ్చింది. కిరణ్ విస్మయంగా చూస్తున్నాడు.

వికటంగా నవ్వుతున్నాడు విరిగిన తలుపులోనుండి కనిపించే వ్యక్తి నల్లగా దృఢంగా వున్నాడతను తుప్పలాంటి జుట్టుకి అడ్డుపట్టగా బలంగా కట్టిన గుడ్డముక్క. మెడదగ్గర 'వి' షేపులో కత్తిరించబడిన నల్లటి మాసిపోయిన బనియన్.

మిగిలిన తలుపు ఒక్క వ్రేటుతో నరికేసి లోపలికి వచ్చేశాడు. అతడి బనియన్ మీద రొమ్ముకి కాస్త క్రిందగా తెల్లగా పన్నెండు అనే నంబరు వేసివుండడం గమనించాడు కిరణ్.

కిరణ్ వెనక్కి నడుస్తూ తనకు కావలసిన విధంగా పొజిషన్ కి వచ్చాడు. కుడిచేయి టీపాయ్ మీదకు జరి పాడు. ఎదురుగా ఉన్న ఆ వ్యక్తి హేళనగా నవ్వుతూ, చేతిలో గొడ్డలి ఒడుపుగా కదుపుతున్నాడు. ఏ క్షణా న్నయినా దాన్ని విసిరేలా వున్నాడు.

కిరణ్ చేతికి కావలసిన వస్తువు అందింది. అది అర చేతిలో సగం పరిమాణంలో ఉండే ఆధునికమైన రివా ల్వర్. శత్రువు ప్రాణాలు రవ్వంత బుల్లెట్ తో తీసే ప్రమాదకరమైన మారణాయుధం!

అంతవరకూ మన్నుతిన్న పాములా మెల్లగా వెనక్కి వెళ్ళిన కిరణ్ హఠాత్తుగా మెరుపులా కదిలాడు. కాలితో టీపాయ్ ని వెనక్కి తోసి, మోకాలిమీద వంగి పేల్చాడు రివాల్వర్.

ఎలాంటి శబ్దం లేకుండా బులెట్ ఆ వ్యక్తి పొట్టలో తగిలింది. శత్రువు ముఖంలో నవ్వు మాయమయింది. రక్తంతో తడిసిపోతూంది బనియన్.

“క్రాక్” మంటూ బిగ్గరగా అరిచి గొడ్డలి గాల్లోకి ఊపాడు. గాయంవల్ల గొడ్డలి వేగం చాలావరకు తగ్గింది. అప్పటికే కిరణ్ బెడ్ మీదకి వంగి తప్పుకున్నాడు. కిరణ్ జేబులో ఉన్న ట్రాన్స్ మీటర్ కి తగిలింది గొడ్డలి.

రెండోసారి గొడ్డలి లేపాలని ప్రయత్నించి విఫల మయ్యాడు. భీకరంగా అరవడం తప్ప ఏం చేయలేక పోతున్నాడు ఆ వ్యక్తి. బులెట్ పని చేయసాగింది. ఆ

వ్యక్తి కడుపు దగ్గర గాయం పెద్దదై పోతూంది పుస్తకం మీద పడ్డ యాసిడ్ లా. అతడి దేహాన్ని కాల్చుకుంటూ పోతూంది బులెట్.

కారిడార్ లోనికి వచ్చేశాడు కిరణ్. కకావికలై పోతున్నారు ప్రయాణీకులు. బందిపోట్లు చాలామందిని చంపేశారు. కొంతమందిని అప్పుడే చంపుతున్నారు. తుపాకులతో, గొడ్డళ్ళతో, బరిసెలతో స్వైరవిహారం చేస్తున్నారు దొంగలు.

గంటక్రితం వరకూ ప్రశాంతంగా ప్రయాణించిన ఆ ఓడ ప్రస్తుతం రక్తంతో తడుస్తూంది.

శీఘ్రంగా తప్పించుకుంటూ, బాణంలా పరిగెడుతున్నాడు కిరణ్. హఠాత్తుగా ఓ చెయ్యి అతడిని గది లోనికి లాగింది.

# 4

"సింగూ నువ్వా?" అన్నాడు కిరణ్ ఆనందంగా. సింగ్ క్షేమంగా ఉండడం అతడికి సంతోషాన్ని కలిగించింది.

స్టీల్ తలుపులు లాక్ చేస్తూ చెప్పాడు సింగ్ "లక్కీగా వచ్చావు సమయానికి. జాగ్రత్తగా పారిపోవాలి. మన షిప్ ను వాళ్ళు పూర్తిగా ఆక్రమించేశారు."

"మీ రక్షణ సిబ్బంది అంతా ఏం చేస్తున్నారు?" ఉక్రోషంగా అడిగాడు కిరణ్.

తేరిపార చూశాడు సింగ్. "షిప్ లో ఇంత బీభత్సం జరుగుతూంటే కెప్టెన్ నయిన నేను ఇలా తప్పించుకొని పారిపోవాలనుకోవడం, చిత్రంగా అనిపిస్తుంది కదూ నీకు — తెల్లవారుజామునే ఎవరూ ఊహించనంత హఠాత్తుగా దాడిచేశారు వాళ్ళు. సిబ్బంది అప్పటికి

ఎలర్ట్ గా లేరు. అలారమ్స్ మ్రోగి సిబ్బంది పొజిషన్ కి వచ్చేసరికి, సగంమందిని చంపేశారు వాళ్ళు. నరరూప రాక్షసులు వాళ్ళు. వాళ్ళతో పోరాటం అంటే కావాలని ఊబిలో మునిగినట్టే" ఒగరుస్తూ చెప్పాడు సింగు.

తలుపులు బాదుతున్నారు అవతల. ఇద్దరూ వేగంగా కదిలారు. అప్పుడప్పుడు ప్రేలుళ్ళు వినబడుతున్నాయి.

"మై గాడ్. ఎక్స్ప్లోజివ్స్ కూడా ఉపయోగిస్తున్నారు" గొణిగాడు సింగ్.

ఇద్దరూ గదిమధ్యలో అండర్ ఎస్కేప్ రూమ్స్ కి మార్గంగా వున్న వెడల్పాటి రంధ్రంలోనికి దిగసాగారు. సింగ్, కిరణ్ వెనుకగా దిగి, గుండ్రటి ఇనుప తలుపు రంధ్రంపై మూసి వేసి లాక్ చేసేశాడు.

క్రింద చాలావరకూ చీకటిగా ఉంది. అక్కడక్కడా మినీ బల్బులు వెలుగుతున్నాయి. "ఇటు పద" అన్నాడు సింగు టార్చి వెలిగించి. అత్యంత ప్రకాశవంతంగా వున్న టార్చి వెలుగులో చుట్టూ చూస్తూ నడిచాడు కిరణ్. అర్థంకాకుండా బిగించబడి వున్న ఇనుపగొట్టాలు, తుప్పు పట్టిన లావాటి గొలుసులు. పెద్ద చెక్కడ్రమ్ములతో విశాలంగా వున్నాయి ఆ గదులు.

ఎదురుగా ఉన్న రూమ్ ఓపెన్ గా ఉండటంతో టార్చి ఆర్పేశాడు సింగ్. తెల్లబోయాడు కిరణ్ అక్కడ చూసి.

నలుగురు ప్రయాణీకులు ఉన్నారక్కడ లైఫ్ బోట్ సిద్ధం చేస్తూ. యంత్రంతో నడిచే ఖరీదైన లైఫ్ బోట్ అది.

అందులో ఒక వ్యక్తి సింగ్ వంక చూసి చెప్పాడు. "కెప్టెన్-ఇక మనం తొందరగా వెళ్ళిపోవడం మంచిది"

మిగతా వాళ్ళు కిరణ్ వంక ఆసక్తిగా చూస్తున్నారు.

అప్పటికే బోట్ స్టార్టయింది. కిరణ్ ముందు తామిద్దరమే ఎస్కేప్ అవుతున్నాం అనుకున్నాడు. సింగ్ కెప్టెన్ గా, కనీసం నలుగురు ప్రయాణీకులనయినా రక్షించినందుకు సంతోషించాడు.

బోట్‌లో ఎక్కి కూర్చున్నాడు. చాలా పెద్ద బోట్ అది. అందరూ హాయిగా కూర్చోవచ్చు. కాసేపటికి చూసాడు కిరణ్ — బోట్‌లో ఒక స్త్రీ కూడా ఉండడం. పాంట్, షర్టులో ఉండడంతో ముందు చూసినప్పుడు గుర్తించలేకపోయాడు. ఏడుస్తున్న ఆమెను ప్రక్కనున్న వ్యక్తి ఊరడిస్తున్నాడు.

సింగ్ బోట్ ఫ్యూయల్ చెక్ చేసి, ఏ దిశగా వెళ్ళవలసింది డయల్‌లో చూస్తున్నాడు.

వాళ్ళంతా బోటులో ఎక్కిన రెండు నిమిషాలకు, షిప్‌కి అడుగున నీటి మట్టానికి సమంగా ఉన్న చిన్న షెడ్ లాంటి ఓపెన్ స్పేస్ నుండి బోటు నీటిలోనికి ఉరికింది. నీటిని తాకగానే కుదుపుకి అంతా కూలి పడబోయారు.

క్రింద నీళ్ళల్లో గుండెలు జలదరించే దృశ్యం చూశారంతా. ఎంతోమంది ప్రయాణీకులు చిత్రవధ చేయబడి, క్రిందకు విసిరివేయబడి నీళ్ళలో తేలుతున్నారు. కొంతమంది బందిపోట్లకు భయపడి నీటిలో ఉరికి, ప్రాణం పోగొట్టుకొన్నారు. నీరంతా ఎర్రగా మారి ఉంది ఆ ప్రదేశంలో.

“కెప్టెన్ అక్కడ చూడండి” అన్నాడొక వ్యక్తి, బోటు కొద్ది దూరం వచ్చాక అంతా పైకి చూశారు తటాలున.

ఇద్దరు దొంగలు షిప్ అంచున చిన్నగా కనబడుతున్నారు. కల్లు తాగిన కోతుల్లా గెంతుతున్నారు, బోట్‌ని చూస్తూ. ఎత్తుగా ఆకాశంలోనికి ఉన్నట్టున్న, షిప్ అంచు మీదనుండి వచ్చే వాళ్ళ తిట్లు విపరీతమైన గాలికి చెల్లాచెదరుగా, అస్పష్టంగా వినిపిస్తున్నాయి.

"మిగతా వాళ్ళను కూడా పిలుస్తారేమో?" అన్నాడు సింగ్.

బోటుకి కొద్ది దూరంలో రాళ్ళు పడేసినట్టు నీళ్ళు పైకి లేచాయి నాలుగయిదు చోట్ల.

"రైఫిల్స్ పేలుస్తున్నారు" చెప్పాడు, సింగ్ ప్రక్కన కూర్చున్న వ్యక్తి.

బోటు నడుపుతున్న వ్యక్తి కంగారుగా చెప్పాడు "గ్రెనేడ్స్ కూడా విసిరారంటే మరింత ప్రమాదం. బోటుకి తగిలితే అంతా నీటిపాలవుతాం."

యువతి కళ్ళు విప్పార్చుకొని భయంగా చూస్తుంది. ఆమె కళ్ళల్లో ప్రాణభయం లేదు - తనవాళ్ళను పోగొట్టుకొన్న బాధ, ఆవేదన తప్ప.

బోటులో ఒక రైఫిల్ ఉంది. సింగు దానిని గురి చూసి రెండు రౌండ్లు పేల్చాడు పైకి.

"దాని రేంజ్‌కి అంత దూరం అందదు. పైగా సూటిగా పైకి పోవాలంటే మరీకష్టం" చెప్పాడు కిరణ్.

కిరణ్ మాటలు పూర్తవ్వకుండానే బోటుకి ఎడం వయిపు కాస్త దూరంలో 'దబ్'మన్న శబ్దంతో పాటు అంతెత్తున లేచాయి నీళ్ళు.

అలల తాకిడికి బోటు, తాపీగా ఏటవాలుగా వరిగి మరలా యథాస్థితికి వచ్చింది. పైకిలేచిన నీళ్ళు బోటులో పడ్డాయి. దాదాపు మునిగిపోయినట్టు బోటు వరగగానే,

యువతి 'కెవ్వు'మని అర్చింది. మిగతా వాళ్ళు బోటు అంచులను పట్టుకొని ఉండిపోయారు భయంగా.

"అనుకున్నంతా అయింది" కృంగిపోయాడు సింగ్.

ఉపేక్షించలేదు కిరణ్. తన రివాల్వర్ తీసి, జాగ్రత్తగా గురిచూసి పైకి పేల్చాడు. అది గురి తప్పిందని పేల్చగానే అర్థమైంది కిరణ్ కి. మరోసారి షూట్ చేద్దామనుకొన్నాడు.

సరిగ్గా పేల్చిన మూడు క్షణాలకు షిప్ అంచుమీద, పెద్ద మంటతోపాటు ప్రేలుడు వినిపించింది. బుల్లెట్ శత్రువు విసరబోయే గ్రెనేడ్ కి తగిలిందని గ్రహించాడు కిరణ్. అంతా ప్రశంసాపూర్వకంగా చూశారు కిరణ్ వైపు. సింగ్ మిత్రుడి భుజం తట్టాడు.

బోటు వేగం పెరిగింది. లైఫ్ బోటు ఉంచిన అండర్ రూమ్స్ లోనికి కూడా దొంగలు చొచ్చుకొని వచ్చారు. ఓపెన్ రూమ్ లో నిలబడి, కాల్పులు జరిపారు. అప్పటికే చాలా దూరం వెళ్ళిపోయింది బోటు. షిప్ క్రమేణా దూరం కాసాగింది.

"అదిగో ఆ రాస్కెల్స్ షిప్" అరిచాడొక వ్యక్తి. అంతా చూశారు పరిశీలనగా. పాసింజర్స్ షిప్ వెనకగా, దానిలో సగం పరిమాణంలో ఉన్న, మరో షిప్ లాండ్ అయివుంది.

అరగంట తర్వాత పాసింజర్స్ షిప్ లో వినిపించింది పెద్ద విస్ఫోటనం. బోటులోని వాళ్ళు కూడా త్రుళ్ళిపడేటంత భయంకర శబ్దం అది.

పాసింజర్స్ షిప్ లో నాలుగోవంతు భాగం, తునాతునకలయి గాలిలోనికి లేచింది.

ఎవరూ ఊహించని సంఘటన. రెప్పకూడా వేయ

కుండా ఏదో ఇంగ్లీష్ క్రైమ్ చిత్రం చూస్తున్నట్టు, టెన్షన్‌గా చూస్తున్నారు వాళ్ళు.

మొదటి విస్ఫోటం పూర్తి కాగానే, రెండవ విస్ఫోటం వినిపించింది. నల్లటిపొగ ఒక్క గొడుగులా లేచింది. సముద్రపు దొంగలు తాము దోచిన ఏ నౌకను సర్వ నాశనం చెయ్యకుండా వదిలిపెట్టరు. కేవలం దోచుకోవడమే అన్నది వాళ్ళకు అంతగా సంతృప్తిని కలిగించదు!

పాసింజర్స్ షిప్ తుపాకీగుళ్ళకు గురయిన షార్క్ చేపలా, నీటిలో తునాతునకలయి కాసేపటికి మునిగి పోయింది.

సింగు కళ్ళల్లో నీళ్ళు ఊరడం చూశాడు కిరణ్. మిత్రుని చేయి, తన చేతిలోనికి తీసికొని ఓదార్పుగా నొక్కాడు.

బోటు సాగిపోతూంది వేగంగా. కిరణ్ ఆలోచనలలో మునిగిపోయాడు. తను బయల్దేరింది ఆస్ట్రేలియాలో శిక్షణ పొందుతున్న కొందరు యువ గూఢచారుల ప్రోగ్రెస్ గమనించడానికి. ప్రస్తుత పరిస్థితులు చూస్తే ఏ క్షణాన ఏం జరుగుతుందో అర్థం కావడం లేదు. ప్రాణాలతో ఏదో ఒక ఒడ్డుకు చేరగలిగితే చాలనిపిస్తూంది.

ఇంతలో అందరినీ ఉద్దేశించి చెప్పాడు సింగ్. "ఫ్రెండ్స్! మనమెంత ప్రమాదంలో ఉన్నామో ప్రత్యేకించి చెప్పవలసింది లేదు. ప్రవాహంలో గడ్డిపోచలా, ఈ మహాసముద్రంలో కొట్టుకొని పోతున్నాం. ప్రస్తుతం మన వద్ద అందరికీ సుమారు ఐదురోజులకు సరిపడా ఆహార పదార్థాలున్నాయి. ప్రాణాలు రక్షించుకొనే ప్రయత్నంలో ఇంతకంటే ఎక్కువ ఆహారపదార్థాలు తీసుకొని రాలేకపోయాము....

....వాటినే జాగ్రత్తగా ఉపయోగించుకోగలిగితే, వారం రోజుల వరకూ రావచ్చు. మరో విషయం. మనకు దగ్గరగా ఉన్న ఒడ్డు పడమర. ఒడ్డు చేరాలంటే బోటులో సుమారు రెండువారాల వరకూ ప్రయాణం చేయాలి. శోచనీయం ఏమిటంటే బోటు నడపడానికి రెండువారాలకు సరిపడా ఫ్యూయల్ లేదు. నిజం చెప్పాలంటే మన దగ్గరున్న ఆయిల్ పూర్తిగా వారంరాదు.... అందువలన బోటుకు పగలంతా తెడ్లు వేసి నడపాలి. రాత్రిళ్ళు ఇంజన్ తో నడుస్తుంది.

ఇటువంటి పరిస్థితిలో అంతా ధైర్యంగా కలసికట్టుగా ఉండగలిగితే ప్రాణాలతో బయటపడడానికి ఆస్కారం వుంది. ఏది. యేమయినా అంతా ఒక విషయం గుర్తుంచుకోవాలి. ప్రమాదం మనకు యెంతో దగ్గరగా వుంది."

సింగు చెప్పింది, తమ ప్రాణాలకు సంబంధించిన తీర్పు వినే ముద్దాయిల్లా ఊపిరికూడా పీల్చకుండా విన్నారంతా.

కాసేపటికి తేరుకొని అందరూ తమ తమ వివరాలు తెలియజేసారు.

## 5

సింగు ప్రక్కన కూర్చున్న వ్యక్తి విన్సెంట్. అమెరికన్. అతడొక్కడే ప్రయాణిస్తున్నాడు షిప్ లో. పొట్టిగా పీలగా బాగా తెల్లగా ఉన్నాడతడు.

డ్రైవ్ చేస్తున్న వ్యక్తి హుయ్ చెయ్ హుయ్. చైనీస్. పొట్టిగా బలంగా వున్నాడతను. దొంగల దాడిలో తన భార్యను పోగొట్టుకున్నాడు.

ఏడుస్తున్న స్త్రీని ఓదార్చిన వ్యక్తి కార్ల్, అతడూ అమెరికనే. అతని వెంటవచ్చిన స్నేహితుడు దొంగలతో

పోరాడి మరణించాడు. వెడల్పాటి మొహంతో పొడుగ్గా వుండాగా ఉన్నాడతను.

యువతి పేరు ఫ్లోరా. స్పెయిన్ దేశస్థురాలు. ఆమె భర్తను పిల్లలను అతి దారుణంగా వధించారు దొంగలు. ఆ షాక్ నుండి ఇంకా కోలుకోలేదామె. ఆమె మొహంలో దుఃఖపు నీడలు ఆమె అందాన్ని దాచలేకపోతున్నాయి.

కిరణ్ కూడా తన వివరాలు చెప్పాడు. తాను ఆర్కియాలాజిస్ట్ నని, ఆస్ట్రేలియాలో చారిత్రాత్మక కట్టడాలు చూడడానికి వెళుతున్నానని చెప్పాడు.

"గత రెండురోజులనుండి మా ఛీఫ్ కంట్రోలర్ షిప్ స్క్రీన్ మీద ఏదో డిఫెక్ట్ వస్తూందని ఆపరేటర్లందరికీ తెలియబరిచాడు. వాళ్ళతోపాటు నేనూ టెస్టు చేశాను.... ఛీఫ్ చెప్పింది నిజమే. ఎవడో ద్రోహి షిప్ లో నుండే బందిపోట్లకు మెసేజ్ అందిస్తూ, షిప్ యే దిశగా వెళుతున్నదీ, వాళ్ళు యే దిశగా రావలసినది సూచిస్తున్నాడు. అదే స్క్రీన్ మీద షిప్ కి అడ్డుగా కనబడుతూంది. విషయం పూర్తిగా అర్థమయ్యేసరికి అంతా మించిపోయింది" విచారంగా చెప్పాడు సింగ్.

అంతా ఆసక్తిగా విన్నారు. కిరణ్ టెన్షన్ గా కదిలాడు. అతడికి రాత్రి సంఘటన గుర్తొచ్చింది. వెంటనే తాను చూసింది వివరంగా చెప్పాడు అందరికీ.

"ఖచ్చితంగా వాడు దొంగల మనిషే అయుంటాడు. ఏదో వంకతో ప్రయాణీకుడిగా నౌకలో ప్రవేశించాడు. మెసేజ్ అందించాడు" అన్నాడు విన్సెంట్.

"అదే అయ్యుంటుంది. లేకపోతే సముద్రం మీద వెళ్ళే షిప్ రూట్ కనుగొనడం దొంగలకు అంత తేలిక కాదు" అన్నాడు సింగ్.

మిగతా వాళ్ళు ఏం మాట్లాడలేదు. మౌనంగా వుండి పోయారు.

కిరణ్ కి అకస్మాత్తుగా గుర్తొచ్చింది. జేబులో తడిమాడు. అతడి మొహంలో ఆనందం వెల్లివిరిసింది. వణుకు తున్న చేతులతో వైర్ లెస్ ట్రాన్స్ మిటర్ బయటికి తీశాడు. అంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు కిరణ్ వంక, అతని చేతిలో వస్తువు వంక. సింగ్ అదేమిటో అప్పటికే గమనించేశాడు. కిరణ్ వంక చూసి నవ్వాడు చిన్నగా.

చూపుడు వ్రేలితో బటన్ నొక్కాడు కిరణ్. టక్కున వెలిగింది ఎర్రలైట్. చిత్రంగా అనిపిస్తుంది కిరణ్ కి. మృత్యువు నోటిదాకా వెళ్ళి తిరిగి వెనక్కి రాగలగడం.

మరో రెండు బటన్ లు నొక్కి చెప్పాడు "హాలో.... హాలో ...కిరణ్ స్పీకింగ్ ....కిరణ్ స్పీకింగ్, ఓవర్."

కిరణ్ చేతిలో వున్న ట్రాన్స్ మిటర్ లోనుండి ఓ కంఠం వినిపించింది. "యస్ భరద్వాజ స్పీకింగ్ .... భరద్వాజ స్పీకింగ్ .... వాట్స్ ది మే ..."

ఊహించని విధంగా ఎర్రలైట్ ఆరిపోయింది. కిరణ్ కనుబొమ్మలు దగ్గరయ్యాయి. సింగ్ దగ్గరగా వంగాడు.

కొద్దిగా కదిపి చూశాడు యంత్రాన్ని చిన్న శబ్దం తప్ప లైట్ మళ్ళీ వెలగలేదు చుట్టు పడుతూండగా అన్ని స్విచ్ లు నొక్కి చూశాడు కిరణ్. అతడికి అర్థమైంది అది పని చెయ్యడంలేదు. బహుశా దొంగతో పోరాడినప్పుడు, వాడి గొడ్డలి తగిలి పాడయి వుండవచ్చు.

"ట్రై చెయ్యి కిరణ్" అన్నాడు సింగు ఆశగా.

"లాభంలేదు. పాడయిపోయింది" అని సింగుకి అందిం

చాడు దానిని.

పదినిమిషాలు పైగా చేశాడు సింగు. ప్రయోజనం లేక పోయింది సింగు నుండి తిరిగి యంత్రాన్ని తీసుకొన్నాడు కిరణ్. నీటిలోనికి విసిరివేయాలనుకున్నాడు దానిని. మళ్ళీ ఎందుకో మనస్కరించక జేబులో వేసుకొన్నాడు. ఆ రోజంతా మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాడు. కాని అది పని చేయలేదు.

ట్రాన్స్మిటర్ పనిచెయ్యక పోవడంతో కొద్దిగా డీలా బతిన్నాడు కిరణ్. చుట్టూ చూశాడు. కనుచూపు మేరలో ఎటు చూసినా నీరు. మబ్బులతో నిండిన ఆకాశం బాగా దగ్గరగా ఉన్నట్టుంది.

ఎందుకో నీరు ఆకాశం అనే రెండు ఇనుప పొరలమధ్య ఊపిరి అందకుండా అణిగిపోతున్నట్టు అనిపించింది కిరణ్కి.

మిగతావాళ్ళ పరిస్థితికూడా అలాగే వుందని వాళ్ళ ముఖాలు చూసి చెప్పవచ్చు.

# 6

ఆరు రోజులు గడిచాయి — అదృష్టవశాత్తు అంత వరకూ ఏ ప్రమాదం లేకుండా ప్రయాణించారు వాళ్ళు.

తెల్లవారింది — ఉదయం ఆరున్నర అయింది.

చల్లటి ఈదురుగాలికి అందరికీ మెలకువ వస్తూంది.

కళ్ళు తెరిచిన కిరణ్ ఆశగా చుట్టూ చూశాడు. ఏదయినా దీవిలాంటిది కనుచూపు మేరలో కనబడు తుందేమోనని. నీరుతప్ప ఏం కనిపించలేదు.

మండిపోతున్న కళ్ళను స్వాధీనంలోనికి తెచ్చుకొంటు న్నాడు కిరణ్. కాసేపాగి ఒళ్ళు విరుచుకొని తెడ్డు అందుకొన్నాడు.

సింగుని, హుయ్‌ని తట్టిలేపాడు "ప్లీజ్ ఎవరూ ఉద్ధకించకండి. కనీసం కొన ప్రాణాలతో నయినా ఒడ్డు చేరడానికి ప్రయత్నిద్దాం-" అన్నాడు.

"ఫుడ్‌టిన్స్ కొద్దిగానే ఉన్నాయి. గట్టిగా వస్తే ఎల్లుండివరకూ వస్తాయి" అన్నాడు హుయ్ టిన్స్ చెక్ చేస్తూ.

ఇంతలో సింగు, హుయ్‌ని ఉద్దేశించి "ఇంజన్ రాక్ అంతా ఒకసారి చెక్ చెయ్యి. నాకేదో అనుమానంగా ఉంది" అన్నాడు, గ్లాస్ పగిలివున్న దిక్కులు సూచించే డయల్ వంక అనుమానంగా చూస్తూ.

సింగు, కిరణ్ ఇద్దరే తెడ్లు వేయసాగారు. దాదాపు రెండుగంటల విశ్రాంతి తర్వాత మళ్ళీ కదిలింది బోటు. ఇంజన్ స్టార్ట్ చేశాడు హుయ్. మళ్ళీ ఆఫ్ చేసి మిగతా మీటర్లు చూశాడు. ఫాల్టు ఏమీ కనిపించలేదతడికి.

చివరగా దిక్కులు సూచించే డయల్ మీద చేయి వేశాడు. గ్లాస్ పగిలి, కాస్త లూజ్‌గా ఉండడం చూసి, "బోటు దిశ మార్చండి" అన్నాడు.

సింగు, కిరణ్ తెడ్ల సహాయంతో అడ్డంగా తిప్పారు బోటుని. హుయ్ డయల్ పరీక్షగా చూసి, ఏదో విషపు పురుగును చూసినట్లు త్రుళ్ళిపడి "మైగాడ్' అన్నాడు కళ్ళు తేల వేస్తూ.

"ఏమయింది?" అంటూ సింగు, కిరణ్ ఒకేసారి డయల్‌లోనికి చూశారు. ఎర్రముల్లు ఎప్పటిలాగే 'డబ్ల్యు' మీదే ఉంది. బోటు తిరిగిన దిశనుబట్టి ప్రస్తుతం అది 'నార్త్' అంటే, 'ఎన్' అనే అక్షరంపై ఉండాలి!?

ఇద్దరి ముఖాలు పాలిపోయాయి.

"అ.... అంటే అది పనిచెయ్యడంలేదా?" అడిగాడు

సింగు, కిరణ్ ని. అతడికి సముద్రం తలక్రిందులవుతున్నట్లు ఉంది.

"పడమర దిక్కుకే పోతున్నామనుకొని రాత్రంతా పిచ్చివాళ్ళలా తెడ్లు వేశాము. ఇప్పుడు ఎటువైపు ఉన్నామో ఎలా తెలుస్తుంది" అన్నాడు కిరణ్.

ఈ హడావిడికి విన్సెంట్, ఫ్లోరా నిద్రలేచారు. జరిగింది తెలుసుకొని కళ్ళు తేలవేశారు.

సింగ్ స్వగతంగా అన్నాడు. "నరరూప రాక్షసులయిన దొంగల బారినుండి తప్పించుకొన్నాం. కేవలం లైఫ్ బోటులో ఆరుగురం ఏ ప్రమాదం లేకుండా, ఇంత వరకూ ప్రయాణించడం అదృష్టమే అనుకొన్నాను. కానీ, ఇంతదూరం వచ్చాక దురదృష్టం ఈ రూపంలో ఎదురౌతుందని కలలో కూడా ఊహించలేదు ..."

పెద్దగా అలలు లేని ప్రశాంతమయిన సముద్రంలో నిశ్చలంగా ఉన్న బోటులో పెరిగిన గడ్డాలు, దువ్వ లాంటి తలలు, పిచ్చి చూపులతో హఠాత్తుగా ఎదురయిన అతి పెద్ద ప్రమాదాన్ని ఎలా ఎదుర్కోవాలో ఎవ్వరికీ అర్థంగాక మౌనంగా ఉండిపోయారు ఆ ఐదుగురూ పావు గంటవరకూ.

సింగు కదిలాడు. ఇంజన్ స్టార్ట్ చేసి పోనిచ్చాడు. ఒక నిశ్చయానికి వచ్చినట్లు ఉంది అతడి ముఖం.

చిత్రంగా చూశారంతా. "సింగ్ ఏమిటి నువ్వు చేసేది?" తెల్లబోతూ అరిచాడు కిరణ్. వెనక్కు తిరిగి చెప్పాడు సింగు.

"కిరణ్ ప్రస్తుతం మనం ఏ దిశలో ఉన్నామో మనకే తెలియదు. అటువంటప్పుడు గుడ్డిగా ఎంత దూరమని నడుపుతాం దీన్ని?...

....ఎలాగూ మృత్యువు నోటికి చిక్కాం. సూర్యుని విచారించేకంటే, ఈ కాసేపయినా రిలీఫ్ గా ఉండండి."

ఆ సమాధానానికి కిరణ్ మాట్లాడలేక పోయాడు. మిగతా వాళ్ళవంక చూశాడు. దీనికి పెద్దగా వ్యతిరేకిస్తున్నట్లు కనిపించలేదు వాళ్ళు.

రాత్రి ఎనిమిది అయ్యింది—

బోటు పయనిస్తూనే ఉంది. ఇప్పుడు హాలయ్ నడుపుతున్నాడు. అంతా మౌనంగా ఉన్నారు. తమ ప్రయాణానికి గమ్యం లేదని తెలియడంతో, మాట్లాడడం కూడా వృధా అనిపించేటంతగా మారిపోయారు వాళ్ళు.

బోటు ఆగిపోయింది.

హాలయ్ కాసేపాగి వెనక్కి తిరిగి, అందరి ముఖాల్లోనికి చూశాడు చీకట్లో. రిజర్వ్ గా మిగిలివున్న ఇంధనం కూడా అయిపోయిందన్న నిజాన్ని జీర్ణించుకోడానికి ప్రయత్నిస్తున్నారంతా.

కొద్దిసేపు గడిచింది. ఉలిక్కిపడ్డారంతా!?

'టక్కు టక్కు'మని శబ్దం వినిపిస్తూంది. బోటు కదిలి పోతుంది. హాలయ్ చటుక్కున క్రిందికి వంగి చూసి, "ఓ....వాటె హెల్?" అంటూ అర్చాడు.

కిరణ్, సింగు నీటిలోనికి చూసి కొయ్యబారి పోయారు!??

## 7

అరచెయ్యి పరిమాణంలో గల గుండ్రటి చేపలు వడ్రంగి పిట్టలా బోటుని చెక్కేస్తున్నాయి.

"వేగంగా కదిలి ఇక్కడనుంచి" అని అరిచి తెడ్డు అందుకొన్నాడు కిరణ్. సింగు, కార్క్ కూడా తెడ్లు అందుకొన్నారు.

చెక్కతో తయారు చేయబడిన తెడ్డు నీటిలోనికి మునిగీ మునగగానే దానిచుట్టూ, ఇరవై ముప్పై చేపలు చేరాయి. తెడ్డును కూడా కొరకడానికి ప్రయత్నిస్తున్నాయి.

అందరికీ ప్రాణాలమీద ఆశపోయింది ఆ చేపల్ని చూసి. మృత్యువు సమీపించిందని గ్రహించారు.

అప్పటికే బోటులోనికి నీళ్ళు వచ్చేశాయి. ఫ్లోరా వణికిపోతూంది. బిస్కెట్ ఖాళీ టిన్ను డబ్బాలు అణిచి రంధ్రాలకు అడ్డు పెట్టాలని ప్రయత్నిస్తున్నాడు. హుయ్ తెడ్డును బోటు అడుక్కి జొనిపి చేపల్ని చెల్లాచెదురు చేస్తున్నాడు.

కార్క వున్నచోట బోటు పూరిగా చీలిపోవడంతో, అయినా నీటిలోని జారిపోయాడతడు. చేపలు బోటు అడుగు భాగాన్ని తునాతునకలు చేసేశాయి. ముక్కలై పోయిన బోటునుండి యెవరి దొరికిన వాళ్ళు విడిపోయి కాళ్ళూ. చేతులు బలంగా తాటిస్తూ ఈదసాగారు. వడ్రంగి చేపలు వాళ్ళ తెరువుకు రాలేదు.

నీటిలోనికి దూకిన నాలుగు క్షణాల్లో మోకాలికి ఏదో గట్టిగా తగలడంతో ముందు బెదిరి, తర్వాత అది రాయి అని గ్రహించి, చేతికి దొరికిన ఆధారంతో పైకి ప్రాకాడు కిరణ్. చేపల బెడద వదిలిపోవడంతో ప్రాణం లేచి వచ్చినట్టుంది అతడికి.

చేతులతో తడిమాడు తనున్న ప్రదేశాన్ని.. అంతా మెట్టలా ఉందది. క్రమంగా దానిమీద వాలిపోయాడు.

మిగతా వాళ్ళ అరుపులు దగ్గరగా వినిపిస్తున్నాయి కిరణ్ కి.

“కిరణ్ యు ఆర్ సేఫ్?” సింగు కంఠం వినిపించింది

క్షేమంగా. సింగుకూడా క్షేమంగా వున్నాడని గ్రహించి, అరిచి చెప్పాడు "యస్." తర్వాత అందరూ కేకలతో క్షేమంగా వున్నట్టు తెలుపుకొన్నారు.

తెల్లవారే వరకు యెక్కడి వాళ్ళక్కడే వుండడం మంచిదని నిర్ణయించుకొన్నారు.

# 8

తెల్లవారింది—

ఒకటి రెండుచోట్ల చేపల కాట్లు తిన్న శరీరం, ఎండిన ఉప్పునీటికి సురసుర మండుతూంటే భారంగా కళ్లు విప్పాడు కిరణ్. కొద్దిగా ఎండ పడుతూంటే కళ్ళు చికిలించి చూశాడు. యేవో రంగురంగుల పక్షులు ఎగురుతున్నాయి పైన.

అప్రయత్నంగా చుట్టూ చూశాడు. అతడు ఊహించినట్టే యేదో దీవి అది. దూరంగా పచ్చగా కనబడుతూంది దీవి. దానికి తీరంలో ఇసుక దిబ్బలు, వాటికి ఆనుకొని రాళ్ళ మిట్టలు. ప్రస్తుతం ఆ రాళ్ల మిట్టల పైనే ఉన్నారు వాళ్ళు. కాలువ ఎండిపోయినప్పుడు పైకి తేలే నత్తగుల్లల్లా కానిపించారు కిరణ్ కి, రాళ్ళ గుట్టల పై ముడుచుకొన్న ఐదుగురూ.

బోటు ముక్కలు పక్కనే నీటిలో తేలుతున్నాయి. అదృష్టవశాత్తు బోటు రాతిగుట్టల దగ్గర ఆగిపోయింది. లేకపోతే విరిగిన బోటు ముక్కలకు బదులు, సముద్రంలో వాళ్ల శరీరం భాగాలు తేలుతూ వుండేవి.

కిరణ్ చిన్న గులకరాయితీసి, సింగుకి గురిచూసి విసిరాడు. ఫ్లోరాకి తగిలిందది. ఆమె సింగు ప్రక్కనే నిద్రపోతూంది. మెల్లగా కళ్ళు తెరిచిన ఫ్లోరా బలహీనంగా నవ్వింది కిరణ్ ని చూసి. తర్వాత ఇద్దరూ కలసి మిగతా

వాళ్ళను లేపారు.

నిద్రమత్తు వదిలాక ఇసుక దిబ్బలు కూడా దాటి, దీవి లోనికి అడుగుపెట్టారంతా.

దీవిలో కూడా చాలావరకూ ఇసుకే వుంది. కొంత దూరం పోయాక రాళ్ళూ రప్పలూ తగిలాయి. చెట్లు విపరీతంగా వున్నాయక్కడ. వాటివల్ల ముందే ముందో స్పష్టంగా కనిపించడం లేదు.

"ఇది ఒకవేళ ఏదో దేశానికి చెందిన ఐలాండ్ అయ్యుంటుంది" అన్నాడు హాయ్ చుట్టూ పరికిస్తూ.

"ఏ దేశానికి చెందిన ఐలాండ్స్ అయినా తీరంలోనే ఆ దేశానికి సంబంధించిన సింబల్స్ పాతి వుంటాయి. అలాంటివేమీ లేవంటే ఇదేదో, ఇంకా గుర్తింపబడని దీవి అయ్యుండాలి—" అన్నాడు సింగు.

గుర్తింపబడని దీవి అనగానే దాదాపు అందరినీ ఏదో తెలియని భయం క్రమ్మేసింది. నరమాంస భక్షకులైన ఆటవికులు. దేవతలకు బలులు ఇచ్చేవాళ్ళు, ప్రాణాలు తీసే చిత్రవిచిత్రమైన జంతువులు గుర్తొచ్చాయి వాళ్ళకు. వాళ్ళు చూసిన సినిమాలు, చదివిన నవల్సే అందుకు కారణం!

అందరికీ ఆకలిగా వుంది. "దేనినయినా వేటాడి ముందు కడుపు నింపుకొందాం — తరువాత మిగతా సంగతి" అన్నాడు విన్సెంట్.

"మరి నిప్పో?" అన్నాడు హాయ్.

"ఎవరయినా వేటాడగలిగితే, నిప్పు తయారుచేసే పూచీ నాది" అన్నాడు విన్సెంట్.

నవ్వి అన్నాడు కార్ల్ "చివరికి ఆటవికుల్లా మారబోతున్నామన్న మాట."

అంత దుర్భర పరిస్థితిలోనూ మనస్ఫూర్తిగా నవ్వారంతా కార్క్ జోక్‌కి.

విన్సెంట్ చెప్పింది కిరణ్‌కి నచ్చింది. రివాల్వర్ తీసి బుల్లెట్ కేస్ ఊడదీసాడు. టార్గెట్‌కి రాబోయే బులెట్ వెలుపలికి తీసి, దానిపై వున్న సన్నటి గ్లాస్ పొరను జాగ్రత్తగా వేరుచేసి, దూరంగా విసిరేసాడు. తర్వాత బులెట్ యధావిధిగా అమర్చాడు.

"ఏమిటది?" ఆసక్తిగా అడిగాడు సింగు.

"ఆ గ్లాస్‌తో పాటే పేలితే ఈ బులెట్ చాలా పవర్‌ఫుల్‌గా పనిచేస్తుంది, దాదాపు యాసిడ్‌లా. అది తొలగిస్తే మామూలు బులెట్ ప్రభావంతోనే పేలుతుంది" వివరంగా చెప్పాడు కిరణ్.

"ఎన్ని రౌండ్లు పేల్చవచ్చు దీనితో?" అడిగాడు హుయ్.

"దాదాపు డబ్బైరెండు రౌండ్లు పేల్చవచ్చు" కిరణ్ చెప్పాడు.

తర్వాత పావుగంట వెతికారు అంతా కలిసి—

"అదిగో" అంది ఫ్లోరా దూరంగా చూపిస్తూ అంతా చూశారు. గోధుమ రంగులో వున్న పావురంలాంటి పక్షి, ఆకుల మధ్యనుండి అస్పష్టంగా కనబడుతుంది. పరీక్షగా చూసి గురిచూసి పేల్చాడు కిరణ్. అంతా ఊపిరి బిగబట్టారు. నిశ్శబ్దంగా రివాల్వర్ చివర మెరిసింది. మరుక్షణం పక్షి రెక్కలు టపటపలాడిస్తూ, నేలకూలింది.

"గుడ్ షూటింగ్" అన్నాడు హుయ్ కిరణ్‌ని మెచ్చుకోలుగా చూస్తూ.

విన్సెంట్ వ్యాగవుగా వున్న రాళ్ళు వెదికి త్వరగా పొయ్యి తయారుచేశాడు. చకచకా పక్షిని కాల్చి స్వాహా

చేసేశారు అరుగురూ.

కుం సాగా కబుర్లు చెప్పుకుంటూ కాస్త దూరంగా నడిచారు.

అంతే!?

. దూరంగా కనిపిస్తున్న దృశ్యం చూసి, ఏదో ప్రపంచ వింత చూస్తున్నట్టు రెప్పవేయకుండా చూస్తూ విస్మయంగా నిలబడ్డారంతా—

# 9

దూరంగా ఎకుకు సగుకుగా ఉన్న రాతిప్రదేశం మధ్య అత్యంత అధునాతనంగా నిర్మించబడి ఉన్నాయి బలమైన కట్టడాలు రెండు. వాటి ప్రక్కగా కాస్త పొట్టిగా, విశాలంగా రాళ్ళతో నిర్మించబడి ఉంది మరో కట్టడం.

"వాటీజ్ దిస్??" అన్నాడు కార్క్ విభ్రాంతిగా.

"ఇక్కడ ఎవరో నివసిస్తున్నారు!" అన్నాడు కిరణ్.

"ఇప్పుడేమిటి చెయ్యడం?" కట్టడాల వంకే చూస్తూ అన్నాడు సింగు.

కాస్త ఆలోచించి చెప్పాడు కిరణ్. "దగ్గరకు వెళ్ళి చూద్దాం. అక్కడి పొజిషన్‌ను బట్టి ఎలా ప్రొసీడ్ అవ్వాలో నిర్ణయించుకొందాం—"

నిర్మానుష్యమైన ఆ దీవిలో ఏకంగా భవంతులే దర్శనమిచ్చేసరికి, దిగ్భ్రమనుండి పూర్తిగా తేరుకోనకముందే ముందుకి నడిచారు.

ఎడంవయిపు కట్టడం ఎదురుగా చదునుగా ఉన్న బాటపైనుండి పాత జీప్ ఒకటి పెద్దగా శబ్దం చేసుకొంటూ వస్తూంది.

చటుక్కున తప్పుకొన్నారు చెట్లచాటుకి.

కిరణ్ జీప్ వంక చూశాడు. అతడి కనుబొమలు దగ్గరయ్యాయి. షిప్ డ్రైవ్ చేసుకొంటూ వస్తూన్న వ్యక్తిని పరీక్షగా చూసి తెల్లబోయాడు.

ముఖ్యంగా ఆ వ్యక్తి ఎద్దుకళ్ళు కిరణ్ కి ఇంకా గుర్తున్నాయి. అతడు షిప్ లో సీక్రెట్ గా తన వాళ్ళకు మెసేజ్ అందించిన వ్యక్తి!?

కిరణ్ చటుక్కున సింగువైపు చూస్తూ "సింగ్, వీడినే నేను షిప్ లో మెసేజ్ అందిస్తూండగా చూసి, అనుమానించింది" అన్నాడు. జీపు మలుపు తిరిగి కుడివైపుకి వెళ్ళిపోయింది.

"అ....అంటే ఇది ఆ సముద్రపుదొంగల స్థావరమా?" కళ్ళు పెద్దవిచేసి అడిగాడు కార్క్.

"ఇంకా సందేహ మెందుకు? ఇదే వాళ్ల స్థావరం" అన్నాడు కిరణ్.

సింగు మౌనంగా వుండిపోయాడు. అతడి ముఖంలో విచారపు రేఖలు అలుముకొంటున్నాయి. "తిరిగి తిరిగి మళ్ళీ మృత్యువు కోరల్లోకే వచ్చామన్నమాట" అన్నాడు నీరసంగా.

కాసేపాగి ఒక నిర్ణయానికి వచ్చినట్టు చెప్పాడు కిరణ్ దృఢంగా "ప్రస్తుతం మనం చేయగలిగింది ఏమీ లేదు—ఆఖరి ప్రయత్నంగా వాళ్ళతో పోరాడదాం. గెలిస్తే ఎందరికో మేలుచేసిన వాళ్ళం అవుతాం, లేదంటే ఇక్కడ మన చావు ఎలాగూ తప్పదు."

"వాళ్ళతో మనం పోరాడ్డమా?" నమ్మలేనట్టు అడిగాడు విన్సెంట్.

"పోరాడడం అంటే వాళ్ళలా కత్తులు, గొడ్డళ్ల

తీసుకొని దొమ్మిగా కలబడదాం అని కాదు. ప్లాన్డ్ గా వాళ్ళందరినీ బంధిద్దాం. వీలయితే ఇంటియాకు మెసేజ్ ఇచ్చి, మా ఇంటెలిజెన్స్ డిపార్టుమెంట్ ను రప్పిద్దాం" అన్నాడు కిరణ్.

కిరణ్ 'మా ఇంటెలిజెన్స్ డిపార్టుమెంట్' అనగానే సింగు తప్ప మిగతావాళ్ళు ఆశ్చర్యంగా చూశారు. అది గమనించి కిరణ్ నిట్టూర్చి చెప్పాడు "ఫ్రెండ్స్, నే నెవరో చెప్పవలసిన అవసరం వచ్చింది కాబట్టి చెబుతున్నాను" అంటూ, తన వృత్తి వివరాలు చెప్పాడు.

కిరణ్ ఏజంట్ అని తెలియగానే నలుగురికీ ఎక్కడ లేని ధైర్యం, ఉత్సాహం వచ్చింది. కిరణ్ అభిప్రాయంతో మనస్ఫూర్తిగా ఏకీభవించారు వాళ్ళు. "ముందు మనలో కొందరు వాళ్ళలా వేషాలు మార్చుకోవాలి" అన్నాడు కిరణ్.

గట్టిగా నవ్వాడు సింగు "కిరణ్, ఏమిటి నీ పిచ్చి! ఇదేమన్నా సినిమా అనుకొన్నావా, మనం వాళ్ళలా వేషాలు వేసుకోవడం, వాళ్ళను బంధించడం, ఇదంతా జరిగే పనా? ఒక వేళ వేషాలు వేసుకొన్నా వాళ్లు మనల్ని గుర్తించరా?"

"సింగ్, ఇలాంటివి సినిమాలలోనే కాదు—పరిస్థితిని బట్టి నిజజీవితంలో కూడా జరుగుతాయి. వాళ్ళకు దుస్తుల పై నంబర్లు వేసి ఉండడం నాకు గుర్తు. నంబర్లు వేసే అవసరం వచ్చిందంటే వారి సంఖ్య ఎక్కువగా వుందన్న మాట. అటువంటప్పుడు మనం వేషాలు మార్చుకొంటే వాళ్ళు గుర్తించే అవకాశం ఏమాత్రం లేదు" అని, దూరంగా చూసి "అదిగో నలుగురు దొంగలు ఇటే వస్తు

న్నారు" అంటూ కిరణ్ రివాల్వర్ బయటికి తీసాడు.

'ఏ షేపులో కత్తిరించిన నల్లబనియన్‌లు వాటిపై తెల్లటి నంబర్లు వేసి ఉన్న నలుగురు దొంగలు రైఫిల్స్‌తో శివ్ వెళ్ళిన బాటగుండానే వస్తున్నారు.

రివాల్వర్ గురిచూసాడు కిరణ్. ఫ్లోరా కళ్ళు మూసుకొంది. నాలుగుసార్లు నొక్కాడు ట్రిగ్గర్. నలుగురూ కూలిపోయారు. గిలగిలా కొట్టుకొని ప్రాణాలు విడిచారు. వాళ్ల తలలు చితికిపోయాయి బుల్లెట్లకు.

సరిగ్గా పావు గంటలో సింగు, హూయ్, కార్లో, విన్సెంట్ నల్లగా మారిపోయి వున్న దొంగల దుస్తులు ధరించారు. పెరిగిన గడ్డాలతో వాళ్ళు అచ్చం దొంగలలాగానే వున్నారు.

"నా దగ్గర రివాల్వర్ ఉన్నంతవరకూ నాకే ప్రమాదం రాదు. ఫ్లోరా నాకూడానే ఉంటుంది. ముందు మీరు భవంతిలోనికి వెళ్లండి. జాగ్రత్తగా ప్రవర్తించండి" చెప్పాడు కిరణ్.

వాళ్ళు నలుగురూ క్రిందపడిన రైఫిల్స్ అందుకొని ఎడంవయిపు భవంతివైపు నడిచారు.

# 10

"నెంబర్ సిక్స్‌టీఎయిట్ ఎల్లుండి కెనడానుండి, ఒక ప్రయివేట్ షిప్‌లో నాలుగువందల టన్నుల గోధుమలు ఎక్స్‌పోర్టు అవుతున్నాయి. దానిని కొల్లగొట్టడానికి బెటాలియన్ ఫోర్సుని పంపుతున్నాము. వాళ్లలో మీ నలుగురూ కూడా ఉన్నారు గనక బీ....ఎలర్ట్" పూర్తిగా సైన్స్ మెక్ నిర్మించబడిన విశాలమైన ఆ పొడుగాటి గదిలో, వాళ్ళు నలుగురూ తప్ప ఎవ్వరూ లేరు. సౌండ్ ప్రూఫ్ ఏసీ గది అది.

గదిలో రష్యన్ చిత్రకారుడు గీసిన భయంకరమైన చైనీస్ డ్రాగన్ ఆయిల్ పెయింట్ తప్ప మరే ఫర్నిచరూ లేదు. వాళ్ళకు ఎదురుగా వున్న ఆ పెయింటింగ్ లో సూక్ష్మంగా వున్న ఆ రంధ్రాల ద్వారా వినిపించాయి ఆ మాటలు.

"ఎస్ బాస్" అన్నాడు రెండో ఆలోచన లేకుండా. తర్వాత నలుగురూ వెనుదిరిగారు.

"ఆగండి."

ఎవ్వరికీ అడుగు ముందుకి పడలేదు. సింగుకి అర్థమైంది తను 'ఎస్ బాస్' అనగానే దొరికిపోయామని.

"మీకేమున్నా ట్రబుల్స్ వుంటే గైడ్ రూమ్‌కి వెళ్ళి వాటిని నివృత్తి చేసుకోండి."

రిలీఫ్‌గా నిట్టూర్చి "ఎస్ బాస్" అని ధైర్యంగా అని, వెనుదిరిగాడు సింగు. మిగతా ముగ్గురూ అతనితో పాటే కదిలారు.

కిరణ్ నుండి విడిపోగానే నలుగురికీ ఏం చెయ్యాలో తోచలేదు. ఎడం వైపు భవంతిలోనికి వెళ్ళగానే, ముందు ఒక క్లబ్‌లాంటి ప్రదేశం దర్శనమిచ్చింది. రంగు రంగుల దీపాల మసక కాంతిలో, వెస్ట్రన్ సంగీతపు సందడిలో నల్లని సూట్లలో వున్న కొందరు దొంగలు, తాగుతూ తింటూ అమ్మాయిలతో మజా చేస్తున్నారు.

ఇంతలో ఎర్రటి దుస్తులలో వున్న ఒక వ్యక్తి వచ్చి, వాళ్ళకు బాస్ నుండి కాల్ వచ్చిందని చెప్పగానే నలుగురూ గుండెలు దడదడలాడుతుండగా ఎర్ర దుస్తుల వ్యక్తి చూపిన వైపు వెళ్ళారు.

"ఇప్పుడా గైడ్ రూమ్ తెలుసుకోవడం ఎలా?" గుసగుసగా అడిగాడు విన్సెంట్, సింగుని.

"నా అంచనా ప్రకారం గైడ్ రూమ్ రెండవ బిల్డింగ్‌లోనే ఉండవచ్చు" చెప్పాడు సింగ్ సాలోచనగా.

"అక్కడికి వెళ్ళిచూద్దాం" అన్నాడు హుయ్.

రెండవ భవంతిలోనికి ప్రవేశించారు. ఎక్కడచూసినా వాళ్ల దుస్తులు లాంటివే ధరించినవాళ్లు ఉండటంతో ఎలాంటి ఇబ్బంది లేకుండా సంచరిస్తున్నారు వాళ్ళు. అక్కడక్కడా ఎర్ర దుస్తులు ధరించిన వ్యక్తులు వాళ్ళకు ఫార్మల్‌గా 'విష్' చేస్తున్నారు. వాళ్లు సర్వెంట్స్ అని అర్థం చేసుకున్నారు నలుగురూ. వాళ్ళకు దుస్తులపై నంబర్లులాంటివేమీ లేవు.

రెండవ భవంతిలోనికి ప్రవేశించి చాలా సేపయ్యింది. గైడ్‌రూమ్ యెక్కడో తెలియడంలేదు వాళ్లకి. కంగారు పడితే మరింతి ప్రమాదమని తాపీగా వెతుకున్నారు.

"మిస్టర్ సిక్స్టీఎయిట్... బాస్ మీ నలుగురిని స్పెషల్ రూమ్‌కి పిలిచారు" విశాలమైన హాలులో రిసెప్షన్‌లా వున్న గ్లాస్ అవతలనుండి ఎర్రదుస్తుల్లో వున్న సర్వెంట్ చెప్పాడు.

కాసేపు మౌనంగా వుండిపోయి తర్వాత తేరుకొని చెప్పాడు సింగ్. "మేము స్పెషల్ రూమ్ నుండే వస్తున్నాం. బాస్ మమ్మల్ని గైడ్ రూమ్‌కి వెళ్లమన్నారు."

"ఓ.కె, అలా కూర్చోండి ఆపరేషన్ పేపర్ ఇస్తాను" చెప్పాడా వ్యక్తి.

నలుగురూ సర్వెంట్ గమనించకుండా ఒకరి ముఖాల వంక మరొకరు ఆనందంగా చూసుకొన్నారు, గైడ్ రూం అదే అని తెలియడంతో.

# 11

కిరణ్ ఫ్లోరాతో రెండు బిల్డింగుల ప్రక్కనున్న రాతి కట్టడంలో గదుల్ని పరిశీలిస్తున్నాడు—

ఇద్దరూ ఆశ్చర్యంతో, విస్మయంతో తలమునకలవుతున్నారు—అక్కడున్న సంపద చూసి. టన్నులకొద్దీ ఆయిల్, ఇనుములాంటి ముడిపదార్థాలు, ఆహారపుపంటలు వున్నాయా చీకటి గదుల్లో. వాటిని తిరిగి బ్లాక్‌లో అమ్మేస్తున్నారని గ్రహించాడు కిరణ్.

మరో గదిలోనికి నడిచారు. చాలాతరహా చీకటిగా వుందక్కడ. రాళ్లతో కట్టింది కావడంవల్ల గబ్బుకంపు వేస్తూంది.

"కిరణ్" హెచ్చరించింది ఫ్లోరా.

ఆమె మాట పూర్తవ్వకుండానే ప్రమాదం గుర్తించాడు. మరో ఆలోచన లేకుండా, చటుక్కున కాళ్ల మీద కూలబడి వెనక్కి తిరిగాడు. అప్పటికే అతడి చేతిలో రివాల్వర్ సిద్ధంగా వుంది.

ఆ పద్ధతి దాదాపు అతడి ప్రాణాల్ని రక్షించింది—

కిరణ్ క్రిందికి కూలబడగానే, తళతళా మెరిసే గొడ్డలి అతడిపైనుండి రివ్వున దూసుకొనిపోయి చీకట్లో వున్న చెక్క స్తంభానికి నాటుకొని చిన్నగా కంపించసాగింది.

సరిగ్గా గొడ్డలి స్తంభానికి నాటుకొనేటప్పటికి, కిరణ్ రివాల్వర్ నిశ్శబ్దంగా పేలింది. బుల్లెట్‌కి ఎర్రదుస్తుల్లో ఉన్న సర్వెంట్ తల చితికిపోయింది. అప్పటికే అలాంటి నలుగురి సర్వెంట్స్ ప్రాణాలుతీసింది కిరణ్ రివాల్వర్.

గదిలో స్విచ్‌బోర్డ్ కనబడ్డంతో స్విచ్ నొక్కాడు. దీపం వెలిగింది మసగ్గా. స్తంభానికి నాటుకొన్న గొడ్డలి

ఇంకా కంపిస్తూనే వుంది. కడిలో వందల సంఖ్యలో రైఫిళ్లు, హేండ్ గ్రెనేడ్లు. ఎక్స్‌ప్లోజివ్స్, గొడ్డళ్లు పేర్చబడి వున్నాయి. ఇంకా లోపలికి గదులు కనబడుతున్నాయి. .

"మై గాడ్! ఇంత సంఘ విద్రోహ చర్యను ఇక్కడిదే ప్రభుత్వం గుర్తించలేకపోవడం శోచనీయం" స్వగతంగా అన్నాడు కిరణ్.

వాటన్నింటిని బెదురుగా చూస్తుంది ఫ్లోరా.

కిరణ్ ఏదో గుర్తువచ్చి జేబులో తడిమాడు. ట్రాన్స్‌మీటర్ తగిలింది. బయటకు తీసాడు దానిని. నీటిలో తడిసిన తడి ఇంకా ఆరలేదు.

కాసేపాగి 'ఆన్' అన్న మాటను మృదువుగా వత్తాడు!?

రెండు క్షణాలు గడిచాయి!?

కిరణ్ కళ్ళు మెరిసాయి. ట్రాన్స్‌మీటర్‌లో ఎర్ర లైట్ వెలిగింది!

## 12

సింగు బృందం నలుగురికీ టైప్ చేసిన కాగితాలు అందచేయబడ్డాయి. అందులో 'దోపిడీదారులు ఏ సమయానికి బయల్దేరేది. ఏ దిశగా వెళ్ళేది' అన్నీ వివరంగా టైప్ చేసి వున్నాయి. సింగు పేపర్ వెనక్కి తిప్పాడు. అక్కడ గ్యాంగ్‌కి సంబంధించిన అసలైన పూర్తి వివరాలు వున్నాయి.

సింగు వాటిని శ్రద్ధగా చదువుతుంటే గ్లాస్‌లోనుండి గైడ్ సింగునే చూస్తున్నాడు!?

పూర్తిగా చదివాడు సింగు. మొత్తం అక్కడున్న

బాచ్‌లు నాలుగు. ఒక్కొక్క బాచ్‌కు ఎనభైమంది వరకూ దోపిడీదారులు వున్నారు. సర్వెంట్స్ అంతా కలిపి డెబ్భైమంది వున్నారు.

“మీరు కామన్ హాల్లోనికి వెళ్లండి” అన్నాడు గైడ్, చేతితో కొద్దిగా యెడంవయిపుకి చూపుతూ.

నలుగురూ అతడి చేతిని సూక్ష్మంగా పసిగట్టి, ఎడంవయిపుకి నడిచారు.

గైడ్ కనుబొమ్మలు దగ్గరయ్యాయి. “పేపర్స్ ప్లీజ్” అన్నాడు. నలుగురికి అర్థమయింది మౌనంగా పేపర్లు గైడ్‌కి అందించారు. గైడ్ వాటిని హీటర్‌లో వుంచి కాల్చేశాడు యధావిధిగా.

వాళ్ళు గైడ్ రూమ్ ఇంకా పూర్తిగా దాటలేదు. అలారమ్ నొక్కాడు గైడ్. అతడి మొహం ఎర్రగా కంది వుంది కోపంతో. ఎర్రదుస్తుల్లో వున్న ఆరుగురు రైఫిల్స్‌తో గైడ్ ముందు ప్రత్యక్షమయ్యారు. గైడ్ వాళ్లకు రూమ్ దాటుతున్న సింగు బృందాన్ని చూపుతూ యేదో చెప్పి, ఒక కాగితం అందించాడు.

అవతలి రూమ్‌లోనికి ప్రవేశించగానే ఏం చెయ్యాలో తోచలేదు నలుగురికి. ఆ గదిలో అంతా ప్రశాంతంగా వుంది. నల్ల దుస్తుల్లో వున్న కొందరు యేవో యోగాసనాల్లాంటివి మెల్లగా వేస్తున్నారు. గదిలో అత్యంత ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి ట్యూబ్‌లైట్లు.

ఇంతలో స్ప్రింగ్ డోర్ తోసుకొని ఆరుగురు సర్వెంట్స్ వాళ్ళను చుట్టుముట్టారు రైఫిల్స్‌తో.

నలుగురూ కొయ్యల్లా బిగుసుకొనిపోయి నిలబడిపోయారు. అంత త్వరగా తమ ఆట కడుతుందని అప్పటికి ఊహించలేదు వాళ్ళు. ఒక సర్వెంట్ నలుగురి

రైఫిల్స్ లాగేసి గదిలో ఓ మూలన వుంచాడు.

"వాట్ హేపండ్?" ఒక వ్యక్తి యోగాసనాలు ఆపి ప్రశ్నించాడు.

ఒక సర్వెంట్, గైడ్ వాళ్ళకు అందించిన ఆర్డర్ కాగితం చూపాడు. ఆ వ్యక్తి అది చూసి మాటుమాట్లాడకుండా తన పనిలో నిమగ్నమయ్యాడు.

సర్వెంట్స్ నలుగురినీ గైడ్ ముందు హాజరుపరిచారు. నవ్వుతో చెప్పాడు గైడ్ "మీరు కాగితం తిరగ వేసి చదివినప్పుడే నాకు అనుమానం వచ్చింది. ప్రతి కాగితం వెనుకా మా గ్యాంగ్ బయోడాటా యథావిధిగా వుంటుంది. అది సాధారణంగా ఎవరూ చదవరు ....

....నెక్ట్స్, మిమ్మల్ని కామన్ రూమ్‌కి వెళ్ళమని కొద్దిగా సైగ చేశాను ఎడంవైపుకి. దాని ప్రకారం మీరు ఆలోచనా రహితంగా వెళ్ళిపోయారు. కామన్ రూమ్ కుడివైపున అని తెలియని వాళ్ళు మా గ్యాంగ్‌లో యెవరూ లేరు" అని సర్వెంట్స్‌వైపు చూసి "వీళ్ళని సెల్‌లో వుంచి బాస్‌కి విషయం పూర్తిగా తెలియపర్చండి—క్విక్" అన్నాడు.

సింగు, హుయ్, కార్క్, విన్సెంట్ మొహాలు తెల్లగా పాలిపోయాయి.

సర్వెంట్స్ నలుగురినీ సెల్స్‌వైపు నడిపించుకుంటూ తీసుకొనిపోయారు.

## 13

భవంతులకు యెదురుగా వున్న విశాలమయిన రాతి ప్రదేశంలో కర్రలతో నిర్మించబడిన పొడుగాటి ఉరి కొయ్యకు వ్రేలాడదీయబడ్డారు ఆ నలుగురూ—

చుట్టూ రైఫిల్స్‌తో నిలబడ్డారు నల్లదుస్తులవ్యక్తులు.

నలుగురికీ ఎదురుగా, నలుగురు ఎర్రదుస్తుల వ్యక్తులు రైఫిల్స్ గురిపెట్టి పొజిషన్‌లో నిలబడ్డారు.

ప్రక్కనే సిమెంట్ కట్టిన పొట్టిగా వెడల్పుగా వున్న స్తంభం చివర అమర్చబడిన మైక్ నుండి వినిపిస్తూంది. "ఫ్రెండ్స్ సముద్రపు దొంగలకే ముకుటంలేని మహారాజుగా నిలబడిన ఈ కొలాఫిస్ ఉక్కుపిడికిలిలాంటి స్థావరంలోనికి ఈ నలుగురు అమాయకులు చీమల్లా ప్రవేశించారు ...

....చీమలు మన వంటిమీద పాకుతూంటే ముందు మనకు తెలీదు. అవి కుట్టాక వాటిని మనం ఏం చేస్తాం? ఇప్పుడు వీళ్ళను అదే చేయబోతున్నాను నేను. మరో చిత్రమైన విషయం ఏమిటంటే వీళ్ళు, మనం కొల్లగొట్టిన ఇండియన్ పాసింజర్ షిప్ నుండి ఎస్కేప్ అయిన వాళ్ళేనని, ఆ రోజు దాడికి వెళ్ళిన బెటాలియన్ 'టు' కమేండర్ చెబుతున్నాడు....

....ప్రస్తుతం నేను ఒకటినుండి ఐదు అంకెలు లెక్కపెడతా. ఐదు పూర్తయిన మరుక్షణం మన సర్వెంట్స్, నలుగురినీ ఒకేసారి పైకి పంపిస్తారు. వాళ్ల ప్రాణాలకు మనమిచ్చిన గడువు ఐదు అంకెలు. ఒక్కొక్క అంకె పూర్తవుతుంటే, సమీపించే మృత్యువును తలుచుకుని ఆలోచనా రహితంగా మన స్థావరంలోనికి అడుగుపెట్టినందుకు పశ్చాత్తాపపడాలి వీళ్ళు. అందుకే ఈ అంకెలు లెక్కపెట్టడం."

దూరంగా భవంతి మొదటి అంతస్థులో చిన్న బాల్కనీలో ఆయుధాలు ధరించిన నలుగురు సర్వెంట్స్ మధ్య, వీల్స్ చైర్‌లో కూర్చుని బైనాక్యులర్స్‌లో చూస్తున్నాడు బాస్. కాళ్ళు లేవు అతడికి, అతనికి యెదురుగా

మాత్ పీస్ అమర్చబడి వుంది.

సింగుకి చెమట్లు కారిపోతున్నాయి. కిరణ్ యేమ య్యాడో అర్థంకావడం లేదతడికి. హుయ్, విన్సెంట్, కార్క్ ఎవరి దేవుళ్లను వాళ్ళు ప్రార్థించుకుంటున్నారు.

"ఒకటి" అన్నాడు బాస్.

నలుగురు బంధితులు కొద్దిగా గింజుకొంటున్నట్టు కదులుతున్నారు. వాళ్లకు యెదురుగా ఎర్రదుస్తుల్లో వున్న సర్వెంట్స్, రైఫిల్స్ గురిపెట్టి భూతాల్లా కనబడు తున్నారు.

"రెండు"

నలుగురికీ గుండె వేగం చాలా తగ్గింది పెరిగింది.

"మూడు."

సింగు తల తిప్పి అటూ, ఇటూ చూస్తున్నాడు కిరణ్ యెక్కడయినా కనబడతాడేమోనని.

"నాలుగు."

ఎవ్వరికీ నోటమాట రావడంలేదు. కళ్లనీళ్ళు తిరుగు తుండగా గుటకలు మింగుతున్నారు.

సరిగ్గా అప్పుడే నలుగురూ వరసగా యెవరో తోసి నట్టు క్రిందికి వాలిపోయారు. చేతులకు కట్టిన తాళ్ళు తెగిపోయాయని గ్రహించారు. కిరణ్ గుర్తువచ్చాడు సింగుకి.

బాస్‌కి ఏం జరిగిందో అర్థంకావడంలేదు!?

సర్వెంట్స్ రైఫిల్ ట్రిగ్గర్ పై వేళ్ళు బిగిస్తున్నారు. బాస్ లెక్క పెట్టని ఐదు అంకె గురించి ఆలోచిస్తున్నారు వాళ్ళు. బంధవిముక్తులవుతున్న శత్రువుల్ని కంగారుగా చూస్తూ, తల తిప్పి బాల్కనీలోనికి చూస్తున్నారు బాస్ వైపు.

"వాట్స్ రాంగ్ — షూట్ ఆల్ ఆఫ్ యూ"

ఆవేశంతో ఊగిపోతూ గట్టిగా అరిచాడు బాస్.

అప్పటికే సింగు బృందం ఎలర్టు అయి, గుబురుగా వున్న చెట్లలోనికి దూసుకొని పోయారు. చెట్లచాటున నుండి మెషిన్ గన్ శబ్దాలు వినిపించాయి. వాటి వెనుకగా సన్నగా శబ్దం చేసుకుంటూ, పద్దెనిమిది ఆర్మీ హెలికాప్టర్లు తూనీగల్లా ఎగురుకుంటూ వెలువడ్డాయి.

మెషిన్ గన్ బుల్లెట్స్‌కి, వెనక్కి తిరిగి సింగు బృందాన్ని షూట్ చెయ్యబోతున్న సర్వెంట్స్ ఎర్ర దుస్తులు మరింత ఎర్రగా తడిసిపోయాయి. బ్లాక్ దుస్తులు ధరించిన బందిపోట్లుకూడా చాలావరకూ కూలిపోయారు.

మెషిన్ గన్‌లు పేలుతుండగానే హెలికాప్టర్లు క్రిందికి దిగాయి. అప్పటికి అదంతా ఆనందంగా చూస్తున్న కిరణ్, హెలికాప్టర్లను చూసి రెట్టించిన ఉత్సాహంతో కనిపించిన శత్రువుకల్లా షూట్ చేస్తున్నాడు.

కొద్దిసేపు ఆ ప్రదేశమంతా తుపాకీ శబ్దాలతో మారుమ్రోగిపోయింది. బందిపోట్ల నందరినీ, బాస్‌తో సహా భారత ఇంటలిజెన్స్ డిపార్టుమెంట్ లొంగదీసుకుంది. కిరణ్, సింగ్, ఫ్లోరా, హుయ్, విన్సెంట్, కార్ల్ క్షేమంగా వున్నారు.

"సమయానికి వీళ్ళంతా ఎలా వచ్చారు?" ఆశ్చర్యంగా అడిగాడు సింగ్.

"ఇక పని చెయ్యదనుకొన్న ట్రాన్స్‌మీటర్, ఊహించని విధంగా తిరిగి పనిచేయడంతో అందరినీ రప్పించగలిగాను" నవ్వుతూ చెప్పాడు కిరణ్.

"వెల్‌డన్ జంటిల్మన్, ఎవ్వరి కళ్ళల్లో పడని ఇంత

పెద్ద గ్యాంగ్‌ని ప్రాణాలతో సైతం మాకు పట్టిచ్చారు" అంటూ, ఆరుగురినీ అభినందించాడు ఇంటెలిజెన్స్ అధికారి భరద్వాజ. తర్వాత కిరణ్ వైపు చూసి "కిరణ్, ఒక పనిమీద పంపితే, మరో కేస్‌లో ఇరుక్కున్నా ఇక్కడకూడా ఏజంట్ అనిపించుకున్నావు" అన్నాడు.

కిరణ్ మృదువుగా నవ్వి ఊరుకున్నాడు.

"రేపే మరో ఇండియన్ పాసింజర్స్ షిప్ ఆస్ట్రేలియా వెళుతూంది. మీ ఆరుగురినీ అందులో దింపుతాము. ఎవరి గమ్యాలకు వాళ్ళు చేరుకోవచ్చు" అన్నాడు భరద్వాజ.

ఆరుగురూ ప్రాణస్నేహితుల్లా ఒకరి కళ్ళల్లోనికి మరొకరు ఆనందంగా చూసుకున్నారు.

—: అయిపోయింది :—

# ఆత్మార్పణ

## వసుంధర

ముసుగు తన్ని నిద్రపోతున్నాడు సతీష్. తల్లి అతణ్ణి పేరు పెట్టి లేపింది. లేవలేదు. ఒరేయ్ లేవరా అని అరిచింది. లేవలేదు.

"బారెడు పొద్దెక్కినా పిలిచి లేపాల్సిందే—ఇంకా చిన్న పిల్లాడిననుకుంటున్నావా?" అంటూ తిట్టింది.

సతీష్ లేవలేదు.

ఇక లాభంలేదని వంగి మనిషిని కుదిపింది.

సతీష్ కదలలేదు. మెదలలేదు.

"తాతయ్యకు జ్వరమొచ్చిందిరా - డాక్టర్ని పిల్చుకుని రావాలి—" అంది తల్లి ఆఖరి అస్త్రంగా.

సతీష్ చటుక్కున లేచి కూర్చుని — "ఆ మాట ముందే చెప్పవేం?" అన్నాడు.

"నీకు మెలకువ తెప్పించి అప్పుడు చెప్పాలనుకున్నాను—...." అంది తల్లి.

"ఏమయింది తాతయ్యకి? నిన్నటిదాకా బాగానే

వున్నాడుగా—" అన్నాడు సతీష్ కంగారుగా.

"ఏమో—వెళ్ళి నువ్వే అడుగు...." అంది తల్లి.

సతీష్ గబగబా అక్కణ్నించి తాతయ్య గదికి వెళ్ళాడు. ఆయన అప్పుడే స్నానంచేసి దైవప్రార్థన చేసుకుంటున్నాడు.

"తాతయ్యా! నీకు జ్వరం వచ్చిందా?" అన్నాడు సతీష్.

ఆయన వెనక్కు తిరిగి—"ఏం? నిన్ను నిద్ర లేప డానికి మళ్ళీ మీ అమ్మ ఆ అబద్ధమే చెప్పిందా?" అన్నాడు.

"హమ్మయ్యా! అమ్మ చెప్పింది అబద్ధమన్నమాట...." అంటూ సతీష్ తేలికగా నిట్టూర్చాడు.

"రోజూ మీ అమ్మ అబద్ధమే చెబుతుంది. అయినా అదెందుకు నమ్ముతావురా?" అన్నాడు తాతయ్య ముచ్చ టగా మనుమడివంక చూస్తూ.

"ఏమో మరి—ఒకవేళ అమ్మ నిజం చెబితే—అప్పుడు నిజంగా నీకు మందులవసరపడతాయి. డాక్టర్ని పిలవ డానికింట్లో నేను తప్ప ఎవరున్నారు? నీ విషయంలో నేను రిస్కు తీసుకోలేను తాతయ్యా!" అన్నాడు సతీష్.

సతీష్ తాతయ్య నారాయణరావు తృప్తితో కూడిన చిరునవ్వు నవ్వి—"ఇలా రా!" అన్నాడు.

సతీష్ ఆయన్ను సమీపించాడు.

"ఎందుకురా—నీకు నేనంటే అంత ప్రేమ?"

"ఏమో తాతయ్యా—నువ్వే చెప్పాలి!"

నారాయణరావు గంభీరంగా — "ఇకమీదట మీ అమ్మకు అబద్ధం చెప్పాల్సిన అవసరం కల్పించకు. లేప

గానే లేచిపో—" అన్నాడు.

"ఎందుకని?"

"పైన తథాస్తు దేవతలుంటారు. అస్తమానూ మీ అమ్మ నాకు జ్వరం జ్వరం అంటూంటే ఒకరోజున నిజంగానే నాకు జ్వరం వచ్చేస్తుంది—"

"అమ్మ మాటలను తథాస్తు దేవతలు నిజం చేయాలంటే — ఈ ప్రపంచ పురీరే మారిపోతుంది. నీకా భయం లేదులే తాతయ్యా!" అన్నాడు సతీష్.

"అయితే అమ్మ చేత ఆ మాటనిపించిగానీ నిద్రలేవ నన్న మాట!"

"ఏం చేయను తాతయ్యా? ఎందుకో నా కిటీవల విపరీతంగా నిద్రపడుతోంది. మత్తులో నిద్ర లేవలేక పోతున్నాను...."

"రాత్రిళ్ళు ఆలస్యంగా యింటికొస్తున్నావని మీ అమ్మంటోంది...."

సతీష్ మాట మార్చడంకోసం — "నువ్వు ఈ ముసలి తనంలోకూడా రోజూ పొద్దున్నే స్నానం చేస్తావేం? నీ ఆరోగ్యం పాడవనూ?" అన్నాడు.

"స్నానం చేయకుండా దైవప్రార్థనెలా చేసుకోనూ?"

"దేవుణ్ని ప్రార్థించడానికి నీకింకా కోరికలేమున్నాయి?"

నారాయణరావు నవ్వి — "నీకుద్యోగం రావాలి. నువ్వు పెళ్ళిచేసుకుని వేరు కాపురం పెట్టాలి—...." అన్నాడు.

"ఏం తాతయ్యా? నే నీ యింట్లోంచి వెళ్ళిపోవాలని నీకు కోరికగా వుందా?"

"అవున్రా— మీ నాన్న వ్యవహారం నాకు నచ్చడం లేదు. నువ్విప్పుడు వేరు కాపురం పెడతావా— నీతో వచ్చి వుందామా— అని చూస్తున్నాను.... అందుకే ఈ చలిలోకూడా పొద్దున్నే లేచి స్నానంచేసి దైవప్రార్థన చేస్తున్నాము...." అన్నాడు నారాయణరావు.

"నాకుద్యోగం రావాలంటే ఆ దేవుడుకూడా సాయపడలేడనుకుంటాను. ప్రపంచం తీరలావుంది—" అన్నాడు సతీష్.

నారాయణరావు నిట్టూర్చాడు.

## 2

నారాయణరావు కిద్దరే పిల్లలు. ఉద్యోగంలో వుండగానే ఆయన కూతురి పెళ్ళి చేశాడు. కొడుక్కుద్యోగం వేయించాడు. ఓ మంచిల్లుకూడా కట్టాడు.

ఇప్పుడాయనకు అరవై ఏళ్ళు. రిటైరైనాడు. ప్రతి నెలా అయిదువందల రూపాయలు పెన్షను వస్తుంది. ఆయన రిటైరైన ఊళ్ళోనే కొడుక్కి ఉద్యోగం రావడంవల్ల స్వంతింట్లో కొడుకు దగ్గర సుఖంగా వుంటున్నాడు. డబ్బుకు తమపై ఆధారపడని మామగారంటే కోడలికి గౌరవం

నారాయణరావు కొడుకు జగన్నాథం. కోడలు మాలతి. ఆ దంపతులకిద్దరే పిల్లలు. పెద్ద పిల్ల రేవతికి ఆరేళ్ళ క్రితమే పెళ్ళయింది. రెండోవాడు సతీష్ బియ్యే ప్యాసై రెండేళ్ళయింది.

సతీష్ అతికష్టంమీద బియ్యే ప్యాసయ్యాడు. ఇంక చదువుకోనని మొరాయించాడు. అతడికుద్యోగ మిప్పించాలని నారాయణరావు, జగన్నాథంకూడా ప్రయత్నాలు చేస్తున్నారు.

బియ్యే ప్యాసవగానే ఓ కంపెనీలో ఉద్యోగమిప్పిస్తే సతీష్ అక్కడ బాస్‌తో దెబ్బలాడాడు. అతడి వుద్యోగం ఊడింది. ఆ తర్వాత వేరో ఆర్నెల్లకు మరోచోట అదే జరిగింది. ఆ తర్వాతనుంచి జగన్నాథం కొడుకు గురించి బెంగ పెట్టుకున్నాడు.

సతీష్ మన స్తత్వానికి మామూలుద్యోగాలు సరిపోవు. అతడు అధికారుల జులుం అంగీకరించడు. అలాగని విశాల భావాలూ లేవు. తన క్రింది వాళ్ళపై అతడు జులుం చేస్తూనే వుంటాడు. ఎన్నోసార్లు అతడు కూలివాళ్ళతో, రిక్షావాళ్ళతో, బస్సు కండక్టర్లతో గొడవపడ్డాడు.

సతీష్ ఇంట్లో యెంతో గారాబంగా పెరిగాడు. అతడాడింది ఆట, పాడింది పాట — అతడి క్రమశిక్షణ గురించి ఇంలో అంతో పట్టించుకునేది తల్లి మాలతి మాత్రమే! నారాయణరావా మెనందుకు మందలిస్తూందే వాడు.

"మితిమీరిన గారాబం చేస్తే కుర్రాడు చెడిపోతాడు మామయ్యా!" అనేది మాలతి అయనతో.

"మనవాడేం చెడిపోయాడని? క్లాసుల్లో ఫస్టు రాక పోయినా పరీక్షలు ప్యాసవుతూనే వున్నాడు గదా—" అనేవాడు నారాయణరావు.

సతీష్ పరీక్షలు ప్యాసవడమే ఆయనకు కొండంతగా వుండేది. ఇంట్లో వాళ్ళకు తెలిసి సతీష్‌కు దురలవాట్లు కూడా లేవు.

మామగారి మాటలకు మాలతి తృప్తిపడేది.

ఏభయ్యో యేట భార్య పోయింది నారాయణ రావుకు. అప్పట్నించీ ఆయన మనుమదే ప్రాణంగా జీవిస్తున్నాడు.

ఇచ్చి పుచ్చుకోవడాలు ప్రేమలోనూ వుంటాయి.

చిన్నప్పట్నించీ సతీష్ తాతయ్య దగ్గర బాగా చేరిక. ఇంట్లోని అందరికీ ఆయనే తనకు ఆత్మీయుడన్న భావం అతడిలో యెప్పుడూ ఉండేది. బామ్మపోయాక అతడికీ తాతయ్యే ప్రాణమయ్యాడు.

బియ్యే ప్యాసై రెండుసార్లుద్యోగం వదులుకున్నాక తల్లి అతణ్ని సాధించడం మొదలు పెట్టింది. నారాయణ రావా మెను మందలిస్తూ ఉండేవాడు.

"మీరూ అలాగంటే ఎలా? ఇంట్లోవున్నట్టే ఆఫీసులో మసిలితే కుదరదని మీరేవాడికి చెప్పాల్సిందిపోయి.... నన్ను మందలిస్తారేమిటి మామయ్యా!" అని మాలతి యెదురుతిరిగింది.

"నా మనుమడు—ఒకరి మోచేతి నీళ్ళు తాగేవాడు కాదు...." అని—"ఏరా — డబ్బిస్తాను .... ఫ్యాన్సీ దుకాణం పెట్టుకుంటావా?" అన్నాడు నారాయణరావు.

సతీష్ అంగీకరించాడు.

పదివేలు పెట్టుబడికి పాతిక వేలు బ్యాంకులోన్ తోడు కాగా ఫ్యాన్సీ దుకాణం వెలిసింది. అయితే సతీష్‌కి అదీ సరిపడలేదు. స్టేట్ గవర్నమెంట్ ఆఫీసర్లు, సేల్సుటాక్సు వాళ్ళు ఇన్‌కంటాక్సువాళ్ళు .... అతడి వెంటబడ్డారు. అందరితోను అతడు గొడవ పెట్టుకున్నాడు. షాపు మూసే యాల్సిన అగత్యం పట్టింది.

"నువ్వింక బాగుపడవు...." అంది మాలతి.

"ఈ దేశంలో స్వతంత్రంగా బ్రతకాలనుకుంటే దారిలేదు...." అన్నాడు సతీష్ నిర్లక్ష్యంగా.

నారాయణరావు మనుమడి నేమీ అనలేదు. ఆయన నమ్మకస్తుడైన బంధువుల కుర్రాడికి ఫ్యాన్సీషాపు అప్ప

గించాడు.

ప్రస్తుతానికి షాపుమీద కొంత ఆదాయం అందు తోంది. షాపు నిలబడింది. కానీ సతీష్ సమస్య అలాగే వుండిపోయింది.

బంధువుల కుర్రాడి పేరు నరసింహమూర్తి. నారాయణరావతణ్ణి మూర్తీ—అని పిలుస్తాడు.

మూర్తి తెలివైనవాడు. నారాయణరావుగారిని ఇంప్రెస్ చేయాలని ఆతడు సర్వ ప్రయత్నాలూ చేస్తున్నాడు. మూర్తి యేదో ఒకరోజున ఆ ఫ్యాన్సీషాపును స్వంతం చేసుకోగలడని నారాయణరావు అనుమానం.

ఈలోగా సతీష్ ఓ వ్యాపారస్తుడి కూతుర్ని ప్రేమించాడు. ఇద్దరూ జల్సాగా తిరిగేవారు. వ్యాపారస్తుడికిది తెలిసి స్వయంగా ఇంటికి వచ్చి నారాయణరావుతో నిష్ఠూరంగా మాట్లాడాడు.

నారాయణరావుకో క్రోపం వచ్చి—"మీ అమ్మాయిని మీరదుపులో పెట్టుకోక మా వాడిని తప్పుపడతారేం?" అన్నాడు.

"మీ అబ్బాయిని మీ రదుపులో పెట్టుకోగలరా?" అన్నాడాయన.

"నాకా అవసరంలేదు—...." అన్నాడు నారాయణరావు.

"నాకూ ఆ అవసరంలేదు—" అన్నాడా వ్యాపారస్తుడు.

"అయితే నా దగ్గర కెందుకు వచ్చారు?"

వ్యాపారస్థుడు నవ్వి — "మీరంటే నాకు గౌరవముంది. అందుకే వచ్చాను—" అన్నాడు.

"మీ మాటలు నాకర్థంకావడంలేదు—...."

"మీ వాడిని మీరే అదుపులో పెట్టుకోవడం మంచిది. అది మీకు చేతకాకపోతే నేనే మీ వాణ్ణి అదుపులో పెట్టాల్సి వుంటుంది. అది మీ వాడికి క్షేమం కాదు...."

"అంటే?"

"ఇది హెచ్చరిక...." అని వెళ్ళిపోయాడాయన.

ఆ రాత్రి నారాయణరావు మనుమడిని కూర్చోబెట్టి హితబోధ చేశాడు.

"దీప నన్ను ప్రేమిస్తోంది తాతయ్యా..." అన్నాడు సతీష్.

"కానీ — నేనీ పెళ్ళికి ఒప్పుకోను...."

"ఈ పెళ్ళి జరక్కపోతే నేనింట్లోంచి వెళ్ళిపోతాను" అన్నాడు సతీష్.

"నన్ను విడిచి వుండగలవురా?" అన్నాడు నారాయణరావు.

"ఉండలేను....ఇంట్లోంచి వెళ్ళిపోవడమంటే నన్ను నేను శిక్షించుకోవడమే...."

"అదేం కాదు... ఆ దీపకోసం — నన్ను కూడా కాదంటున్నావు...."

"నువ్వు నన్ను సరిగ్గా అర్థంచేసుకోలేదు తాతయ్యా!" అన్నాడు సతీష్ — "దీపతో నా పెళ్ళికి అంగీకరించకపోతే — నేనింట్లోంచి వెళ్ళిపోతాను. అయితే దీపనూ కలుసుకోను. నువ్వొప్పుకుంటేనే మా పెళ్ళి జరుగుతుంది. నువ్వొప్పుకునేదాకా నేను దీపనూ కలుసుకోను, నిన్నూ చూడను...."

నారాయణరావు మనసు అర్ద్రమైంది.

"ఒకసారా అమ్మాయిని పిల్చుకునిరా. నేను మాట్లాడతాను...."

"థాంక్స్ తాతయ్యా!" అన్నాడు సతీష్.

ఆ తర్వాత వారంరోజులపాటు—ఈరోజు, రేపు అంటూ గడిపాడతడు. నారాయణరావు దీప నిజంగానే తనింటికి వస్తుందనుకున్నాడు కానీ అలా జరుగలేదు.

సరిగ్గా వారంరోజుల తర్వాత సతీష్ చావు దెబ్బలు తిని రోడ్డుమీద పడుంటే—ఎవరో తీసుకువెళ్ళి హాస్పిటల్లో జేర్పించారు. మాలతి లబోదిబోమంటూ హాస్పిటల్‌కు వెళ్ళింది. నారాయణరావుకూడా హాస్పిటల్లో మనుమడిని చూసుకున్నాడు.

"ఏమిట్రా యిది!" అన్నాడు నారాయణరావు.

"ప్రేమ" అన్నాడు సతీష్.

నారాయణరావు భారంగా నిట్టూర్చాడు.

సతీష్ హాస్పిటల్లో పదిరోజులున్నాడు. హాస్పిటల్లోంచి బయటపడేసరికి—దీపకు పెళ్ళి జరిగి హనీమూన్‌కు కాశ్మీర్ వెళ్ళింది.

నెలరోజుల తర్వాత ఆమె తిరిగి వచ్చింది.

సతీష్ వీలుచూసి ఆమెను కలుసుకున్నాడు. ఆమె అతడి నెరుగను పొమ్మంది.

రెండ్రోజులపాటు సతీష్ పిచ్చివాడిలా తిరిగాడు.

"ఏమిట్రా యిది!" అన్నాడు నారాయణరావు.

"మోసం!" అన్నాడు సతీష్.

"మోసగాళ్ళను ప్రేమించకు. ఇలాగే భంగపడతావు...."

సతీష్ విషాదంగా నవ్వాడు. మానసికంగా అతడు దెబ్బతిన్నాడని గ్రహించి—నారాయణరావతణ్ణి ఓదార్చాడు. సతీష్‌కాయన దగ్గర చేరిక ఎక్కువయింది.

కానీ అప్పట్నించీ సతీష్‌లో కొత్త మార్పు వచ్చింది.

అతడు రాత్రిళ్ళు ఆలస్యంగా ఇంటికి వస్తున్నాడు. ఉదయం 8. పట్టాక నిద్ర లేవడం లేదు.

నారాయణరావు కుమారుడి భవిష్యత్తు గురించి బెంగ పెట్టుకున్నాడు. రోజూ విధిగా దైవప్రార్థన చేస్తున్నాడు.

## 3

"సతీష్ .. సతీష్ ..."

"ఎవరో తలుపు తడుతున్నారు.

జగన్నాథం వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా కనబడిన యువకుణ్ణి చూసి—"నువ్వు....విశ్వం కదూ!" అన్నాడు.

"అవునండీ—సతీష్ ఇంట్లో వున్నాడా?" అన్నాడు విశ్వం.

"స్నానం చేస్తున్నాడు...." అన్నాడు జగన్నాథం.

విశ్వం అసహనంగా—"ఓసారి అర్జంటుగా రమ్మని పిలుస్తారా?" అన్నాడు.

జగన్నాథం అదోలా అతడివంక చూసి-"కూర్చో!" అన్నాడు.

విశ్వం వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. జగన్నాథం లోపలకు వెళ్ళాడు.

విశ్వం ఆయన వెళ్ళగానే మళ్ళీ లేచినిలబడ్డాడు. జేబుల్లో చేతులు పెట్టుకుని అటూ ఇటూ తిరిగాడు. క్షణమొక యుగంలా వుందతడికి.

కాసేపటిలో సతీష్ అక్కడికి వచ్చాడు.

విశ్వం సతీష్‌ని చూస్తూనే—"బయటకు వస్తావా?" అన్నాడు.

"ఎందుకు?"

"అర్జంటు పనుంది...."

"ఏమిటి?"

"బయటకు వచ్చేక చెబుతాను...."

"చెప్పందే రాను...."

"సుధాకర్ బామ్మ చచ్చిపోయింది...."

సతీష్ చిరాగ్గా—"సుధాకర్ ఎవరు?" అన్నాడు.

"సుధాకర్ తెలియదూ? అరుణా హోటల్ ప్రొప్రయిటర్ కొడుకు...."

"అతడా!" అని-"అతడి బామ్మపోతే నాకెందుకు?" అన్నాడు సతీష్.

"అతడి బామ్మది మామూలు చావు కాదు. ఎవరో హత్య చేశారు...."

సతీష్ ఉలిక్కిపడి—"అయితే?" అన్నాడు.

"నీతో చాలా మాట్లాడాలి. కానీ యిక్కడ కాదు."

సతీష్ మళ్ళీ— "నేను రాను...." అన్నాడు.

"అయితే ఇక్కడే నీకింకా వివరాలు చెప్పాలి...."

"చెప్పు...." అన్నాడు సతీష్ నిర్లక్ష్యంగా.

"సతీష్! సుధాకర్ బామ్మను చాకుతో పొడిచాడు హంతకుడు. హత్యాయుధాన్నామె శరీరంలోనే వదిలాడు. ఆ చాకు స్టెయిన్‌లెస్ స్టీలుది. దానిమీద గులాబి పూవు బొమ్మవుంది. ఎస్ అన్న ఇంగ్లీషు పొడి అక్షరం వుంది...."

సతీష్ కంగారుగా—"పాంటు మార్చుకుని వస్తాను—పద!" అన్నాడు.

"ఇంకా నీతో చాలా మాట్లాడాలి. చాలా అర్జంటుగా మాట్లాడాలి. త్వరగా రావాలి మరి!" అన్నాడు

విశ్వం

"ఇక్కడున్నట్లు వచ్చేస్తాను..." అంటూ లోపలకు వెళ్ళాడు సతీష్. లోపల సతీష్‌కి తన పాంటు జేబులు తడుముతున్న తండ్రి కనిపించాడు.

"ఏం చేస్తున్నావు నాన్నా?" అన్నాడు సతీష్ ఆశ్చర్యంగా.

"ఇది నీ పాంటా? నా దనుకున్నాను...." అంటూ లోపలకు వెళ్ళాడు జగన్నాథం. తండ్రిని గురించి అట్టే పట్టించుకోకుండా బట్టలు మార్చుకున్నాడు సతీష్.

# 4

"నాన్నా!" అన్నాడు జగన్నాథం.

"ఏరా?" అన్నాడు నారాయణరావు.

"మన సతీష్ గురించి బెంగగా వుంది—" అన్నాడు జగన్నాథం.

"ఎందుకని?"

"పెన్సిలు చెక్కుకుందుకని నువ్వు సతీష్‌కి ఓ చాకు కొని పెట్టావు గుర్తుందా?" అన్నాడు జగన్నాథం.

"ఊఁ!"

"దానిమీద గులాబిపువ్వు బొమ్మ వుంటుంది. ఎస్ అన్న పొడి అక్షరం కూడా వుంటుంది..."

"అవును...." అని—"సతీష్ కదా లేచే యింట్లో యిష్టం. ఎవరికీ అదివ్వడు. అల్లం తరుగుతానంటే మీ ఆవిడకు కూడా యివ్వడు...." అన్నాడు నారాయణరావు.

"ఆ చాకిప్పు డింట్లో లేదు...."

"దాని సంగతి మన కెందుకు? వా డెక్కడో దాచుకుని వుంటాడు...." అన్నాడు నారాయణరావు.

"వాడి బీరువాలో ఎక్కడా లేదు...."

"జేబులో పెట్టుకున్నాడేమో!"

"వాడి పాంటు జేబులు చూశాను. కనపడ లేదు........"

నారాయణరావు ఆశ్చర్యంగా—"నీ కా చాకు కావాలంటే వాడినడిగి తీసుకోవచ్చును కదా—చాటుగా వెతకడ మెందుకూ?" అన్నాడు.

"ఎందుకంటే ఆ చాకిప్పుడో హత్యాయుధం...." అన్నాడు జగన్నాథం.

"ఏమిటీ?"

జగన్నాథ వెంటనే "ఇప్పుడే విశ్వమని ఓ కుర్రాడు వచ్చి మన సతీష్‌ని తీసుకుని వెళ్ళాడు. వాళ్ళ సంభాషణ నేను విన్నాను...." అంటూ తను విన్న విశేషం చెప్పాడు.

నారాయణరావు నిల్లబోయి—"అయితే యేం జరిగిందంటావ్?" అన్నాడు.

"ఏమో—నాకూ తెలియడంలేదు...." అన్నాడు జగన్నాథం.

కాసేపు తండ్రీ కొడుకుల మధ్య మౌనం రాజ్య మేలింది.

"మన సతీష్ హత్య చేయడు...." అన్నాడు జగన్నాథం.

"అసలు హత్య చేయాల్సిన అవసర మేముంది వాడికి?"

"అందులోనూ—ఎవరో సుధాకర్ బాబుని...."

మళ్ళీ తండ్రి కొడుకుల మధ్య మౌనం రాజ్య మేలింది.

"అసలిదంతా నా కెందుకు చెప్పావు?" అన్నాడు నారాయణరావు.

"విశ్వం మాట్లాడిన తీరునుబట్టి—అతడు సతీష్‌ని అనుమానిస్తున్నట్లనిపించింది. అతడు మనవాడి నెందు కనుమానించాలి?" అన్నాడు జగన్నాథం.

"అది నీ అనుమానం. అతడు మనవాడి నెందు కనుమానిస్తాడు?"

"హత్యాయుధం మనవాడి చాకే ఎందుకవ్వాలి? అతడు వివరాలు చెప్పగానే—ఒక్క మాట కూడా అనకుండా విశ్వాన్ననుసరించి యెందుకు వెళ్లాడు?"

"విశ్వం శవం దగ్గర మనవాడి చాకును చూసి వుంటాడు. వెంటనే ఆ విషయం చెప్పడాని కిక్కడికి వచ్చివుంటాడు...." అన్నాడు నారాయణరావు.

"కానీ యిదంతా యెందుకు జరిగింది? యెలా జరిగింది?...."

"ముందా సుధాకర్ బొమ్మ హత్య గురించి వివరాలు తెలుసుకోవాలి...." అన్నాడు నారాయణరావు సాలోచనగా.

"అనవసరంగా ఇలాంటి వ్యవహారంలో తలదూర్చడం నా కిష్టంలేదు. ఎందుకంటే—అది లేనిపోని అనుమానాలకు దారితీస్తుంది...."

"నిజమే....కానీ మనవాడిప్పు డక్కడికే వెళ్ళాడేమో!"

"వెళ్ళి ఆ చాకు నాదే అన్నాడంటే పోలీసులు వాణ్ణి అరెస్టు చేస్తారు...."

"అలా జరగడానికి వీల్లేదు...." అన్నాడు నారాయణరావు వెంటనే.

"అలాగే జరుగుతుందని నాకు భయంగా వుంది. ఏం చేయాలో పాలుపోవడంలేదు. లోపాయికారీగా

కూడా అటువైపు వెళ్ళడం నా కిష్టంలేదు—" అన్నాడు జగన్నాథం.

"సరేలే— నేను బయటకు వెళ్ళి విషయం వాకబు చేస్తాను. నువ్వేమీ కంగారుపడకు—" అన్నాడు నారాయణరావు.

జగన్నాథం తేలికగా నిట్టూర్చి—"నువ్వు వేలు పెడితే యేపనైనా సానుకూలమవుతుంది నాన్నా!" అన్నాడు.

## 5

ఆమె పేరు పార్వతమ్మ. వయసు అరవై యేళ్ళు. మనిషి దృఢంగా వుంటుంది. ఆమెకు నాగేశ్వరరావు నటించిన సినిమాలంటే ప్రాణం. వీలు చూసుకుని, వీలు చేసుకుని తరచుగా సినిమాలు చూస్తూంటుంది. సాధారణంగా మ్యాట్నీలో, మొదటి ఆటలో వెడుతూంటుంది. అప్పుడప్పుడు రెండో ఆటకూ వెడుతూంటుంది.

ఆ ఊరామెకు కొట్టినపిండి. ఆ ఊళ్ళో దొంగతనాలు, దోపిడీలు అరుదు. అందుకని ఆమె ఒంటరిగానే సినిమాలు చూస్తుంది. ఏ షోకు వెళ్ళినా ఆమె గురించి ఎవ్వరూ బెంగపెట్టుకోరు.

ఆ రోజు రాత్రి ఆమె పాత సినిమా "పెళ్ళికానుక"కు రెండవ ఆటకు వెళ్ళి తిరిగిరాలేదు.

తెల్లవారుఝామున మూడు గంటలకు పార్వతమ్మ కోడలు భార్గవికి మెలకువ వచ్చి టైము చూసుకుని అత్తగారింకా రాలేదని గుర్తించి కంగారుగా భర్తను లేపింది. భార్గవి భర్త ప్రసాద్—కొడుకు సుధాకర్‌ని లేపాడు. తండ్రీ కొడుకు లిద్దరూ కలసి వెతకడం ప్రారంభించారు.

ఆమె పెళ్ళికానుక సినిమాకు వెళ్ళినట్లు యింట్లో తెలుసు. అందుకని సరాసరి తండ్రీ కొడుకులా థియేటర్ కు బయల్దేరారు.

దారిలో వారికి పార్వతమ్మ శవం కనబడింది.

పార్వతమ్మ చనిపోయిందని ప్రసాద్ అనుకోలేదు. ఆయన పరీక్షించి చూసి—"ఎవరో కత్తితో పొడిచారు—" అన్నాడు.

"కత్తి కాదు. చాకు—" అంటూ పక్కనే వున్న చాకును తీయబోయాడు సుధాకర్.

"అది నువ్వు ముట్టుకోకు — అమ్మను నేను లేవదీస్తాను—" అన్నాడు ప్రసాద్. ఆయన తల్లిని ముట్టుకునేసరికి ఒళ్ళు చల్లగా వుంది. అప్పుడు పరీక్షించగా శ్వాసలేదు. గుండె చప్పుడులేదు.

"నీ బామ్మ చచ్చిపోయిందిరా—"అన్నాడు ప్రసాద్ చటుక్కున.

"అంటే .... హత్య!...." అన్నాడు సుధాకర్ నిశ్చేష్టుడై.

అంతవరకూ తన బామ్మ ఆ విధంగా హత్య గావించబడుతుందని సుధాకర్ అనుకోలేదు.

ఒకరు శవం దగ్గరే వుండిపోగా—ఇంకొకరు పోలీసు స్టేషన్ కి వెళ్ళి ఫిర్యాదు చేశారు. పోలీసులు వచ్చారు. శవాన్ని హత్యాయుధాన్ని స్వాధీనం చేసుకున్నారు.

విచారణలో తేలిన ప్రకారం పార్వతమ్మ మెడలో ఒక గొలుసు, రెండు చేతులకూ నాలుగు గాజులు పోయాయి. దగ్గర కొంత డబ్బు కూడా వుండాలి.ఎంతో తెలియదు.

"మా బామ్మ నా పెళ్ళి చూడాలని తహతహ

లాడింది. తను పోయేలోగా నన్ను పెళ్ళి చేసుకోమని ప్రతిమలాడింది. నేను వినలేదు. తను మా కెప్పుడూ బ్రతుకు తుందని నమ్మాను. దుర్మార్గుడు—నా బావమ్మ ప్రాణం తీశాడు..." అంటూ యేడ్చాడు సుధాకర్.

ఆ దుర్మార్గు డెవరో అతడికి తెలియదు. కానీ ఆ చాకలెవరిదో అతడికి తెలుసు. అయితే తన అనుమానా న్నతడు పోలీసుల ముందు బయట పెట్టలేదు. ముందుగా విశ్వానికి చెప్పాడు.

విశ్వం సతీష్‌కి చెప్పాడు.

నారాయణరావు కొంత కథను పత్రికావిలేఖరి ద్వారా తెలుసుకున్నాడు. చివరి భాగం మాత్రం ఆయన ఊహిం చాడు.

విశ్వం, సుధాకర్, సతీష్—ఈ ముగ్గురూ స్నేహి తులు. సతీష్ ద్వారా ఈ పేర్లాయన తరచు వింటూం టాడు.

"ఆమె ముసలిది. ఆ సమయంలో రోడ్డు నిర్మాను ష్యంగా ఉన్నట్లుంది. లేకుంటే అన్ని గంటల సేపు శవ మక్కడ పడివుండదు. నేరసు డామె నగలు కాజేయా లంటే ఆమెను చంపాల్సిన అవసరముండదు. వాడెవరో చాలా క్రూరాత్ముడై వుండాలి—" అన్నాడు పత్రికా విలేఖరి.

ఈ విషయం కూడా కొడుక్కి చెప్పాడు నారాయణ రావు.

జగన్నాథం అప్పుడు ఆఫీసులో వున్నాడు—
"నా కేమిటో చాలా భయంగా వుంది నాన్నా!...." అన్నాడు.

"కానీ నా మనసిప్పుడు తేలికపడింది. ఆ హత్య

సతీష్ చేయలేదని స్పష్టపడింది—" అన్నాడు నారాయణ రావు.

"ఎలా?"

"నిజానికది దొంగతనం. అందుకు హత్య అవసరం లేదు. హంతకుడి క్రౌర్యమే హత్యను పురికొల్పింది. మన సతీష్ అంత క్రూరంగా ప్రవర్తించ లేడు—" అన్నాడు నారాయణరావు.

"దొంగతనం మాత్రం మనవాడికి అవసరమా?"

"లేదు. కానీ అనుమానించాల్సిన అగత్యం యేర్పడింది కదా!"

జగన్నాథం నిట్టూర్చి—"చాకు గురించి సుధాకర్ రిపోర్టిస్తాడేమో!" అన్నాడు.

"నువ్వు భయపడకు. శవం దగ్గరున్న చాకు మన సతీష్‌ది కాదు. వేరెవ్వరిదో—" అన్నాడు నారాయణ రావు.

"నీ కెలా తెలుసు?"

"సతీష్ చాకు—ఇంట్లోనే వుంది!"

"ఎక్కడ?"

"నా దగ్గర ...."

"మరి ఆ దయుం నాతో చెప్పలేదేం?"

"సతీష్ ఎందుకు భయపడ్డాడో తెలుసుకోవాలనిపించింది నాకు. ఆ విశ్వం వచ్చి హత్యాస్థలంలో ఫలానా చాకుందనగానే వాడెందుకు కంగారుగా వెంటబడి పోయాడూ—అని నా కనుమానం కలిగింది. అందు కారణం తెలుసుకోవాలని యింట్లోంచి బయల్దే రాను ....—"

జగన్నాథం ముఖంలో తృప్తి కనబడింది—

"నాన్నా! నా మనసిప్పుడు తేలిక పడింది....—"
అన్నాడు.

ఎందుకో నారాయణరావు మాత్రం భారంగా నిట్టూర్చాడు.

# 6

ఉదయం వెళ్ళినవాడు మధ్యాహ్నం రెండింటి కింటికి తిరిగొచ్చాడు సతీష్. అతడు దిగులుగా వుండడం కని పెట్టిన మాలతి—"ఏమయిందిరా?" అంది.

"ఏమీ కాలేదులే—" అన్నాడు సతీష్ చిరాగ్గా.

మాలతి అతణ్ణింక పలకరించడం మంచిది కాదని—భోజనానికి రమ్మంది.

"నేను భోంచేసే వచ్చాను—...." అన్నాడు సతీష్.

"ఎక్కడ?"

"ఓ స్నేహితుడింట్లో—...."

అతడి సమాధానం మాలతికి తృప్తి కలిగించలేదు. ఆమె మరి మాట్లాడకుండా మామగారి గదికి వెళ్ళింది.

నారాయణరావు మంచి నిద్రలో వున్నాడు. ఆయన్ను లేపింది.

"ఏమిటమ్మా?" అన్నాడు నారాయణరావు.

"సతీష్ వచ్చాడు. చిరాగ్గా వున్నాడు. భోంచేయమంటే యెక్కడో చేసే వచ్చానంటున్నాడు....—" అంది మాలతి.

ఆమె కళ్ళలోని దిగులు, హృదయవేదన వెంటనే నారాయణరావు కర్థమయ్యాయి—"నేను రమ్మన్నానని వాడినొక్కసారిలా పంపించు—" అన్నాడాయన.

మాలతి వెళ్ళిపోయింది. కాసేపట్లోనే సతీష్ అక్క

దకు వచ్చి—"తాతయ్యా! అమ్మ నిన్ను రికమెండ్ చేయమందా?" అన్నాడు.

"దేనికి?"

"భోం చెయ్యమని నాకు చెప్పడానికి...."

"నువ్వు భోం చేయకపోతే మా అమ్మకేం నష్టం?" అన్నాడు నారాయణరావు.

"నష్టం కాకపోతే నీ కెందుకు చెప్పింది?" అన్నాడు సతీష్

"చెబితే మాత్రం నిన్ను పిలవాల్సిన అవసరం నాకేముంది?"

"మరైతే నువ్వెందుకు పిలిచావు?"

"ఆలోచించి చూడు..."

"నా భోజనం గురించి అమ్మకూ నీకూ ఇంత పట్టింపెందుకో—ఎంత ఆలోచించినా నాకర్థం కావడం లేదు—...." అన్నాడు సతీష్.

"అభిమానం విలువ పోగొట్టుకున్నప్పుడు కానీ తెలియదులే...."

సతీష్ తడబడి—"అభిమానం నేనెప్పుడూ పోగొట్టుకోను...." అన్నాడు.

"ఇప్పటికే నా అభిమానం పోగొట్టుకున్నావు—" అన్నాడు నారాయణరావు.

"అర్థంకాదు తాతయ్యా!" అన్నాడు సతీష్.

"అన్నొద్దంటే అభిమానం ఆగదు. మీ అమ్మొచ్చి భోం చెయ్యనంటున్నావని చెప్పింది. ఆ వెంటనే నిన్ను పిలిచాను. కానీ భోంచేయమని చెప్పడానికి కాదు...."

సతీష్ పాంటు జేబులోకి చేతులు పోనిచ్చి అటూ యిటూ నడుస్తూ—"మరెందుకు పిలిపించావు?" అన్నాడు.

"నాకోసారి నీ చాకు కావాలి...."

"ఏ చాకు?"

"నీ దగ్గరెన్ని చాకులున్నాయి?"

సతీష్ పక్క చూపులు చూశాడు. పక్కనే నారాయణరావు పూజామందిరం ముంది. మందిరానికి పైన ఆంజనేయుడి పటం గోడకు వేలాడుతోంది.

ఆంజనేయుడు తన్నురిమి చూసినట్లనిపించింది సతీష్‌కి.

"ఒకసారి నాకు చాకు కావాలి...."

"ఎందుకు?"

"చాకుతో యేం చేస్తారు?"

సతీష్ మళ్ళీ పక్క చూపులు చూశాడు. ఆంజనేయుడు పటంలోంచీ మళ్ళీ అతడి వంక వురిమి చూశాడు.

"పెన్సిలు చెక్కుకుంటారు—" అన్నాడు సతీష్.

"నేను పెన్సిలు చెక్కుకోవాలి...." అన్నాడు నారాయణరావు.

"పెన్సిలు నా కియ్యి. చెక్కి యిస్తాను...."

"నా ఆరోగ్యం బాగున్నంత కాలం నా పను లింకొకళ్ళకి చెప్పను....చాకు నాకు తెచ్చియ్యి...." అన్నాడు నారాయణరావు.

"నా ఆరోగ్యం బాగున్నంత కాలం నీ పనులు నిన్ను చేసుకోనివ్వను. నేనే చేసి పెడతాను—...." అన్నాడు సతీష్.

"సరేలే — ఒక్కసారి నా కా చాకు తెచ్చి చూపించు...."

"ఎందుకు?"

నారాయణరావు తన బట్టతలమీద కుడిచేయి ఆన్చి

ఓసారి పొముకున్నాడు. తర్వాత నెమ్మదిగా—"నేను నీకు అభిమానంతో కొనిచ్చిన వస్తువది. దాన్నెంత భద్రంగా దాచుకుంటున్నావో చూద్దామని...." అన్నాడు.

మళ్ళీ సతీష్ పక్క చూపులు చూశాడు.

ఆంజనేయుడి బొమ్మ అతడి వంక గేలి చేస్తూ చూస్తోంది.

సతీష్ పూర్తిగా ఆ బొమ్మవైపు తిరిగాడు.

అతడి కయిదేళ్ళ వయసప్పుడు నారాయణరావా బొమ్మను చూపించి — "స్వామిభక్తికి ఆంజనేయుణ్ణి మించినవాడు లేడు. అందుకే ఆయన ఆరాధ్య దైవమయ్యాడు. భక్తితో ఆయన తాను నమ్మిన దేవుణ్ణి మించిన బలవంతుడయ్యాడు. సముద్రాలను దాటి, రాక్షసులను చంపి మహారాక్షసులను చంపిన శ్రీరామచంద్రుణ్ణి కూడా యుద్ధంలో ఓడించిన ఆంజనేయుడి విజయ రహస్యం స్వామిభక్తి. నీవు కూడా నీ యింట్లో వాళ్ళను ఆంజనేయుడంత భక్తితో ఆరాధించు. నువ్వూ ఆంజనేయుడంతవాడి వౌతావు—" అని చెప్పాడు.

ఆంజనేయుడి శక్తి గురించీ, బలపరాక్రమాల గురించీ నారాయణరావు చెప్పగా యెన్నో కథలు విన్నాడు సతీష్. ఆ దేవుడి వ్యక్తిత్వం అతడి మనసుపై చెరగని ముద్ర వేసుకుంది. తనూ అంతటివాడు కావాలన్న కోరిక గుండెల్లో చేరుకుంది. నారాయణరావును సతీష్ ఆరాధించేవాడు. తాతయ్యకు సేవలు చేసినపుడల్లా అతడా పటంవైపు చూసేవాడు. ఆంజనేయుడు తన వాశీర్వదిస్తూన్నట్లూ, శెభాషని మెచ్చుకుంటున్నట్లూ అతడికి తోచేది.

ఈ రోజలాగనిపించడంలేదు.

"మళ్ళీ యెప్పుడూ తప్పు చేయను స్వామీ!" అను కున్నాడు సతీష్.

"ఏరా చాకు తెచ్చిపెట్టవా?"

సతీష్ మాట్లాడలేదు.

"ఎలా తెస్తావులే—....పారేసుకున్న వస్తువు మళ్ళీ దొరుకుతుందా?"

"నేను చాకు పారేసుకున్నానని నీకెవరు చెప్పారు....?"

"ఒకరు చెప్పాలా? నాకు దొరికింది కాబట్టి చెప్ప గలిగాను...."

"నీకు దొరికిందా—ఎక్కడ?" ఆత్రుతగా అడిగాడు సతీష్.

"మన దొడ్లో—...."

"అబద్ధం!" అన్నాడు సతీష్.

"ఇలా రా!" అన్నాడు నారాయణరావు.

సతీష్ నమ్మలేని చూపులతో ఆయన వంక చూస్తూ ఆయన్ను సమీపించాడు.

"ఈ తలగడ ఎత్తి చూడు!"

నారాయణరావు పట్టెడ మంచంమీద కూర్చుని వున్నాడు. మంచంమీద పువ్వుల దుప్పటి. తలాగ్ర దిక్కున ఓ ఫోమ్ తలగడ....దానికి దుప్పటితో మ్యాచయ్యే గలీబు....

సతీష్ తలగడ ఎత్తి చూసి ఒక్కడుగు వెనక్కు వేశాడు.

అక్కడ నిజంగా నే చాకుంది.

"ఏమిట్రా — అంతలా ఆశ్చర్యపడ్డావు....? అది

నీ దవునో కాదో చూసుకో— ....” అన్నాడు నారాయణరావు.

సతీష్ చాకును చేతిలోకి తీసుకున్నాడు.

స్టెయిన్ లెస్ స్టీలు చాకు. గులాబిరంగు బొమ్మ. ఎస్ అన్న పొడి అక్షరం....

“ఇది నాదే.... కానీ నీ దగ్గర కెలా వచ్చింది?”

“నువ్వు పారేసుకుంటే....”

“నీ కెక్కడ దొరికిందన్నావూ?”

“మన దొడ్లో ...”

సతీష్ ఉత్సాహంగా— “అంటే సుధాకర్ బొమ్మను నేను చంపలేదు....” అన్నాడు.

“ఏమన్నావూ?” అన్నాడు నారాయణరావు.

సతీష్ తడబడ్డాడు.

“సుధాకర్ బొమ్మేమయిరా?”

సతీష్ మాట్లాడలేదు.

“చంపడమేమిటిరా?”

సతీష్ మౌనం కొనసాగించాడు.

“నువ్వేదైనా చంపిందీ లేనిదీ నీకు తెలియదా? నా దగ్గర చాకు చూసి గానీ ఆ విషయం తెలుసుకోలేవా?”

సతీష్ నాలుకతో పెదాలు తడుముకున్నాడు— “అసలేం జరిగిందీ చెబుతాను తాతయ్యా!”

“చెప్పు!”

అతడు క్లుప్తంగా సుధాకర్ బొమ్మ చావు గురించి చెప్పి— “అక్కడ యిలాంటి చాకే వుంది. సుధాకర్ నన్ననుమానిస్తున్నాడు. నేనేమో ఆ చాకు నాది కాదనీ నా చాకు మనింట్లోనే వుందనీ దబాయించాను....”

అన్నాడు.

"హత్య గురించి నిన్ననుమానించడ మేమిటీ? నువ్వేమి కిరాయి గూండావు కాదు గదా...." అన్నాడు నారాయణరావు.

సతీష్ మళ్ళీ తడబడ్డాడు.

"సుధాకర్ బామ్మను నువ్వెందుకు చంపుతావు?"

"ఏమో—సుధాకర్ కి వాళ్ళ బామ్మంటే చాలా యిష్టం. చాకు చూడగానే నన్ననుమానించాడు...."

"అలాంటి వాళ్ళతో స్నేహం చేయకు...."

"అబ్బే—అదంతా తాత్కాలికావేశం తాతయ్యా! నా స్నేహితుడు విశ్వం అంటాడూ-సుధాకర్ కి ఎలాగైనా ఆ హంతకుణ్ణి పట్టుకోవాలనుందిట. నామీద అభియోగం చేసే నేనేమో పౌరుషం తెచ్చుకుని అసలు హంతకుణ్ణి పట్టుకుంటానని అలాగంటున్నాట్ట...."

"నువ్వు నిజం చెప్పడంలేదు. నా దగ్గరేదో దాస్తున్నావు...."

"లేదు తాతయ్యా!"

"అయితే ఆంజనేయుడి ముందుకు వెళ్ళి కళ్ళు మూసుకుని చేతులు జోడించి—నిజమేమిటో చెప్పేసేయ్.... నేను నమ్ముతాను...." అన్నాడు నారాయణరావు.

"లేకపోతే నమ్మవా?"

"నమ్మను...."

"అసలు నీకు నామీద అనుమానమెందుకొచ్చింది?"

"ఎందుకంటే....నీ చాకు శవం దగ్గరుంది. అది నీది కాదనీ ఇంట్లో నీ చాకుందనీ చెబితే నీ స్నేహితుడు నమ్మి ఊరుకున్నాడా?"

"లేదు....కాసేపట్లో వాళ్ళు మనింటికొస్తారు. నేను

చాకు చూపించలేకపోతే సుధాకర్ నామీద పోలీసు రిపోర్టిస్తానన్నాడు...."

"నువ్వేమన్నావు?"

"ఆ చాకు తాతయ్య దగ్గరుందన్నాను.... అంతే!"

"ఇప్పుడు సుధాకర్ నస్తాడా?"

"అవును....విశ్వంతో కలిసి...."

"ఒకవేళ చాకు నా దగ్గరలేదనుకో .... సుధాకర్ నీమీద పోలీసు రిపోర్టిచ్చాడనుకో—పోలీసులు విచారణ ప్రారంభించారనుకో...."

"ఊఁ."

"నీకెలా వుంటుంది?"

"నాకేం భయంలేదు. నేను హత్య చేయలేదుగా...."

"చేశావని పోలీసులంటారు...."

"అందుకు ఋజువుండదు...."

"నీ చాకు...."

"నా చాకింట్లోనే వుంది...."

"అదృష్టకొద్దీ అది నాకు దొరికింది. అది వేరే విషయం. చాకు నాకు దొరకలేదనుకో ...అప్పుడు...."

"ఇంతకీ నువ్వు చెప్పదల్చుకున్నదేమిటి తాతయ్యా?"

"హత్య జరిగిన సమయంలో నువ్వెక్కడున్నావు?"

"ఎక్కడుంటే మాత్రం—హత్యాస్థలంలో వున్నట్లు ఋజువు లేదుకదా ...."

"నీ చాకు హత్యాస్థలంలో వుంది...."

"అయితే?"

"అప్పుడు నువ్వింట్లో లేవు...."

"అయితే?"

"నువ్వింటికెప్పుడొచ్చావో—ఎదురింటి రామారావుకి తెలుసు అతిడా సమయంలో పరీక్షలకని చదువుకుంటున్నాడు...."

"ఇప్పుడివన్నీ యెందుకు తాతయ్యా? చాకిట్లో వుంది గదా!"

"హత్య జరిగిన సమయంలో నువ్వెక్కడున్నావో నాకు చెప్పు...."

"ఎందుకు?"

"నా తృప్తికోసం...."

"అంటే?"

"నా మనుమడు హంతకుడు కాదన్న తృప్తి నాక్కావాలి...."

"ఎందుకని? చాకిట్లోనే ఉందికదా....ఆ రుజువు చాలదా నీకు?"

"చాలదు...."

"ఎందుకు చాలదు?"

"అది నీ చాకు కాదు కాబట్టి!"

"అంటే?" అన్నాడు సతీష్ తెల్లబోయి.

"హత్యాస్థలంలో ఉన్న చాకు నీదే! అక్కడికెలా వెళ్ళిందో నువ్వు నాకు చెప్పాలి...." అన్నాడు నారాయణరావు.

"ఆ చాకు నాది కాదు...." అన్నాడు సతీష్.

"అయితే నీ చాకెక్కడుందో చెప్పు!"

"ఇదిగో—నా చాతిలో ఉంది...."

"ఇదీ నీది కాదు...." అన్నాడు నారాయణరావు.

"నాదికాక మరెవ్వరిది?"

"నాది...." అన్నాడు నారాయణరావు.

"చాకుమీద నా పేరుంది...."

"సరేలే—చాకులు కొన్నవాణ్ని నేను. కొనేటప్పుడే రెండు కొన్నాను. రెండింటిమీదా పేర్లు వేయించాను. ఒకదానిమీద ఎస్, మరోదానిమీద ఎన్. అయితే షాపువాడు పేర్లు సరిగా వేయలేదు. ఇంటికొచ్చేక చూశాను. రెండూ ఎస్. అనే ఉన్నాయి. ఒకటి నీకిచ్చాను. రెండోది నా దగ్గరుంచుకున్నాను...."

"నీకు చాకెందుకు?"

నారాయణరావు నవ్వి — "ఎందుకో ఒకందుకు? అప్పుడు నేను రెండు కొనడం ఇప్పుడు నీకు పనికొచ్చింది గదా! సుధాకర్ ఈ చాకు చూడగానే నీ మాటలు నమ్ముతాడు...." అన్నాడు.

"అవును తాతయ్యా....నీకు చాలా చాలా థాంక్స్!"

"అయితే నీ చాకెలా పోయిందో చెప్పు...."

"దాని గురించి నీకంత పట్టుదలెందుకు? నిజం చెబుతున్నాను తాతయ్యా—నేనీ హత్య చేయలేదు...."

"నువ్వు హత్యచేసినా చేయకపోయినా నీ చాకెలా పోయిందో నాకు తెలియాలి. ఎందుకంటే—ఎవరో నీ చాకును తీసుకెళ్ళి హత్యాస్థలంలో పడేశారు—లేదా హత్యకు వాడుకున్నారు. అంటే వాళ్ళకు నీమీద కక్షవుంది. పగ సాధిస్తున్నారు. నీ శత్రువులెవరో నేను తెలుసుకోవాలంటే నాకు నీ చాకెలా పోయిందీ తెలియాలి...." అన్నాడు నారాయణరావు గంభీరంగా.

"తాతయ్యా! నాకు శత్రువు లెవ్వరూ లేరు. చెప్పాలంటే నాకు నేనే శత్రువుని...." అన్నాడు సతీష్.

"అంటే?" అన్నాడు నారాయణరావు ఆశ్చర్యంగా.

"సుధాకర్‌కి చూపించడానికి చాకు దొరికింది,

నాకివ్వాదెక్కడలేని ఆకలి పుట్టుకొస్తోంది. వెళ్ళి భోం చేస్తాను....” అన్నాడు సతీష్.

మనుమడు మాట మారుస్తున్నాడని అర్థమై-“సరేలే-వెళ్ళు కడుపునిండా భోంచేయి. ఈసారి చాకు జాగ్రత్తగా దాచుకో—” అన్నాడు నారాయణరావు.

సతీష్ చటుక్కున చాకును నారాయణరావు మంచం మీద పెట్టి—“తాతయ్యా! ఇది నీ దగ్గరే ఉండనీ—సుధాకర్ కి నీ దగ్గరేకదా చూపిస్తానని చెప్పాను—” అన్నాడు.

నారాయణరావు చాకును నెమ్మదిగా తలగడక్రిందకు తోశాడు. సతీష్ తల్లి దగ్గరకు వెళ్ళి భోజనం పెట్టమని అడిగాడు.

“ఏ సమస్యనైనా మామయ్యే పరిష్కరిస్తారు..” అనుకుంది మాలతి సంతృప్తిగా.

## 7

జగన్నాథం ఇంటికి వస్తూనే తండ్రి గదిలోకి వెళ్లాడు. నారాయణరావతడికి జరిగినదంతా చెప్పి—“సుధాకర్ వచ్చి వెళ్ళాడు. మనవాడి ననుమానించినందుకతడు బాధపడ్డాడు—” అన్నాడు.

“నువ్వు అద్భుత వ్యక్తివి నాన్నా!” అన్నాడు జగన్నాథం.

“నేను అద్భుత వ్యక్తిని కావచ్చు కానీ అస్తమానూ అద్భుతాలు చేయలేను. నేను నిన్ను పెంచినట్లుగా నువ్వు సతీష్ని పెంచడంలేదని నాకిప్పుడనిపిస్తోంది-” అన్నాడు నారాయణరావు సీరియస్ గా.

“అదేమిటి నాన్నా!” అన్నాడు జగన్నాథం కంగారుగా.

"చిన్నప్పట్నించీ నేను నిన్నెంతో గారాబంగా పెంచాను. నువ్వు కోరినవన్నీ శక్తికొద్దీ నెరవేర్చడానికి ప్రయత్నించాను. నీ సంతోషమే నా సంతోషంగా జీవించాను. అయితే నిన్ను క్రమశిక్షణకు దూరంకానివ్వలేదు. నీకెంతో స్వేచ్ఛనిచ్చాను కానీ నిన్ను నా అదుపులోంచి పోనివ్వలేదు—...." అన్నాడు నారాయణరావు.

"అవును నాన్నా—పిల్లల పెంపకంలో ఎవరైనా నీ తర్వాతనే...."

"మాటలు చెప్పడంవరకే తప్ప నానుంచి నువ్వేమీ నేర్చుకున్నట్లు లేదు. మన సతీష్ అదుపు తప్పాడని నా కనిపిస్తోంది—" అన్నాడు నారాయణరావు.

"నాన్నా! చిన్నప్పట్నించీ సతీష్‌ని నీ సంరక్షణలో వదిలాను. నన్నదుపు చేసినట్లే నువ్వు వాడిని అదుపు చేయగలవని భావిస్తున్నాను...." అన్నాడు జగన్నాథం.

నారాయణరావదోలా నవ్వి — "ఈ విషయంలో నువ్వు చాలా పొరబడ్డావు. నువ్వు నా సంతానానివి. నిన్ను పైకి తీసుకురావడం నా బాధ్యత. అందుకే ఎప్పటికప్పుడు నిన్నదుపు చేస్తూ నీ ప్రగతిని రక్షించే వాణ్ని. నీకు వివాహమైనాక నా బాధ్యత ముగిసిందనుకున్నాను. సతీష్‌ని బాధ్యతగా నేనెప్పుడూ భావించలేదు. నాకు సంబంధించినంతవరకూ వాడొక ఆటబొమ్మ. మాట్లాడి మురిపించే జీవమున్న ఆటబొమ్మ. వాడితో నేను నా సరదాలు తీర్చుకునేవాణ్ణి. వాడినొక బాధ్యతగా నేనెప్పుడూ భావించలేదు. వాడి ప్రగతి గురించి నువ్వూ, కోడలూ ఆలోచిస్తారని నమ్మాను. కానీ అలా జరిగినట్లు లేదు...." అన్నాడు.

"అలా ఎందుకనుకుంటున్నావు?" అన్నాడు జగ

న్నాథం.

"మనవాడికి చదువోకమాదిరిగా వచ్చింది. సరేలే అనుకున్నాను. ఆ తర్వాత ఒక్క ఉద్యోగం తిన్నగా చేయలేదు. దానికీ సరిపెట్టుకున్నాం. గొప్పవాళ్ళ పిల్లను ప్రేమించానని చావుదెబ్బలు తిని తర్వాత మోసపోయానని గ్రహించాడు. ఇప్పుడేమో — రాత్రిళ్ళెక్కడెక్కడో తిరుగుతున్నాడు. వాడి చావు ఓ హాత్యాసలంలో ఉంది—" అన్నాడు నారాయణరావు.

"ఇదంతా యేమిటి?" అన్నాడు జగన్నాథం.

"ఏమిటో నువ్వే చెప్పాలి. కుర్రాడు నీ అదుపులో లేడనిపిస్తోంది...."

"ఇప్పుడు నేనేం చేయాలి?"

"సతీష్‌ని నీ అదుపులోకి తెచ్చుకో...."

జగన్నాథం దీనంగా నారాయణరావు వంక చూసి "నాన్నా! వాడి విషయంలో నీకేమైనా అనుమానముంటే-అది నువ్వే తెల్చుకో. నీ అదుపులోకి తెచ్చుకో. అప్పుడు నాకప్పగించి ఏం చేయాలో చెప్పు. నాకేమీ తెలియదు—" అన్నాడు.

నారాయణరావు నిట్టూర్చి—"అన్నింటికీ నామీద ఆధారపడితే — యెల్లకాలమూ నేనుండనుగదా—" అన్నాడు.

"ఏమో నాన్నా—నువ్వు చెబుతూంటే నాకేదో భయంగా ఉంది. అర్జంటుగా వాణ్ని నీ అదుపులోకి తెచ్చుకో—...." అన్నాడు జగన్నాథం.

"రాత్రిళ్ళు వాడెక్కడికి వెడుతున్నాడో — ఏం చేస్తున్నాడో—అదికూడా నీకు తెలియదా— తెలుసుకోలేవా?" అన్నాడు నారాయణరావు.

జగన్నాథం తల అడ్డంగా ఊపి—"అడిగితే తిన్నగా యేదీ చెప్పాడు వాడు—" అన్నాడు.

# 8

రాత్రి పదయింది.

"అమ్మా! తలు పేసుకో — నేను మళ్ళీ తెల్లవారు ఝూమున వస్తాను...." అన్నాడు సతీష్.

"ఎక్కడికిరా?" అంది మాలతి.

"ఎక్కడికో అక్కడికి — నీకెందుకు?" అన్నాడు సతీష్ నిర్లక్ష్యంగా ముందుకు వెడుతూ.

"ఎక్కడికిరా?

సతీష్ ముందడుగు వేయబోయినవాడే చటుక్కున మళ్ళీ వెనక్కి తిరిగాడు.

ప్రశ్న వేసిన ఆ గొంతు అతడి తాతయ్యది.

"స్నేహితుడింటికి—...."

"ఎవరా స్నేహితుడు?"

"నీకు తెలియదతడెవరో" అన్నాడు సతీష్.

"నాకు తెలియని వాళ్ళింటికి నువ్వు వెళ్ళడానికి లేదు...."

"ఎందుకని?"

"రాత్రిళ్ళు నిన్ను బయటకు పంపను ..."

"ఎందుకు?" రెట్టించాడు సతీష్.

"ఒకసారి చాకు పారేసుకుని వచ్చావు. మళ్ళీ ఇంకేం పారేసుకుంటావోనని నా భయం...."

"పారేసుకుందుకు నా దగ్గరింకేమీ లేవు...."

"నీ గురించి నీకంటే నాకు బాగా తెలుసు. నువ్వెక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు. పద — లోపలకు...." నారాయణరావు గంభీరంగా అన్నాడు.

"తాతయ్యా—ప్లీజ్ ....నన్ను వెళ్ళనీ ...."

కాసేపు తాతామనుమళ్ళ మధ్య వాగ్వివాదం జరిగింది.

మాలతి ఇదంతా కుతూహలంగా చూస్తోంది.

ఇద్దరూ యెవరిపట్టు వారు వదలడంలేదు. మాలతికి తల్లి మనసులోకి—"పోనీ—వాడిని వెళ్ళనిస్తే నేం?" అనుకుంది కానీ పైకి అనలేదు.

నారాయణరావు చివరికి విసుగ్గా—"ఒక షరతుమీద నిన్ను బయటకు వెళ్ళనిస్తాను...." అన్నాడు.

"చెప్పు— ...."

"నేనూ నీతో వస్తాను...."

"కుదరదు...."

"అయితే నువ్వు బయటకు వెళ్ళడం కుదరదు...."

ఇద్దరిమధ్యా మళ్ళీ వాగ్వివాదం. చివరికి నారాయణరావే జయించాడు. ఎందుకంటే ఆయన మనుమడితో వచ్చి తీరుతానని పంతం పట్టాడు.

అసహనంగా, అయిష్టంగా సతీష్ ఇంట్లో ఉండడానికి అంగీకరించాడు. నారాయణరావు తృప్తిగా నిట్టూర్చాడు.

# 9

ఒక రాత్రివేళ సతీష్ లేచాడు. టైమప్పుడు పన్నెండు కావస్తోంది.

అసహనంగా అతడు నారాయణరావువంక చూశాడు.

నారాయణరావు కళ్ళు తెలియని నిద్రలో ఉన్నాడు. గుర్రుకూడా పెడుతున్నాడు.

గదిలో నైట్ బల్బు వెలుగుతోంది.

సతీష్ గదిలోంచి బయటకు వెళ్ళపోయాడు. అప్రయత్నంగా అంజనేయుడి బొమ్మ అతడివంక క్రూరంగా

చూసింది.

సతీష్ ఆగిపోయాడు.

నారాయణరావింకా గుర్రుపెడుతూనే ఉన్నాడు.

సతీష్ పటానికి నమస్కరించి—"అంజనేయా! నన్ను మన్నించు—" అంటూ గదిలోంచి బయటకు వచ్చాడు.

గది బయటకుకూడా నారాయణరావు గుర్రు వినపడుతూనే ఉంది.

సతీష్ తేలికగా నిట్టూర్చి ముందడుగు వేశాడు. అయితే వీధి గుమ్మానికి అడ్డంగా ఓ మడత మంచం దానిమీద—మాలతి పడుకుని ఉంది.

"ఓహో—నన్నాపడానికి గట్టి ప్రయత్నమే జరుగుతోందన్నమాట...." అనుకున్నాడు సతీష్. అతడు దొడ్డిదారిన బయటకు వెళ్ళాలనుకున్నాడు. కానీ బయటకు వెళ్ళడానికుపయోగించే ఇతర ద్వారాలు రెండూ మూసి, తాళం పెట్టబడి ఉన్నాయి. బయటకు వెళ్ళాలంటే ఇక వీధి గుమ్మం ఒక్కటే మిగిలింది.

సతీష్ తటపటాయించలేదు. తల్లి దగ్గరకు వెళ్ళాడు. తట్టిలేపాడు. మాలతి కళ్ళు నులుముకుంటూ లేచి—"ఏమిట్రా!" అంది.

"నేను వెళ్ళాలమ్మా!" అన్నాడు సతీష్.

"ఎక్కడికి?"

"హుష్—గట్టిగా అరవకు తాతయ్య లేస్తాడు...."

"ఎక్కడికో చెప్పు...." అంది మాలతి స్వరం తగ్గించి.

"అమ్మా! నా స్నేహితుల్లో పరువుపోతుంది. వచ్చేక అన్నీ చెబుతాను. నేను కాని పనేమీ చేయడంలేదు. నన్ను వెళ్ళనీయి—" అన్నాడు సతీష్.

"తాతయ్య నిన్నెక్కడికీ వెళ్ళనివ్వద్దన్నారు...."

"అమ్మా-ఈ ఒక్క రోజుకీ ...ప్లీజ్...." అన్నాడు సతీష్.

మాలతి ఒప్పుకో లేదు.

సతీష్ వెంటనే తల్లి కాళ్ళు పట్టుకుని — "నేను నీ కాళ్ళు వదలను-నన్ను వెళ్ళనిచ్చేదాకా—" అన్నాడు.

మాలతి కాస్త చలించింది. అయినా మేకపోతు గాంభీర్యం వహించింది.

ఈలోగా ఆమె పాదాలు తడిశాయి.

సతీష్ యేడ్వడం ప్రారంభించాడు. కన్నీటితో ఆమెకు పాదాభిషేకం చేస్తున్నాడు.

మాలతి ఇక ఆగలేకపోయింది—"సరే వెళ్ళు మళ్ళీ తాతయ్య లేచేలోగా వెనక్కు వచ్చెయి. గుర్తుంచుకో-ఈ ఒక్క రోజుకు మాత్రమే నిన్ను వెళ్ళనిస్తున్నాను" అన్నదామె.

సతీష్ బయటకు వెళ్ళాడు.

అతడిలా వెళ్లాడో లేదో-"ఇదన్న మాట-నీ అదుపు" అన్నమాట వినిపించింది. మాలతి ఉలిక్కిపడి వెనక్కు తిరిగింది.

నారాయణరావు, జగన్నాథం అక్కడ కనబడ్డారామెకు.

"ఒరేయ్—జగన్నాథం! బాగు చేసుకున్నా, పాడు చేసుకున్నా—మీ పిల్లల విషయంలో బాధ్యత మీదేనని చెప్పానుగా. నువ్వు త్వరగా వెళ్ళి వాడెక్కడికి వెడుతున్నాడో, ఏం చేస్తున్నాడో చూసి వచ్చి నాకు చెప్పు....—" అన్నాడు నారాయణరావు.

జగన్నాథం వెంటనే వెళ్ళిపోయాడు.

నారాయణరావు కోడలి వంక తీవ్రంగా చూసి—
"సతీష్ ఎలా పాడయ్యాడో నాకు తెలుస్తోందిప్పుడు-" అన్నాడు.

"నన్ను క్షమించండి మామయ్యా!" అంది మాలతి.

"నిన్ను నేను క్షమించగలను కానీ సతీష్‌ను బాగు చేయలేను—" అన్నాడు నారాయణరావదోలాగున.

"వాడు కాళ్ళు పట్టుకుని యేడ్చేసరికి కాదనలేక పోయాను—...."

"పిల్లల్ని అదుపు చేయడానికి మనోబలముండాలి. వాళ్ళనదుపు చేయడం వాళ్ళ క్షేమానికే!" అన్నాడు నారాయణరావు.

"ఇప్పుడేమవుతుంది?" అంది మాలతి.

"నువ్వు చేసిన పొరపాటు నీ కొడుకు నేదశకు తీసుకుని వెళ్ళిందో తెలుసుకునేందుకు — నీ భర్త తిరిగి రావాలి—" అన్నాడు నారాయణరావు.

ఆ తర్వాత మాలతి నిద్రపోలేదు. ఏ శక్తి సతీష్‌ను బలవత్తరంగా ఆకర్షిస్తోందో తెలుసుకోవాలని ఇద్దరూ యెదురుచూస్తున్నారు.

కాసేపటికి జగన్నాథం వచ్చాడు. అతడి ముఖంలో ప్రస్ఫుటంగా దిగులు. తండ్రి భార్య యెంతగా అడిగినా జవాబు చెప్పడానికతడికి గొంతు పెగలడానికి కాసేపు పట్టింది.

ఏమైతేనేం అసలు విషయం అందరికీ తెలిసింది.

సతీష్ మత్తుపదార్థాల కలవాటుపడ్డాడు.

"మత్తుపదార్థాలంటే?" అంది మాలతి.

"అవి రకరకాలు. బాధల్ని మరిచిపోవడానికీ, అసంతృప్తిని జయించడానికీ మనిషి వాటిని ఆశ్రయి

స్తాడు. అప్పు డతడికి తన పై తనకే అదుపుండదు. మత్తు పదార్థాలకు బానిస అయిన వ్యక్తి శారీరకంగా, మాన సికంగా కృశించి దౌర్భాగ్యపు చావు చస్తాడు. అదీ చిన్న వయసులో!" అన్నాడు నారాయణరావు.

మాలతి వణికిపోయింది.

నారాయణరావు కొడుకు వంక తిరిగి—"నువ్వు వాడిని వెంట తీసుకునిరాలేదేం?" అన్నాడు.

"వాడెక్కడికి వెళ్ళాడో చూశాను. ఏంచేస్తున్నాడో తెలుసుకున్నాను. నాకా వాతావరణంలో అడుగు పెట్టాలంటే భయం వేసింది నాన్నా! ఎలాగో అలా నువ్వే మన సతీష్‌ని రక్షించాలి—" అన్నాడు జగన్నాథం.

నారాయణరావు నిట్టూర్చి- "ఇండంత గోలపెట్టి అక్కడికి పోయాడంటే వాడీ పదార్థాలకు బాగా అల వాటు పడ్డాడన్నమాట. మన నిర్లక్ష్యం వల్లనే వాడీదశకు వచ్చాడు. వాడి గురించి మనకు తెలిసినట్లు వాడికి తెలియ నివ్వద్దు వాణ్ని మంచిదారిలో పెట్టే ఉపాయం నేనాలో చిస్తాయి-" అన్నాడు.

"నువ్వాలోచిస్తే అన్నీ సానుకూలమవుతాయి. నాకా నమ్మకముంది నాన్నా!" అన్నాడు జగన్నాథం.

ఆ రాత్రికి ఆ యింట్లో ఎవ్వరికీ సరిగా నిద్రపట్టలేదు. తెల్లవారుఝామున సతీష్ వస్తే ఆ విషయం కూడా ఎవ్వరూ పట్టించుకోలేదు.

# 10

మర్నాడుదయం సతీష్ బాగా ఆలస్యంగా నిద్ర లేచాడు. ఎవ్వరూ అతణ్ని పెందరాళే నిద్ర లేపడానికి ప్రయత్నించలేదు.

సతీష్ నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకునేసరికి జగన్నాథం ఆఫీసుకు వెళ్ళిపోయాడు. నారాయణరావు మనుమణ్ణి పిలిచి—"ఒరేయ్-కొన్నాళ్ళుగా నేను ఒంటరి తనం ఫీలవుతున్నాను. కొంతకాలం పాటు మనమిద్దరం కలిసి తిరుగుదాం. నువ్వెక్కడికి వెడితే నేనూ అక్కడికి వస్తాను-" అన్నాడు.

"ఒక్క రాత్రిళ్ళు తప్ప...." అన్నాడు సతీష్.

"ఎందుకని?"

సతీష్ వెంటనే ఏమీ బదులివ్వలేదు. ఒక్కక్షణం ఆగి—"తాతయ్యా! సుధాకర్‌కి నేను తన బామ్మను చంపానని అనుమానంగా ఉంది. తనూ నిన్ను చంపి ప్రతీకారం తీర్చుకుంటానంటున్నాడు. రాత్రిళ్ళు నువ్వు బయట తిరగడం మంచిదికాదు—" అన్నాడతడు.

"నువ్వు సుధాకర్ బామ్మను చంపితే మధ్య నేనేం చేశాను?"

"చావు విషయంలో నువ్వేదో నాటకమాడావని అతడి అనుమానం. ఆపైన నాకు నువ్వంటే యిష్టమని తెలుసుగా.... నీ కోసం నేను జీవితాంతం కుమిలి ఏడ్చేలా చేస్తానంటున్నాడు...." అన్నాడు సతీష్.

"అయితే మాత్రం-నాకేం భయంరా ... నేనెక్కడికి వెళ్ళినా నువ్వు నా పక్కనుంటావు. నీ తాతయ్యను నువ్వు రక్షించుకోలేవూ?" అన్నాడు నారాయణరావు.

సతీష్ అప్రయత్నంగా గదిలోని పూజామందిరంవైపు చూశాడు. పైన గోడకు వ్రేలాడుతున్న పటంలోని ఆంజనేయుడు తడి వైపు కుతూహలంగా చూస్తున్నాడు.

"చెప్పరా — నీ తాతయ్యను నువ్వు రక్షించుకో లేవూ?"

"నా మాట విను తాతయ్యా—రాత్రిళ్ళు నువ్వు బయటకు రావొద్దు."

నారాయణరావు చిరాగ్గా — "నువ్వేవో దాస్తున్నావు. ఆంజనేయుడు సాక్షిగా నిజం చెప్పాలి నువ్వు"-అన్నాడు.

సతీష్ చటుక్కున - "ఆ పటానికి ఫ్రేం పాడయింది తాతయ్యా! నేను కొత్త ఫ్రేం వేయిస్తాను...."అన్నాడు.

అతడు మాట మార్చుతున్నాడని నారాయణరావు గ్రహించాడు. తనూ నొక్కించకూడదనుకుని—"ఫ్రేం మార్చినా ఆంజనేయుడు మారడు—" అన్నాడాయన.

"నాకు తెలుసు. ఏదో నా తృప్తికోసం-" అన్నాడు సతీష్.

నారాయణరా వంగీకరించగానే అతడు పటం తీసుకుని బయటకు వెళ్ళి కాసేపట్లోనే తిరిగివచ్చి - "తాతయ్యా! చాలా పెద్దఘోరం జరిగిపోయింది-" అన్నాడు.

"ఏమయిందిరా?" అన్నాడు నారాయణరావు.

"పటం దారిలో చేయిజారి పగిలిపోయింది. బొమ్మ తీసుకుందామనుకుంటూండగా ఓ పిచ్చివాడు పరుగునవచ్చి నా దగ్గర్నుంచి అది లాక్కుని ముక్కలు ముక్కలుగా చింపేశాడు—" అన్నాడు సతీష్.

నారాయణరా వా కథ నమ్మలేదు. సతీషంతరాత్మ నా పటం బాధిస్తోంది. అందుకని కావాలనే అతడా పటాన్ని నాశనం చేశాడని ఆయన నమ్మాడు.

"సతీష్ విషయంలో ఏదో ఒకటి చెయ్యాలి. వాడి పరిస్థితి ప్రమాదకరంగా తయారవుతోంది—"అనుకున్నాడాయన.

# 11

ఆ రోజు మధ్యాహ్నం బయటకు వెళ్ళిన సతీష్ రాత్రి పది నా ఇంటికి రాలేదు. మాలతి బెంగపడుతూంటే—

"నిన్న వాణ్ని అదుపుచేయాలని చూశాంగదా—అందుకని మధ్యాహ్నమే ఇల్లు వదిలి పెట్టాడు—" అన్నాడు నారాయణరావు

ఆయన జగన్నాధాన్నడిగి సతీష్ వెళుతున్న ఇంటి వివరాలు తెలుసుకున్నాడు. అప్పటికప్పుడే తనే ఆ ఇంటికి బయల్దేరాడు.

అదొక చిన్న బంగళా. బంగళా ముందు వరండాలో పడక కుర్చీలో ఓ నడివయస్కుడు కూర్చుని ఉన్నాడు. ఆయన నారాయణరావును చూసి—"ఎవరు మీరు? మీ రెవరి కోసం వచ్చారు?' అన్నాడు.

"నా మనుమడి పేరు సతీష్....అతడికోసం వచ్చాను.."

"అతడిక్కడుంటాడని మీ కెవరు చెప్పారు?"

"నాకు నీ గురించి అంతా తెలుసు. యువకులను మత్తు పదార్ధాల కలవాటు చేయడం నీ వృత్తి. నీ విషయం పోలీసులకు రిపోర్టు స్తాను. నీ అంతం చూస్తాను-"అన్నాడు నారాయణ రావావేశంగా.

అతడు నవ్వి—"నా గురించి బాగానే తెలుసుకున్నావు. తెలుసుకున్నాక నువ్వు మిగలవు-" అన్నాడు.

"నన్ను బెదిరించకు. నాకు భయంలేదు...." అన్నాడు నారాయణరావు.

"అయితే లోపలకు వెళ్ళు. నీ సతీషున్నాడేమో చూసుకో"—అన్నాడా వ్యక్తి.

నారాయణరావు లోపలకు వెళ్ళాడు. ఓ చిన్నగది.... ఆ గదినానుకుని ఓ విశాలమైన హాలు. హాల్లో పదిహేను

గురు యువకులున్నారు. వాళ్ళలో ఆయనకు సుధాకర్, విశ్వంలు కనబడ్డారు. సతీష్లేడు.

వాళ్ళందరూ అలౌకికానందంలో ఉన్నారు. కొందరు పైపు పీలుస్తున్నారు. కొందరు సిగరెట్ కాలుస్తున్నారు.

సుధాకర్ నారాయణరావును చూసి—"మీరు సతీష్ కోసం వచ్చారా? ఆ వంక పెట్టుకుని వచ్చారా?" అన్నాడు.

అతడీలోకంలో లేడని నారాయణరావు కర్థమయింది. సరిగ్గా అప్పుడే బయటివ్యక్తి లోపలకు వచ్చి— "నా ప్రియ స్నేహితులారా! ఇతడు నన్ను పోలీసులకు పట్టిస్తానని బెదరిస్తున్నాడు. నేను పోలీసులకు దొరికితే మీకీ ఆనందముండదు. కాబట్టి మీరితడికి తగిన విధంగా బుద్ధి చెప్పండి...." అన్నాడు.

ఆ వ్యక్తి మాటలు పూర్తయ్యేలోగా నలుగురు యువకులు నారాయణరావు మీద పడ్డారు. వాళ్ళు తలో దెబ్బ వేస్తూంటే నారాయణరావు క్రిందపడిపోయాడు. లేవబోతూండగా గుమ్మం దగ్గర ఆయనకు సతీష్కనిపించాడు.

"ఒరేయ్ సతీష్.... సమయానికి వచ్చావు. నన్ను రక్షించరా?" అని అరిచాడాయన.

సతీషాయన వంకే చూస్తూ ముందడుగు వేశాడు.

## 12

"అన్నకు, నాన్నకు సతీష్ నమస్కరించి వ్రాయునది.

దీపను ప్రేమించిన భ్రమలో నేను మత్తుపదార్థాల కలవాటు పడ్డాను. ఆ అలవాటుకు డబ్బుకావాలి. అందుకని చిల్లర నేరాలు ప్రారంభించాను. డబ్బు దొంగి

లించడానికి వృద్ధులను, అసహాయులను, వికలాంగులను ఎన్నుకునేవాణ్ని. ప్రతిఘటించిన కారణంగా చాకుతో పొడిస్తే సుధాకర్ బొమ్మ చనిపోయింది. ఆ హత్య నేనే చేశాను.

నేను మత్తు పదార్థాలకి బానిసని. వాటి కోసం ఏమైనా చేస్తాను. నావంటి యువకులు చాలామంది ఉన్నారు. మా వంటి వారివల్ల ప్రమాద ముండకూడదనుకుని-తాతయ్యాను రాత్రిళ్ళు బయట తిరగవద్దని హెచ్చరించాను. ఆయన నా మాట వినకుండా సరాసరి రాకూడని చోటుకే వచ్చాడు.

తాతయ్య నన్ను హత్యకేసులోంచి రక్షించాడు. ఎక్కడున్నా నేను తనని రక్షించగలనని నమ్మాడు. కానీ మత్తు పదార్థాల అదుపులో ఉన్న నేను—వాటికోసం ఏమైనా చేయగల నేను—ఆ సమయంలో— నన్ను రక్షించు సతీష్.... అంటున్న తాతయ్యను.... నేనే స్వయంగా చాకుతో పొడిచి చంపాను. ఏ చాకుతో అయితే తాతయ్య నన్ను రక్షించాడో—ఆ చాకుతో నే ఆయన్ను పొడిచి చంపాను.

తెల్లవారేక గానీ నా తప్పు నాకు తెలియలేదు. అప్పుడు నా తప్పు నాకు తెలిసీ ప్రయోజనంలేదు.

తాతయ్య నా గురించి ఆత్మార్పణ చేశాడు. ఆయన ఆత్మార్పణ నాకు సహకరించదు. ఇప్పటికే నేను హంతకుణ్ని.

అయితే తాతయ్య ఆత్మార్పణ వృథా పోకూడదు.

అందుకే నన్నిలా తయారుచేసిన వారి గురించిన పూర్తి వివరాలు పోలీసు స్టేషన్ కు ఉత్తరం ద్వారా అందజేస్తు

న్నాను.

అసలేం జరిగిందో తెలుసుకుందుకు మీకీ ఉత్తరం రాస్తున్నాను.

ఇది మీకందే సమయానికి నేనీలోకంలో ఉండను.

అదుపు తప్పిన యువకులకు నా కథ అదుపు కావాలన్నది నా కోరిక. త్వరగా తాతయ్యను కలుసుకుని ఆయన కెకాంత బాధ లేకుండా చేయాలన్నది నా ఆకాంక్ష. తాతయ్యంటే నా కెంత ఇష్టమో మీకూ తెలుసు....”

ఉత్తరం మడిచి జగన్నాథం ఏడుస్తూ—“నాన్నా! నా కొడుకును నేనదుపు చేయలేక పోయాను. నీ ప్రాణ త్యాగంతో దేశంలోని ఎందరో యువకుల నదుపు చేస్తున్నావు నువ్వు—” అన్నాడు.

పూజామందిరం పైన గోడకు వ్రేలాడుతున్న ఫోటోలో ఆంజనేయుడి స్థానంలో వున్న నారాయణరావు ముఖంలో చెరగని చిరునవ్వు—కొడుకుతో—“నీ దుఃఖాన్ని అదుపు చేసుకో.” అని హెచ్చరిస్తోంది.

—: అయిపోయింది :—

# అగ్నినేత్రాలు

## ఏ. యస్. రావ్

నిలువుటద్దం ముందు అతను ఠీవిగా నిలబడ్డాడు.

నీలం రంగు పాంటులోకి దోపిన కాలర్ లేని ఎర్రషర్టు. సన్నటి నడుముని పాములా చుట్టుకున్న వెడల్పాటి లెదర్ బెల్టు. నిగనిగలాడుతున్న బూట్లు, కండలు తిరిగి, కడ్డీలా వున్న తన పొడుగాటి శరీరాన్ని అతను తృప్తికరంగా అద్దంలో చూసుకున్నాడు.

సగం నుదుర్ని కప్పేసిన క్రాపు కిందినుంచీ కళ్ళు సాన పెట్టిన వజ్రాల్లా చూస్తున్నాయి. నవ్వుతో విచ్చుకుంటున్న పెదవులమధ్య ఇరుక్కున్న సిగరెట్టు కదిలింది. పొగ జొర బడకుండా కళ్ళు సగం మూసుకునివున్నాయి.

టక్ టక్ టక్ ....తలుపుమీద వేళ్ళ కణుపులు చప్పుడు చేశాయి. అతను వాచీ చూసుకున్నాడు. సరిగ్గా పది గంటలు. బాగా బలిసిన గిత్త అర్రులావున్న తన మెడని అరచేత్తో ప్రేమగా రుద్దుకుంటూ అతను తలుపువేపు చూశాడు.

"కమిన్!" ప్రముఖ నటుడు స్వర్గీయ కె. వి. యస్. శర్మకంఠంలా అతని కంఠం గంభీరంగా ధ్వనించింది.

సన్నగా పొడుగ్గావున్న వ్యక్తి తలుపు తోసుకుని లోపలకు ప్రవేశించాడు. వీపుతో తలుపుమూసి అలాగే నిలబడి, తన ఎదురుగా స్తంభంలా నిలబడ్డ పరమేశ్వర్‌ని చిరునవ్వుతో చూశాడు.

పరమేశ్వర్ కన్నార్పకుండా చూస్తున్నాడు. తెల్లటి పాంటు తెల్లటి శ్లాక్. వారం రోజుల క్రితం గీసుకుని వుండాల్సినగడ్డం. దేవానంద్‌లా అతను కాలర్ కింద జేబు రుమాలు మడత పెట్టి వుంచుకున్నాడు.

"ఈసారి యే పేరుతో పిలిస్తే పలుకుతావు?" పరమేశ్వర్ నవ్వుతూ అడిగాడు.

"రాజా అనండి!" అతను నవ్వాడు.

మెడమీద అరచేత్తో నిమురుకుంటూ పరమేశ్వర్ టేబుల్ ముందున్న కుర్చీలో కూచున్నాడు. "సిడౌన్ రాజా!" అన్నాడు.

రాజా అతని కెదురుగా కుర్చీలో కూచుని ప్రశ్నార్థకంగా చూశాడు. పరమేశ్వర్ సిగరెట్ వెలిగించి పాకెట్‌ని అతనివైపు విసిరాడు.

"ఏమిటి సంగతి?" పరమేశ్వర్ ప్రశ్నించాడు నోట్లోంచి సిగరెట్ తీయకుండా.

రాజా సిగరెట్‌ని వేళ్ళతో పట్టుకొని బొటనవేలి గోటిమీద నాలుగుసార్లు కొట్టాడు. "గృహిణి హోమ్ అప్లయన్సస్" పేర మీరు చెప్పిన విధంగా సెకండ్‌హాండ్ వాన్ కొన్నాను. బ్లూకలర్ మహీంద్రా. పాతికకి తక్కువ కాదన్నాడు. పదహారు వేలిచ్చాను. ఆరువేలు దాకా మనకి ఖర్చవుతుంది...." అంటూ అతను అగ్గిపుల్ల

తీసి చెవిలో జొనిపి గిరగిర తిప్పసాగేడు.

"వాన్ కండిషన్ ఎలా వుంది?"

"రెండు టైర్లు మార్చాలి. రేడియేటర్, బ్రేకూ్స రిపేరు చేయాలి. గేర్ ప్లేట్ కొద్దిగా మార్చాలి...."

"ఓకే. అన్ని మరమ్మత్తులూ చేయించి ఎల్లుండి డెలివరీ తీసుకో. అవసరమయితే కొంచెం ఎక్కువగా పారేయ్. కిటికీలకి దళసరిగా వుండే కర్టెన్స్ కట్టించు" పరమేశ్వర్ వివరంగా చెప్పాడు.

చెవిలో తిప్పుతున్న అగ్గిపుల్ల వెలికి తీసి, పరీక్షగా చూసి, గీచి, రాజు సిగరెట్ వెలిగించాడు. "యస్!" అన్నాడు. పరమేశ్వర్ జేబులోంచి నోట్ల కట్టని ఇవతలకి తీశాడు. కొన్ని నోట్లు లాగి రాజువైపు విసిరాడు.

"ఈ అయిదొందలూ ఖర్చులకి వుంచుకో. పదో తేదీ రాత్రి సరిగ్గా పదిగంటలకి ఇక్కడ నన్ను కల్సుకో. ఈ అయిదురోజులూ చిల్లర దొంగతనాలు చేయొద్దు నీమీద పోలీసుల దృష్టి పడ్డం ప్రమాదం! నీ రూపంలో కొద్ది మార్పులు రావాలి...."

"యస్ బాస్!" నోట్లు జేబులో పడేసుకుంటూ ముసిముసిగా నవ్వాడు.

"చెప్పిందంతా చెయ్. నౌ యూ కెన్ గో!" అన్నాడు పరమేశ్వర్. రాజు లేచాడు. సెల్యూట్ చేసి వెళ్ళిపోయాడు. అతని వెనకే తలుపు మూసుకుంది.

పరమేశ్వర్ కాలుతోన్న సిగరెట్‌ను జాగ్రత్తగా ఇవతలికి తీసి, పొడుగ్గా తయారైన బూడిదను సంతృప్తికరంగా పరిశీలించి యాష్‌ట్రేలో పడేశాడు.

తలుపుమీద చప్పుడు. పరమేశ్వర్ పైకి చూశాడు.

పదీ పదిహేను. "కమిన్!" అతని కంఠం గంభీరంగా ధ్వనించింది.

శబ్దం చేయకుండా తలుపు ముందు ప్రత్యక్షమయిన పొట్టిగా లావుగా వున్న వ్యక్తిని అతను చిరునవ్వుతో చూశాడు నీలంరంగు పాంటూ, లేత నీలంరంగు పొడుగు చేతుల చొక్కాలో బిగించి కట్టిన వస్తాలా వున్నాడతను. బోర్లించిన కుండలా పైకి ఉబికిన పొట్టి చొక్కా గుండీలని యే క్షణంలో అయినా తెంచేసేలా వుంది. బాగా తోమిన రాగిచెంబులా మెరుస్తున్న బట్టతలమీద చెమట పూసల్లా మెరుస్తోంది.

"నమస్తే!" అన్నాడతను బొంగురు కంఠంతో. అమాయకంగా కనిపిస్తున్న అతని గుండ్రటి మొహంమీద చిరునవ్వు నాట్యం చేస్తోంది. కళ్ళ కొసల్లో యేర్పడిన గీతలు కాకి కాళ్ళ గుర్తుల్లా వున్నాయి.

"మళ్ళీ కొత్త అవతారం ఎత్తావా?" పరమేశ్వర్ నవ్వుతూ అడిగాడు.

అతను నవ్వాడు. "ఈ వారంలో ఆ అవసరం రాలేదు!"

"రైట్! సిడౌన్ భద్రం!"

భద్రం బట్టతలమీదున్న చెమటని అరచేత్తో జాగ్రత్తగా తుడిచి, అరిచేతిని పాంటు వెనుక భాగానికి రుద్దుకుంటూ కుర్చీలో కూచున్నాడు. అతని దేగకళ్ళు పరమేశ్వర్ని సూటిగా చూస్తున్నాయి.

"చెప్పు!" పెదవుల మధ్య ఇరికించిన సిగరెట్ని లైటర్తో వెలిగించి, పరమేశ్వర్ అన్నాడు.

భద్రం చిన్నగా దగ్గాడు. "నాలుగు రోజులుగా కాళ్ళ నొప్పులు పుట్టేలా గుట్టలూ పుట్టలూ పట్టుకుంటూ

తిరిగాను. మీరు చెప్పిన లక్షణాలున్న ప్రదేశం మన ప్రాంతాల్లో వొకటేమో అనిపించింది....”

పరమేశ్వర్ కళ్ళు చిట్లించాడు. “ఉపోద్ఘాతం వద్దు. సంగతి చెప్పు!”

భద్రం నవ్వడానికి ప్రయత్నించాడు “చివరకి ఇవాళ పొద్దుట, చాలా కాలంగా మనిషి అడుగు పెట్టని ఓ ప్రదేశాన్ని కనిపెట్టాను. మట్టి రోడ్డు నుంచీ దాదాపు అర కిలోమీటర్ నడిచాక, కొంత క్రిందిభాగం చేరుకుంటాం, అక్కణ్ణుంచి చెట్లకిందా, పొదల కిందా పాకుతూ వెళ్ళాలి. ముప్పావతిక ఎత్తుకి ఎక్కాక ఆ గుహని చేరుకుంటాం. ముందున్న చెట్లకి అల్లుకున్న తీగలు గుహకి గోడలా అడ్డున్నాయి. ద్వారం ఇరుగ్గా వుంది. లోపల చిన్న చిన్న గదుల్లా మూడు అరలున్నాయి. లోపల కటిక చీకటి ”

“వరీనైస్. మనకి అన్నివిధాలా వుపయోగపడే మందిరం కనిపెట్టావ్! మెయిన్ రోడ్డు నుంచీ యెంత దూరం?” పరమేశ్వర్ అడ్డొస్తూ అడిగాడు.

“ఖచ్చితంగా చెప్పడం కష్టం. అక్కణ్ణుంచీ తిరిగొస్తూ నడిచి మెయిన్ రోడ్ చేరటానికి గంట పైగా పట్టింది.”

పరమేశ్వర్ నోట్లోంచి సిగరెట్ ని తీసి యాష్ట్రేలో పడేసి కళ్ళు పూర్తిగా తెరిచాడు. “భద్రం, నీకు అడివి మనుషులెవరూ తగల్లేదుగా?”

భద్రం ఆశ్చర్యంగా చూశాడు. “అడవి మనుషులా?”

“ఫారెస్టు డిపార్టుమెంటు వాళ్ళు....” పరమేశ్వర్ నవ్వుతూ అన్నాడు.

భద్రం పకపకా నవ్వాడు. "వాళ్ళు అంత లోపలి కంటా వెళ్ళరు. ఎవరేనా వెళ్తే, దారితప్పి తిరిగివచ్చేప్పుడు మామూళ్ళు వసూలు చేసుకుంటారు!"

"ఎవరూ నిన్ను మార్చేదంటావా?" పరమేశ్వర్ అనుమానంతో ప్రశ్నించాడు.

"అడివి మనుషులే కాదు, యే మనుషులూ నా కంట పళ్ళేరు!" భద్రం సగర్వంగా అన్నాడు.

పరమేశ్వర్ మెప్పుగా తల ఆడించాడు. "భద్రం, మనం సులభంగా పైకి చేరుకోడానికి ఆ ముళ్ళకంపల మధ్య దారి యేర్పాటు చేయాలి...."

"నేను వెళ్ళడం కోసం ఈ చేతుల్తో కంపల్నీ, తీగల్నీ తెంచిపారేసూ ఓ మోసురుగా దారి చేశాను. అది చాల దనుకుంటే కొడవాలీ, గొడ్డలీ వగైరా పట్టుకెళ్ళాలి" భద్రం అన్నాడు.

"ఆయుధాలు అక్కర్లేదు. అవి ఆసవాలు చూపిస్తాయి. అవసరాన్నిబట్టి నువ్వు ముందు నడమూ నీ చేతుల్ని మరోసారి ఉపయోగించుకోవచ్చు!" పరమేశ్వర్ నవ్వుతూ అన్నాడు.

భద్రం గీసుకుపోయిన తన ముంజేతుల్ని ఒకసారి సగర్వంగా చూసుకున్నాడు. "ఓ.కే బాస్!"

పరమేశ్వర్ జేబులోంచి నోట్లకట్ట తీసి భద్రంవైపు విసిరాడు. భద్రం మొహం వెడల్పుగా అయింది.

"ఈ పైకంలో అయిదొందలు నువ్వు తీసుకో. మళ్ళీ నేను సిగ్నల్ యిచ్చేదాకా జేబులు కొట్టడం మానేయి. మన పిక్నిక్ స్పాట్ నువ్వు చూశావు. అక్కడ మూడు నాలుగు రోజులుండటానికి అవసరమయిన సరంజామా అంతా కొని రెడీగా వుంచు, రెండు పెట్రోమాక్స్

లైట్సూ, స్టవ్వూ, కిరోసిన్, హోల్డాలూ, దుప్పట్లూ, ఎయిర్ పిల్లోస్ వగైరా అన్నీ నీ గదిలో పెట్టు. పదో తారీఖు రాత్రి సరిగ్గా పది గంటలకి కలుస్తా" అన్నాడు పరమేశ్వర్.

నోట్లకట్టని పాంటు జేబులో దోపుకుంటూ భద్రం నిజబడ్డాడు. చిరునవ్వుతో పరమేశ్వర్ ని చూశాడు.

"ఏదీనా అడగాలా?" పరమేశ్వర్ ప్రశ్నించాడు.

"అడిగే అవసరం లేకుండానే, అవసరమైతే మీరే చెప్తారు!" భద్రం నవ్వుతూ అన్నాడు.

పరమేశ్వర్ తృప్తికరంగా నవ్వాడు. "యూ ఆర్ రైట్. భద్రం పదో తారీఖు వచ్చేలోగా చెవుల్ని కప్పేలా జుట్టు యేర్పాటు చేసుకో. బుగ్గమీసాలు తగిలించుకో. ఈసారి నువ్వు కనిపించేసరికి నేనే నిన్ను గుర్తుపట్టకూడదు!"

భద్రం ధారాళంగా నవ్వుతూ నమస్తే చెప్పి వెళ్ళిపోయాడు.

పరమేశ్వర్ మూసిన తలుపుల్నే చూస్తూ ఆలోచనల్లో మునిగిపోయాడు.

నిమిషాలు గడుస్తున్నాయి.

మూడోసారి తలుపుమీద చప్పుడైంది,

పరమేశ్వర్ టైం చూసుకున్నాడు. పదీముప్పై. అందరూ చెప్పిన టైమ్ కి ఠంచన్ గా వస్తున్నారు. తన ప్లానుకి ఆ పంక్చువాలిటీ అత్యవసరం....

"కమిన్!"

తలుపు తోసుకుని ముప్పైయేళ్ళ యువకుడు గదిలో ప్రవేశించాడు. అతను ధరించిన నీలంరంగు జీన్స్ బాగా నలిగిపోయి వున్నాయి. టర్టిల్ నెక్ బనియన్ టైట్ గా

అతనికి అతుక్కుపోయి అతని కండరాల్ని బయటికి చూపుతోంది. ఛాతీమీద 'ఎంబ్రేస్ మీ' అన్న ఇంగ్లీషు అక్షరాలు ఎర్రరంగులో ప్రింట్ చేయబడ్డాయి. అతను మెల్లగా లోపలికి అడుగులు వేశాడు.

"సిడౌన్ కమల్!" పరమేశ్వర్ ఆహ్వానించాడు.

సన్నగా పొడుగ్గా వున్న కమల్ కూచోలేదు. పెదవుల్ని కప్పేస్తూ కిందికి వాలిన గుబురు మీసాలు గొంగళి పురుగుల్లా కదిలాయి. పొగచూరిన పళ్ళు కొద్దిగా పరమేశ్వర్‌కి అవుపించాయి. కమల్ రెండు చేతుల్తో తన ఛాతీ మీదున్న 'ఎంబ్రేస్ మీ' అన్న అక్షరాల్ని కౌగలించుకున్నాడు. వినాయకుడి కళ్ళతో పరమేశ్వర్ ని చూశాడు.

"నుంచోవడం నా కిష్టం" కమల్ క్లుప్తంగా అన్నాడు చేతుల్ని కిందికి వదుల్తూ.

పరమేశ్వర్ నవ్వుతూ చూశాడు. కమల్ చేతులు పిడికిళ్ళుగా బిగుసుకుంటూ తెరుచుకుంటూ వ్యాయామం చేస్తున్నాయి. వేళ్ళ వ్యాయామం!

"కమల్ ...." పరమేశ్వర్ ప్రారంభించాడు.

"డాక్టర్ కమల్!" కమల్ చిరునవ్వుతో సరిదిద్దాడు. పరమేశ్వర్ సూటిగా చూశాడు.

"గాడ్రి గోత్రం గొల్లవారికి చెప్పక్కర్లేదు. లోకం, ప్రభుత్వం నిన్ను డాక్టర్‌గా గుర్తించకపోయినా నిన్ను నువ్వు డాక్టరుగా చిత్రించుకుంటున్నావు. నేను నీకు అప్పగించే పని దృష్ట్యా, తాత్కాలికంగా నిన్ను డాక్టరుగా ట్రీట్ చేస్తాను. పైగా నీ పేరు అందరికీ తెలియడం ప్రమాదం. అంచేత నిన్ను 'డాక్టర్' అని పిలుస్తాను...."

"థాంక్స్ .... ఐ లైకిట్!" కమల్ అడ్డొస్తూ

అన్నాడు.

పరమేశ్వర్ విసుగ్గా చెయ్యెత్తి అతన్ని వారించాడు. "పదో తేదీ నుండీ నాలుగైదు రోజులు నువ్వు నాతో నా కంట్రోల్లో వుండిపోవాలి. కేన్ యూ డూ ఇట్?"

కమల్ కళ్ళు చిట్లించాడు. వినాయకుడి కళ్ళు అతని రెప్పలకింద దాక్కున్నాయి. "ఈ మాట అడగటానికి ఈ వేళప్పుడు నన్ను డిస్టర్బ్ చేశారా? మొన్న నన్ను కల్సినప్పుడే అడిగి వుండొచ్చు...." అతని కంఠంలో ఆక్షేపణ ధ్వనించింది.

పరమేశ్వర్ సగం మూసిన కళ్ళతో, సిగరెట్ పొగ లోంచీ తీక్షణంగా చూశాడు. సిగరెట్ పైకీ కిందికీ ఆడింది. "ఏది ఎప్పుడు చెప్పాలో నేను డిసైడ్ చేస్తాన. సమాధానం చెప్పు!"

కమల్ భుజాలు ఎగరేశాడు. "ఆదాయం లేకుంటే నేను గాలి కూడా పీల్చుకోను!"

పరమేశ్వర్ నవ్వాడు. సిగరెట్ కదిలింది. "కాడి మోసిన ఎద్దుకి గడ్డి లభిస్తుంది!"

కమల్ చిన్నగా నవ్వాడు. పాలీదు కాళ్ళలా అతని చేతివేళ్ళు కదులుతున్నాయి. "నా ఫీజు నాకు వస్తూంటే నాలుగైదు రోజులేం ఖర్మ? ఇల్లరికం అల్లుడిలా పర్మనెంటుగా వుండిపోతాను!"

పరమేశ్వర్ సిగరెట్ని యాష్ట్రేలో పడేసి, కళ్ళు పూర్తిగా తెరిచి కమల్ని నవ్వుతూ చూశాడు. "కమల్! ఐ మీన్ డాక్టర్, ఇప్పట్లాగే నువ్వు చట్టవిరుద్ధంగా నీ ప్రాక్టీస్ కొనసాగిస్తే జైలు నిన్ను ఇల్లరికం అల్లుడిగా వుంచుకుంటుంది! నాతో వారం రోజు లుంటే మరో

పదేళ్ళు నీ డర్టీ ప్రాక్టీసు మానేసి కూచోవచ్చు...."

కమల్ వేళ్ళు కదలడం మానేశాయి. అతని మొహం బిగుసుకుపోయింది.

పరమేశ్వర్ అతన్ని ఎగతాళిగా చూశాడు. "మెడిసిన్ చదివేప్పుడు నీ తెలివితేటలు తప్పుదారి పట్టాయి. అన్ని దుర్వ్యసనాలకీ నువ్వు బానిసయ్యావు దుష్ప్రవర్తన కారణంగా నువ్వు కాలేజీలోంచి బైటికి గెంటబడ్డావు. తల్లిలేని నిన్ను పెంచిన మీ నాన్నని నీ ప్రవర్తన పరోక్షంగా చంపేసింది. అరవైయేళ్ళలో ఆయన సంపాదించిందంతా ఆర్నెల్లు కూడా నీ ధాటికి తట్టుకోలేకపోయింది. "డిగ్రీ సంపాయించలేకపోయినా డబ్బు సంపాయించాలి. నిన్నొక యం.బి.బి.యస్. డాక్టరుగా చిత్రించుకుంటూ బోర్డు కట్టి నాలుగైదు చిన్న చిన్న టౌన్‌లలో ప్రాక్టీసు పెట్టావు. ఎక్కడా రాణించలేక చివరికి ఇక్కడ స్లమ్ యేరియాలో, మానులేని దేశంలో, ప్రాక్టీసు ప్రారంభించావ్!

"ఆ ప్రాంతంలో పొట్టకూటి కోసం వొళ్ళమ్ముకునే వాళ్ళకి వైద్యం లాంటిది చేస్తున్నావు. వాళ్ళకి అబార్షన్లు చేస్తూ. పెన్సిలిన్‌తో సుఖరోగాల్ని లొంగదీసే ప్రయత్నం చేస్తున్నావు. డబ్బు సంగతేమిటో గానీ, అక్కడ సుఖరోగాల్ని సుళువుగా సంపాదిస్తున్నావని నాకు తెలుసు!" పరమేశ్వర్ ముగించి పకపకా నవ్వాడు.

తన గురించి పరమేశ్వర్ చెప్పిందంతా యథార్థమే! క్వినైన్‌లా చేదుగావున్న పరమేశ్వర్ మాటల్ని విన్నాక కమల్ బెట్టు కొద్దిగా తగ్గింది.

"ఆల్‌రైట్ నా గురించి మీకంతా తెలుసని ఒప్పుకుంటాను. మీతోవుండి నేనేం చేయాలి?" కమల్ తెప్ప

రిల్లి ప్రశ్నించాడు.

పరమేశ్వర్ ముఖంమీద నవ్వు మాయమయింది. "డాక్, నాతో వ్యవహారించేప్పుడు నువ్వు నేర్చుకోవాల్సిన మొదటి పాఠం ప్రశ్నలు అడక్కుండా వుండటం! నా ముందున్నప్పుడు నువ్వు ఉపయోగించాల్సింది నీ చెవుల్ని, నోటిని కాదు! నువ్వు అడిగే అవసరం లేకుండా నే నీకు తెలియాల్సిన విషయాలు తెలియజేయబడతాయి. నాలుగులోజులు నేను చెప్పినట్టు విని, పదేళ్ళ పాటు కాళ్ళమీద కాళ్ళేసుకుని బతకాలని వుంటే చెప్పు!"

"కాలుమీద కాలేసుకుని జీవితాంతం బతకాలనుంది నాకు!" కమల్ నవ్వాడు.

"గుడ్...." అంటూ పరమేశ్వర్ జేబులోంచీ ఒక చీటీని తీసి కమల్ ముందు టేబుల్ మీద పడేశాడు. దాన్ని అందుకుని కమల్ పరిశీలనగా చూశాడు. ఆశ్చర్యంతో అతని ఏనుగుకళ్ళు కొంచెం పెద్దగా అయ్యాయి. అతని కుడిచేతి వేళ్ళు ఎండ్రకాయ కాళ్ళల్లా మెలికలు తిరుగుతున్నాయి.

"....ఇవన్నీ సర్జికల్ ఇన్స్ట్రుమెంట్స్!" అన్నాడతను ఆశ్చర్యంతో.

"నాకు తెలుసు. వాటిని కొంటాని కెంతవుతుంది?" పరమేశ్వర్ ప్రశ్నించాడు.

కమల్ లిస్టుని మరోసారి చూశాడు. "వెయ్యి దాటొచ్చు."

పరమేశ్వర్ నవ్వాడు. "వాటిని కొండానికి ఏడు వందలు దాటదని నాకు తెలుసు!" అంటూ ఒక నోట్ల కట్టని బల్లమీద గిరాటేశాడు. "వెయ్యి రూపాయలు. అవన్నీ కొని, తతిమాది నువ్వుంచుకో. పదో తేదీ రాత్రి

సరిగ్గా పదిగంటలకి నన్నిక్కడ కల్సుకో. ఈలోగా ప్రమాదకరమయిన కేసులేవీ టేకవ్ చేయొద్దు!" అన్నాడు నవ్వుతూ.

కమల్ కుడిచేతి వేళ్ళు పురుగుని పట్టుకుంటున్న కీటకం కాళ్ళలా నోట్లకట్టని చుట్టేశాయి. చీటీనీ, నోట్లకట్టనీ భద్రంగా జేబులో దాచుకుని, కమల్ ముందుకి జరిగి కుర్చీలో కూచున్నాడు. పరమేశ్వర్ని నవ్వుతూ చూశాడు.

"ఆ ఇన్‌స్ట్రుమెంట్స్ దేనికి?"

పరమేశ్వర్ తీక్షణంగా చూశాడు. "మొదటి పాఠం మరిచిపోయావ్! ప్రశ్నలు వద్దు!" అన్నాడతను కఠినంగా.

"సారీ .... నా దగ్గర ఆ యిన్‌స్ట్రుమెంట్సన్నీ వున్నాయి. వెయ్యి నేనే వుంచుకొని వాటిని పట్టుకొస్తాను...."

పరమేశ్వర్ కమల్ కళ్ళల్లోకి సూటిగా చూశాడు. "చెప్పింది చెయ్యడం నేర్చుకో. ఇది రెండో పాఠం! తుప్పుపట్టిన నీ పరికరాలు నా పనికి పనికిరావు. కొత్తవి కొని, బిల్లు పట్రా. నౌ యూ కెన్ గో!"

కమల్ లేవలేదు. "ఐ డోంట్ లైక్ వేస్టింగ్ మనీ!" అన్నాడతను పొగ ఊదుతూ.

పరమేశ్వర్ పకపకా నవ్వాడు. "నేను సేకరించిన సమాచారం ప్రకారం డబ్బు వేస్టు చేయడమే నీ వృత్తి! చెప్పింది చెయ్. జేబులు నింపుకో!"

కమల్ నవ్వుతూ లేచాడు. "ఓ.కే.... వెళ్తా...."

"మరో సంగతి. నీ రూపం పూర్తిగా మారిపోవాలి. మీసాలు తీసేయ్. భుజాలదాకా జులు యేర్పాటు

చేసుకో. వెళ్ళి, రూపం మార్చుకుని పదో తారీఖు రా. వెయ్యి రూపాయల కోసం కక్కుర్తిపడి యెక్కడికీ ఉడాయించకు. నిన్ను వెతికి పట్టి రూపాయకో బొట్టు చొప్పున వెయ్యి రక్తంబొట్లు నీ ముక్కులోంచి పిండుతాను!" పరమేశ్వర్ నవ్వుతూ అన్నాడు. కానీ అతని కళ్ళు నవ్వటంలేదనీ కత్తికోనల్లా కఠినంగా మెరుస్తున్నాయనీ కమల్ గమనించాడు.

"విందుభోజనం తినబోతూ, సూప్ తాగేసి పరుగెట్టే మూర్ఖుణ్ని కాను. నేను!" అంటూ కమల్ గబగబా గదిలోంచి వెళ్ళిపోయాడు. పరమేశ్వర్ తనలో నవ్వుకుంటూ సిగరెట్ అందుకున్నాడు....

## 2

ఎదురుగా గోడకి వేళ్ళాడుతోన్న హిపోక్రేట్స్ సూక్తులి ఆఖోసారి చదివి, కౌండిన్య వాచీ చూసుకున్నాడు.

శిరీషని డాక్టరు లోపలికి తీసుకెళ్ళి పదిహేను నిమిషాలు దాటింది. మరో పది నిమిషాల్లో తను రికార్డింగ్ కి వెళ్ళాలి....

కర్టెన్ని తొలగించుకుని మెల్లిగా వస్తున్న శిరీషని చూస్తూ అతను తేలిగ్గా నిట్టూర్చాడు. కొద్దిగా చెదిరిన ముంగురుల్ని సరిచేసుకుంటూ ఆమె భర్తని చిరునవ్వుతో చూస్తూ అతనిపక్కనే కూచుంది. కౌండిన్య ఆప్యాయంగా ఆమె చేతిని నొక్కాడు.

లావుగా పొట్టిగా వున్న డాక్టర్ సుబ్బలక్ష్మి టవల్ తో చేతులు తుడుచుకుంటూ తన కుర్చీలో కూచుని నవ్వుతూ చూసింది.

"మిస్టర్ కౌండిన్యా, శిరీష కండిషన్ తృప్తికరంగా

వుంది. కొద్దిగా బి.పి. వుంది. క్రమంగా కంట్రోలవుతుంది....”

“ఈసారి మళ్ళీ మిస్ క్యారేజ్ అయ్యే ప్రమాదం లేదుగా డాక్టర్?” అతను ప్రశ్నించాడు.

“దాదాపు లేనట్టే. గర్భంలో బేబీ పెరుగుదల నార్మల్ గా వుంది. ప్రతివారం ఇంజెక్షన్ వేసుకోవాలి. చీటికీ మాటికీ మెట్లెక్కడం దిగడం చేయకూడదు. బరువైన వస్తువుల్ని యెత్తడంలాంటి పన్లు చేయకూడదు. ఇంకా తీసుకోవాల్సిన జాగ్రత్తలూ, చేయాల్సిన తేలిక పాటి ఎక్సర్ సైజూ ఆమెకి వివరంగా చెప్పాను. సాయంత్రం పూట రెగ్యులర్ గా వాకింగ్ కి తీసుకెళ్ళండి” అంది డా. సుబ్బలక్ష్మి.

“అలాగే. శిరీషని మీరు భద్రంగా చూసుకుంటున్నారు. మీ మేలు మరచిపోను!”

“మీరు కూడా జాగ్రత్తగా చూసుకోవాలి. యూనో సర్టెన్ పొజిషన్స్ ఆర్ రిస్ట్రిక్టెడ్....” డాక్టర్ చిరునవ్వుతో ఆగింది.

“ఆఫ్ కోర్స్....” కౌండిన్య నవ్వుతూ అన్నాడు.

శిరీష బుగ్గలు ఎరుపెక్కాయి.

“ఎందుకేనా మంచిదని మీరు అనుసరించాల్సిన పద్ధతుల్ని శిరీషకి ఎక్స్ప్లెయిన్ చేశాను” అంది డాక్టర్.

కౌండిన్య జేబులోంచి పర్సు తీశాడు. నాలుగు వంద రూపాయల నోట్లని డాక్టర్ ముందు వుంచాడు.

“రెండు చాలు....” అంది డాక్టర్.

“ప్లీస్ డాక్టర్, తీసుకోండి. వరసగా రెండుసార్లు అబార్షనయ్యింది. పిల్లల కోసం మేం యెంత తాపత్రయ పడుతున్నామో మీకు తెలుసు. మీరిస్తున్న ట్రీట్

మెంట్ కి యెంతిచ్చినా తక్కువే అవుతుంది!" కౌండిన్య నవ్వుతూ అన్నాడు.

"మీరు — ముఖ్యంగా శిరీష నిర్భయంగా వుండాలి. జరిగిందంతా పూర్తిగా మరిచిపోవాలి. ఏమాత్రం ఆవేశ పడకూడదు, భయపడకూడదు. ఏం జరుగుతుందో అన్న కంగారు పెట్టుకోరాదు. హారర్ మూవీస్ చూపించకండి! సకాలంలో ఆమె చక్కటి బేబీని ప్రసవిస్తుంది. ఎవ్విరీ థింగ్ విల్ బీ ఆల్ రైట్!" అంది డాక్టర్ నోట్లని గల్లా సొరుగులోకి తోస్తూ.

కౌండిన్య లేచాడు. శిరీష నిలబడి డాక్టర్ కి నమస్కరించింది. డాక్టర్ కౌండిన్యవైపు నవ్వుతూ చూసింది.

"రాత్రి మీ కొత్త పాట విన్నాను. స్త్రీ హృదయం గురించి స్త్రీ కన్నా కవికే బాగా తెలుసనిపించింది ఆ పాట వింటూంటే. ఆ పాటతో మీరు హిందీ సినీ కవులు సాహిర్ శైలేంద్రల స్థాయికి దాదాపుగా చేరుకున్నారు! కంగ్రాట్స్!"

"ఆయామ్ ఫ్లాటర్డ్. థాంక్స్ డాక్టర్!" అన్నాడు కౌండిన్య.

కౌండిన్యకు శిరీషను చూస్తూంటే గర్వంగా వుంది.

అదృష్టం కొద్దీ తను చిత్రసీమలో ప్రవేశించాడు. రచయితగా తన మొట్టమొదటి చిత్రమే నటిగా ఆమెకి మొదటి చిత్రం! తను చిత్రించి, ఆమె నటించిన హీరోయిన్ పాత్ర నిజంగానే శిరీషని కదిలించివేసింది. తను రాసిన ప్రతి అక్షరాన్నీ ఆమె అనుభవించి, పలికింది. తన సృష్టి ఆమెలోని నటికి ప్రాణం పోసిందనుకున్న శిరీష తనని — ఆరాధించసాగింది. తన అక్షరాలకి ఆమె కంఠం

ప్రాణం పోసిందని తను అనుకున్నాడు.

ఒక సినిమాతోనే శిరీష అలసిపోయింది. సినిమా లోకం ఆమె ఊహించుకున్న స్వప్న ప్రపంచం కాదు. సెట్స్‌మీద, కెమెరా ముందే కాకుండా ఇగ్గైనాలు గంటలూ నటిస్తూ వుంటేగానీ తను తారాపథం చేరుకో లేదని ఆమె అచిరకాలంలో గ్రహించింది. ఒక్క చిత్రం తోనే నటనకి స్వస్తి చెప్పింది. తనకి దగ్గరైంది. తను ఆమెకి దూరం కాలేకపోయాడు. పరిశ్రమలోని అందర్నీ ఆశ్చర్యపరుస్తూ ఇద్దరూ భార్యాభర్తలయ్యారు....

# 3

పదో తారీఖు రాత్రి పది గంటలు.

తన ముందు కూచున్న ముగ్గుర్నీ పరమేశ్వర్ చిరు నవ్వుతో చూశాడు. అతని నోట్లో యిప్పుడు సిగరెట్ లేదు. కళ్ళు పూర్తిగా తెరిచివున్నాయి.

"మీరు ఒకరికొకరు అపరిచితులు. ఈ క్షణం నుంచీ ఒక చేతివున్న వేళ్ళలా మనం కలిసి పని చేయాలి. రాజూ, భద్రం, కమల్ .... డాక్టర్ కమల్ ...." ముగ్గుర్నీ ముగ్గు రికీ పరిచయం చేశాడు పరమేశ్వర్.

ముగ్గురూ తలలు ఆడిస్తూ చిరునవ్వుతో చూసుకున్నారు. కమల్ ఆపకుండా చేతివేళ్ళతో వ్యాయామం చేస్తు న్నాడు.

"రాజూ?" పరమేశ్వర్ సాభిప్రాయంగా అన్నాడు.

"అంతా రెడీ బాస్. వాన్‌కి మీరు చెప్పిన యేర్పా ట్లన్నీ చేశాను. రథం ఏ క్షణంలో అయినా కదులుతుంది;" రాజా సగర్వంగా అన్నాడు.

"వెరీగుడ్ ...." అంటూ పరమేశ్వర్ ఒక నోట్లకట్టని

అతనివైపు విసిరాడు. "ఈ డబ్బుతో మనకి నాలుగైదు రోజులకి సరిపడే ఆహారపదార్థాలు కొని వాన్‌లో స్టోర్ చెయ్. కాఫీ, టీ, బిస్కెట్స్, బ్రెడ్డూ, స్టవ్, కిరోసిన్.... ఇంకా చెప్పాలా?" ప్రశ్నించాడతను.

"అవసరంలేదు. అవసరమయినవన్నీ వుంటాయి!" రాజు నవ్వుతూ అన్నాడు.

కమల్ చిన్నగా దగ్గి పరమేశ్వర్ వైపు చూశాడు. పరమేశ్వర్ కనుబొమలు ప్రశ్నార్థకంగా కలుసుకున్నాయి.

"అసలు సంగతి మరచిపోయారు. అది లేకుండా పిక్నిక్ జరగదు!" అన్నాడు నవ్వుతూ.

పరమేశ్వర్ చిన్నగా నవ్వాడు. "ప్రసాదంతో పాటు తీర్థం కూడా వుంటుంది! వాట్ రాజూ?"

రాజు చిరునవ్వు నవ్వాడు. "ఒక్కటి తప్ప డాక్టరుకి అన్నీ దొరుకుతాయి!" అన్నాడు కమల్ వైపు కన్నుగీటుతూ. కమల్ మీసాలు కొద్దిగా కదిలాయి అతని పళ్ళని చూపిస్తూ.

"భద్రం?" పరమేశ్వర్ భద్రం వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"అన్నీ సిద్ధంగా వున్నాయి బాస్!" భద్రం జవాబిచ్చాడు.

"రైట్. కాన్ఫరెన్స్ పూర్తయ్యాక నువ్వూ, రాజూ వాటినన్నింటినీ వాన్‌లో సర్దండి" పరమేశ్వర్ ఉత్తరువిచ్చాడు. మెల్లగా లేచి రెండుసార్లు అటూ ఇటూ తిరిగాడు. మళ్ళీ కుర్చీలో కూచున్నాడు. అనుచరుల్ని కలయజూశాడు.

"ఈ ప్రిపరేషనంతా దేనికోసమో మీకు తెలీదు. నే

నిస్తున్న డబ్బుకోసం ఇంతవరకూ నేను చెప్పినదంతా మీరు చేశారు. అసలు విషయం మీకు చెప్పేముందు, ఈ అడ్వెంచర్లో పాల్గొనడానికి మీరు సిద్ధంగా వున్నారేమో నేను తెలుసుకోవాలి....'' పరమేశ్వర్ ఆగి, లేచి నిలబడి రెండు అరచేతుల్నీ ముందున్న బల్లమీద ఆన్చాడు. ముగ్గురూ అర్థం కానట్టు అతన్నే చూస్తున్నారు.

“చట్టవిరుద్ధంగా జీవించటానికి మీరు అలవాటు పడ్డారు. అందుకే మిమ్మల్ని ఎన్నుకున్నాను. చేయబోయేది చట్టవిరుద్ధమయిన పని. ప్రమాదంతో కూడుకున్న పని పట్టుబడితే శిక్ష తప్పదు! చాకచక్యంగా పని సాధిస్తే కొన్నేళ్ళపాటు మీరు రాజుల్లా బతకొచ్చు. ఆ గ్యారెంటీ నేనిస్తాను!'' పరమేశ్వర్ ఆగి సమాధానం చెప్పమన్నట్టు వాళ్ళవైపు చూశాడు.

రాజు కాలర్ వెనకున్న జేబురుమాలు లాగి, మడత విప్పేసి, మళ్ళీ మడతపెట్టి కాలర్ వెనుక ఇరికించాడు. భద్రం బట్టతలని అరచేత్తో తుడుచుకుని, అరచేతిని పాంటుకి రుద్దసాగేడు. వాళ్ళిద్దర్నీ గమనిస్తున్న కమల్ మీసాలు చిరునవ్వుతో కొంచెం కదిలాయి. ఒకసారి పరమేశ్వర్ని చూసి, వ్యాయామం చేస్తున్న తన వేళ్ళమీద దృష్టిని నిలిపాడు.

“మీరు దిగమంటే లోతు చూడకుండా గోతిలో దిగేస్తాను బాస్!'' రాజు అన్నాడు.

“రోజూ వాయిదాల పద్ధతిలో భయపడి చావడం కన్నా, ఒకేసారి పెద్దమొత్తం భయపడి, పెద్దమొత్తం సంపాయించి హాయిగా రిటైరై పోవడం మంచిదనుకుంటున్నాను!'' భద్రం నిదానంగా అన్నాడు.

పరమేశ్వర్ చిరునవ్వు నవ్వాడు. తెలివైన నిర్ణయం!

డాక్టర్, వాటబౌట్ యూ?"

"ప్రమాదం డోసూ, పారితోషికం రేటూ తెలిస్తేగానీ నేనేమీ చెప్పలేను!" కమల్ జవాబిచ్చాడు.

పరమేశ్వర్ అతన్ని సూటిగా చూశాడు. "పట్టుబడితే పదేళ్ళు నువ్వు వేళ్ళు నలుపుకుంటూ జైల్లో కూచోవాల్సి వుంటుంది. విజయం సాధిస్తే దాదాపు యాభై వేలు నీ చేతిలో వాలుతుంది!"

కమల్ వేళ్ళ వ్యాయామం మరచిపోయి నిశ్చలంగా వుండిపోయాయి. అతని నాలుక పెదాల్ని తడిపింది. యాభై వేలు! యాభై జన్మలెత్తినా తను ఒక్కసారిగా యాభై వేల రూపాయల్ని ముట్టుకోలేడు! తవ్వితేగానీ బంగారం దొరకదు! కంచె దాటి చెట్టెక్కితేగానీ పళ్ళు అందవు! అతను నవ్వు మొహంతో పరమేశ్వర్ని చూశాడు.

"ఆల్ రైట్. మీతో బాటే నేనూ దూకుతా!" అన్నాడు కష్టంగా.

పరమేశ్వర్ కొంచెం ముందుకి వంగి కమల్ మొహంలోకి తీక్షణంగా చూశాడు. "డాక్టర్, నా ప్లాను గురించి వినే క్వాలిఫికేషన్ నీకు వచ్చింది. అంతా విన్నాక మాతో చేతులు కలుపుతానంటే యూ ఆర్ వెల్‌కం! లేదంటే నీ మానాన నువ్వు వెళ్ళొచ్చు. అయితే జరిగిందీ, విన్నదీ పూర్తిగా నువ్వు మరచిపోవాలి. ఈ విషయం గురించి ఎక్కడా నువ్వు మాట్లాడకూడదు. అందుచేత నువ్వు యే దారిన వెళ్ళాలో నేను నిర్ణయిస్తాను...."

కమల్ వొళ్ళు ఒకసారి జలదరించింది. అతని కనుబొమలు రెండూ గొంగళి పురుగుల్లా కలుస్తున్నాయి.

"అంటే....?"

పరమేశ్వర్ నవ్వాడు. ఆ నవ్వులో స్నేహభావం లేదు. "నా ప్లాను గురించి విన్నాక పాలలో నీళ్ళలా నువ్వు మాతో కల్సిపోవాలి. లేకపోతే నీ నోరు ఎలా మూయ్యాలో నేను నిర్ణయిస్తానని చెప్తున్నా!"

కమల్ తదేకంగా పరమేశ్వర్ని చూశాడు. "పన య్యాక నా దారిన నేను పోవచ్చా? ఐ వాంట్ టూ ఎంజాయ్ లైఫ్!"

"పనయ్యాక చేసిన పని గురించి నువ్వు దండోరా వేసుకోలేవు. దేశమంతా నువ్వు దొర్లుకుంటూ వెళ్ళొచ్చు" పరమేశ్వర్ నవ్వుతూ అన్నాడు.

"కాంట్ మీ యిన్!" కమల్ ముక్తసరిగా అన్నాడు.

"దట్స్ గుడ్!" అంటూ పరమేశ్వర్ ముగ్గుర్నీ కలయజూశాడు. ఆరు కళ్ళు అతన్ని ఆత్రంగా చూస్తు న్నాయి.

"సినీ రచయిత కౌండిన్య పేరు విన్నారా?" పరమే శ్వర్ ప్రశ్నించాడు.

"అతను రాసిన 'ఎత్తిమాసుకో' అన్న పాట నా కెంతో యిష్టం!" కమల్ నవ్వుతూ అన్నాడు.

"సినిమాకి వెళ్తాగానీ, పాటల్నీ మాటల్నీ పట్టించు కోను!" భద్రం నవ్వుతూ అన్నాడు. రాజు కిసుక్కున నవ్వాడు.

"అతను యెవరో సినీతారను పెళ్ళాడినట్టు విన్నాను" అన్నాడు రాజు.

"కరెక్ట్. ఆమె పేరు శిరీష. వాళ్ళకి పెళ్ళయి ఆరు నేళ్ళు దాటింది. శిరీషకి రెండుసార్లు అబార్షన్ అయ్యింది.

పిల్లలకోసం వాళ్ళిద్దరూ తహతహలాడుతున్నారు....."
పరమేశ్వర్ చెప్పపాగేడు.

"ఆమెకి పిల్లలు కలిగేలా చేయాలా?" కమల్ అడ్డొస్తూ కొంటెగా ప్రశ్నించాడు. రాజా, భద్రం గొల్లున నవ్వారు. పరమేశ్వర్ ముఖంమీద చిరునవ్వు మెరిసింది కమల్ వైపు చూశాడతను.

"స్త్రీకా శ్రమ అక్కర్లేదు. ఆమెకిప్పుడు యెనిమిదో నెల...."

కమల్ నిరుత్సాహంగా చూశాడు. "బాడ్ లక్!"

"దటీస్ అవర్ గుడ్ లక్ డాక్టర్! అడ్డు తగలకుండా విను. తన భార్యకి ఈసారి మళ్ళీ గర్భస్రావం అవకుండా కాండిన్య యెంతో జాగ్రత్త తీసుకుంటున్నాడు. ఫేమస్ గైనకాలజిస్టు. డాక్టర్ సుబ్బలక్ష్మి రక్షణలో ఆమె గర్భం పెంపొందుతోంది...."

"గట్టిగా తుమ్మితే తన భార్యకి గర్భస్రావం అయిపోతుందేమో అని అతను భయపడిచస్తున్నాడు. ఆమెని గాజుబొమ్మలా అతిభద్రంగా చూసుకుంటున్నాడు. ఆ గాజుబొమ్మని మనం తీసుకెళ్ళాం. నిర్ణయించిన సమయంలోగా, నిర్ణయించిన మొత్తం చెల్లించకపోతే ఆమెకి అబార్షన్ యేర్పాటు చేయబడుతుంది "

"గుడ్ గాడ్!" కమల్ ఆశ్చర్యంతో అరిచాడు.

"నా వార్నింగ్‌ని అతను నిర్లక్ష్యం చేయడు. నేను కక్కమన్నంతా కక్కుతాడు. అతను నా షరతుల్ని నిర్లక్ష్యంచేసి మొండిగా ప్రవర్తిస్తే మన డాక్టర్ కమల్ శిరీషకి గర్భస్రావం చేస్తాడు...." పరమేశ్వర్ ఆగి, కమల్‌ని చూశాడు.

ఎప్పుడో కదలడం మానేసిన తన వేళ్ళని కమల్

అర్థం కానట్టు చూస్తున్నాడు. "గర్భాలు చేయడం సులభమే కానీ .... నిజం చెప్పాలంటే ఒకటి రెండు నెలల గర్భాల్ని నేను తీసిపారేశాను. ఇంత ఎడ్వాన్స్‌డ్ ప్రెగ్నెన్సీని ఇంతవరకూ నేను టెర్మినేట్ చేయలేదు...." కమల్ నీళ్ళు నమిలాడు.

"చేయగలవా? చేయలేవా?" పరమేశ్వర్ తీక్షణంగా ప్రశ్నించాడు.

"ప్రతి పనికీ యెప్పుడో అప్పుడు ప్రారంభం జరగాలి. ఇది కొంచెం కష్టమైన పని. ఓ కే.... చేస్తాను. నాకో సందేహం. అడిగింది ఇవ్వకపోతే అబార్షన్ జరిపిస్తాం. కసితీరడం తప్ప మనకి యేమిటొస్తుంది?" కమల్ అడిగాడు.

"అబార్షన్ మొదటి విడత పనిష్మెంట్! అప్పటికీ అతను లొంగకపోతే తన గర్భం నశించినట్టు ఆమె కూడా నశిస్తుంది. అయినా కౌండిన్య అందాకా రానియ్యడు. అర్థంపర్థంలేని పాటలుగీకి అతను శుభ్రంగా ఆర్జిస్తున్నాడు. తన భార్య గర్భంలోని శిశువు మీద వున్న ప్రేమకి వెయ్యింతలు ప్రేమ అతనికి భార్యమీద వుంది. నాకు తెలుసు; మనం పాడే పాటకి అనుగుణంగా, మనం ఆడమన్నట్టు అతను ఆడతాడు. మనం ఉత్తుత్తి బెదిరింపులు చేయటంలేదని నిరూపించడానికి అవసరమైతే, గర్భస్రావం చేసి, ఆ పిండాన్ని ఆమె కట్టుకున్న చీరలో పార్సెల్ చేసి అతనికి కానుకగా అందిస్తాం!" పరమేశ్వర్ నవ్వుతూ అన్నాడు.

ముగ్గురూ అతన్ని ఒకవిధమైన భయంతో చూశారు. చదువూ, సంస్కారం వున్న మనిషిలా నవ్వుతూ కనిపించే పరమేశ్వర్ బుర్రలోంచి ఇవతలికి వచ్చిన భయం

కరమైన ఆలోచన వాళ్ళలో అతనిపట్ల ఒకరకమైన గౌరవాన్నీ, భయాన్నీ పుట్టించాయి. రాజు చిన్నగా దగ్గాడు.

"బాస్, ఎన్నో రకాలైన బ్లాక్ మెయిల్స్ గురించి నేను విన్నాను. మీ ప్లాను గురిత్తగా, భయం కలిగించేదిగా వుంది...."

పరమేశ్వర్ పకపక నవ్వాడు. "మన ప్లాను మనకి భయంకరంకాదు! అది కొండీస్యకి అమానుషంగా, భయానకంగా అవుపించాలి. అప్పుడే అతను అడిగినంతా అందిస్తాడు!"

"కరెక్టు!" భద్రం ఉద్రేకంతో అన్నాడు. పరమేశ్వర్ తృప్తిగా తలపంకించాడు.

"ఓకే ఇదంతా ప్లానులో రెండో ఘట్టం, మొదటి ఘట్టం గురించి జాగ్రత్తగా వినండి: ప్రతిరోజూ సాయంత్రం శిరీష గాంధీ రోడ్డు, నెహ్రూ రోడ్డు క్రాసింగ్ లో వున్న చిన్న పిల్లల పార్క్ కి షికారు వస్తుంది. రోజూ కొంత దూరం నడవాలని డాక్టర్ ఆమెని ఆదేశించింది. రేపు సాయంత్రం ఆమె వొంటరిగా పార్క్ కి వస్తుంది. అతను రికార్డింగ్ కి వెళ్తాడు. ఈ వివరాలన్నీ నేను జాగ్రత్తగా సేకరించాను. రేపు సాయంత్రం ఆరూ, ఏడు గంటలమధ్య మనం ఆమెని కిడ్నాప్ చేయాలి...." పరమేశ్వర్ ఆగి, జేబులోంచీ ఒక ఫోటో తీసి వాళ్ళవైపు విసిరాడు.

"అది మన 'పేషెంట్' శిరీష ఫోటో. ముగ్గురూ ఆమె రూపాన్ని బాగా గుర్తుంచుకోండి!" అంటూ అతను పెదాలమధ్య సిగరెట్ ఇరికించి లైటర్ తో ముట్టించి కళ్ళు చిట్లిస్తూ చూడసాగేడు.

ఫోటోను చూస్తున్న కమల్ కళ్ళు పైకి ఉబ్బి వచ్చాయి. ఎర్రటి నాలుక అతని పొగచూరిన పెదాల్ని తడపసాగింది. "షి యీజ్ రియల్ బ్యూటీ!" అన్నాడతను లొట్టలు వేస్తూ.

భద్రం ఫోటోని అతని చేతిలోంచి తీసుకున్నాడు. చూసి, రాజుకి అందించాడు.

"రేపు మీరు ముగ్గురు మీ వేషాలు మార్చుకోండి. ఎవరెవరు యేమేం చేయాలో చెప్తాను. జాగ్రత్తగా వినండి. పొరపాటు చేస్తే ప్లానంతా బెడిసికొడ్తుంది!" అంటూ పరమేశ్వర్ కిడ్నాప్ ప్లాన్ గురించి వాళ్ళకి వివరించడం ప్రారంభించాడు.

# 4

కార్ని కొంచెం స్లో చేసి, రాజు రియర్ వ్యూ మిరర్ని పరీక్షగా చూశాడు ఏ కారు తనని వెంబడించడం లేదు.

సరిగ్గా ఆరూనలభై యేడుకి అతను చిల్డ్రన్స్ పార్కు ముందు రోడ్డు వారగా కార్ని ఆపాడు ఇగ్నిషన్ కీని జేబులో పడేసుకున్నాడు. గ్లవ్స్ని తీసి సీటు మీద పడేశాడు.

జేబు రుమాలు పట్టుకున్న ఎడంచేతో డోర్ తెరిచి, కిందికి దిగాడు. బూటు కాలితో డోర్ని తోశాడు. రెండు క్షణాలు నిలబడి అటూ ఇటూ చూశాడు.

కార్లూ, ఆటోలూ, సిటీ బస్సులూ అటూ ఇటూ వెళ్తున్నాయి. లోకం తనని పట్టించుకోడం లేదు!

చకచకా నడుస్తూ అతను పార్కులో ప్రవేశించాడు.

పార్కులో లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. రంగురంగుల దుస్తుల్లో యెంతోమంది పిల్లలు ఉషారుగా ఆడుకుంటున్నారు. తనకి పిల్లల్తో పనిలేదు! రాజు

పార్కులో గడ్డిమీదా, బెంచీలమీదా కూచున్న ఆడవాళ్ళని ఓరగా చూస్తూ నడుస్తున్నాడు. నిమిషాలు గడుస్తున్నాయి, అతని కళ్ళు ఆమెకోసం నిర్విరామంగా ఆత్రంగా గాలిస్తున్నాయి.

అతను పార్కు మూలకి చేరుకున్నాడు. అతని కళ్ళు మెరిశాయి.

పూల మొక్కలకి అటువైపున గడ్డి నేలమీద ఆమె పచార్లు చేస్తోంది; ఒంటరిగా. కొద్దిగా ఉబ్బిన రబ్బరు బొమ్మలా వుందామె. ఊదా రంగు దుస్తుల్లో వున్న ఆమెని చూస్తోంటే రాజా కళ్ళు చెదురుతున్నాయి. రాజా ఆమెని సమీపించాడు. పచార్లు మాని, పదడుగుల దూరంలో తప్పటడుగులేస్తున్న కుర్రాణ్ణి చూస్తూ నిలబడిందామె.

"అమ్మగారూ...." రాజా నెమ్మదిగా పిలిచాడు.

ఏదో ఊహాలోకంలో వున్న శిరీష ఉలిక్కిపడి, గిరుక్కున తిరిగి అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది. అతను సన్నగా పొడుగ్గా వున్నాడు. ముక్కుకొనమీద కుంకుడు గింజలా నల్లటి మచ్చ వుంది. ఖాకీ యూనిఫామ్‌లో వున్నాడతను. షర్టు జేబుమీద "భారత్ మూవీస్" అన్న అక్షరాలు నీలం రంగులో మెరుస్తున్నాయి.

"అమ్మగారూ, కౌండిన్యగారు పంపించారు. తమర్ని స్టూడియోకి తీసుకురమ్మన్నారు....?"

"దేనికి?" శిరీష కళ్ళు చిట్లిస్తూ ప్రశ్నించింది.

రాజా గుటక మింగాడు. నాలుకతో పెదవుల్ని తడుపుకున్నాడు.

"కౌండిన్యగారికి కొద్దిగా సుస్తీ చేసింది.... ప్రొడ్యూసర్ భజగోవిందంగారు వెంటనే డాక్టర్ని

పిలిపించారు ...."

శిరీష అప్రయత్నంగా అతన్ని సమీపించింది. ఆమె మొహంలో, కళ్ళలో కంగారు ప్రత్యక్షమవుతోంది. "ఏం జరిగింది? ఆయన లా వున్నారు?" వణికే కంఠంతో అతన్ని ప్రశ్నించింది.

"మరేం కంగారుపడకండి. స్ట్రోక్ అయ్యిందొచ్చన్నారు డాక్టరుగారు. అయ్యగారు అక్కడే విశ్రాంతి తీసుకుంటున్నారు. మిమ్మల్ని తీసుకురమ్మన్నారు. తరవాత డాక్టరుగారు ఆయన్ని క్లినిక్‌కి తీసికెళ్తారు...."

"ఆయన ....ఆయన ...ఎలా వున్నారు?" శిరీష తడబడుతూ అడిగింది. భర్తపట్ల ప్రేమ ఆమె విశాల నేత్రాల్లో అదుర్దారూపంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

"కొద్దిగా నీరసంగా వున్నారు. మీరు ఇక్కడ వుంటారని ఆయనే చెప్పారు. ప్రొఫెస్సర్‌గారి కార్లో వచ్చాను. మీరు వస్తే...." రాజు ఆగి, నుదుటికిపట్టిన చెమటని అరచేత్తో తుడుచుకున్నాడు. నటించడం యెందుకో అతనికి గాబరా పుట్టిస్తోంది. కానీ ఆ గాబరా తన నటనకు సహజత్వాన్నిస్తోందని అతనికి తెలుసు....

"కారెక్కడుంది?" శిరీష కదుల్తూ అడిగింది.

"గేటు ముందు....తమరు నడవగలరా?" రాజు అమాయకత్వం నటిస్తూ సానుభూతితో అడిగాడు.

తల ఆడిస్తూ శిరీష నడవసాగింది. రాజు గబగబా ముందు అడుగులేశాడు. పార్కు గేటు దాటి కొంచెం దూరంలో వున్న పెద్ద నీలంరంగు కార్ని శిరీష చూసింది.

కారు అద్దంమీద 'దేశానికి దిక్కెవరు?' సినిమా స్టిక్కర్లు అతికించబడి వున్నాయి. భారత్ మూవీస్ నిర్మిస్తున్న తాజా చిత్రం. కౌండిన్యకి చాలా నచ్చిన ఇతి

వృత్తం వున్న కథ, శిరీష ఆలోచిస్తూ కారువేపు అడుగులు వేసింది.

జేబురుమాలు కప్పి, హాండిల్ పట్టుకుని రాజు వెనక డోర్ తెరిచి, వినయంగా నిలబడ్డాడు. కార్లో యెక్కి కూచుని, శిరీష నీరసంగా వెనక్కి వాలింది. ఆమె మొహంమీద చెమట ముత్యాల్లా మెరుస్తోంది. రాజు డోర్ మూశాడు.

"డ్రైవర్, త్వరగా పద...." అందామె. రాజు వినయంగా తలవాల్చి గబగబా కారు ముందుకి నడిచాడు. డోర్ తెరిచి, స్టీరింగ్ వెనక సర్దుక్కూచుంటూ గ్లవ్సని కుడిచేతికి తగిలించుకున్నాడు. కారు స్టార్టయ్యింది. ముందుకు వెళ్ళి, కుడివేపుకి తిరిగింది.

"ఇలా వెళ్తున్నావ్....చుట్టు దారి కదూ?" వెనక నుంచీ శిరీష కంఠం ప్రశ్నించింది.

"అలా వెళ్ళలేం అమ్మగారూ: ఈ మధ్య ఆ రోడ్డుని వన్ వే చేశారు" రాజు తడుముకోకుండా అబద్ధమాడాడు.

శిరీష నిట్టూర్చింది. "త్వరగా పోనీ" అందామె ఆత్రుతగా.

"అయ్యగారు మిమ్మల్ని జాగర్తగా తీసుకురమ్మన్నారు. స్లోగా డ్రైవ్ చేయమన్నారు. ఈ రోడ్లో కొంచెం దూరం వెళ్ళాక ట్రాఫిక్ బాగా పల్చబడుతుంది. అయిదు నిమిషాల్లో అక్కడుంటాం...." అన్నాడు రాజు.

శిరీషకి భర్తపట్ల జాలీ, ప్రేమా పొంగుకొచ్చాయి. ఎప్పుడూ తన ఆరోగ్యం గురించే కొండిన్య తాపత్రయం!

కారు మామూలు వేగంతో పోతోంది. శిరీష కళ్ళు ఆత్రంగా అటూ యిటూ చూస్తున్నాయి.

"డ్రైవర్, నాకేం ఫర్వాలేదు. స్పీడుగా పోనీ! ఇంకా

యెంతదూరం?" కారు యెటు వెళ్తుందో అర్థంకాక శిరీష అడిగింది.

"వచ్చేశాం, అమ్మగారూ. ఈ రోడ్డు తిన్నగా స్టూడియో వెనకభాగంలోకి వెళ్తుంది" అంటూ రాజు మలుపు తిప్పాడు.

రెండువేపులా గుడిసెలున్న రోడ్లో కారు వెళ్ళ సాగింది. కొంచెం దూరంలో మరో రోడ్డు అడ్డంగా పోతోంది. రోడ్డు వారగా తెల్లటి పాంటూ, షర్టూ వేసుకుని నిలబడ్డ వ్యక్తిని కళ్ళు చిట్లిస్తూ చూసి రాజు తేలిగ్గా నిట్టూర్చాడు. రోడ్డువార నుంచున్న వ్యక్తి కుడి చెయ్యి కొద్దిగా పైకి లేచింది. స్లో చేసి, అతని సమీపంలో కారాపాడు రాజు.

"స్టుడియోలో పనిచేసే వ్యక్తి...." అంటూ శిరీష వైపు చిరునవ్వు నవ్వాడు.

వైట్ డ్రెస్‌లో నిలబడ్డ కమల్ రెప్పపాటులో వెనకడోర్ తెరిచి, శిరీష పక్కన కూచుంటూ, తలుపు మూసేశాడు. కారు కదిలింది.

డ్రైవర్ పక్కన ముందుసీట్లో కూచోకుండా తనవైపు ఎక్కిన వ్యక్తిని ఆశ్చర్యంతో చూసింది శిరీష. అతను తనవైపు చూడ్డం లేదు. అతన్నుంచీ విస్కీ వాసన తీలగా వస్తోంది. శిరీష అప్రయత్నంగా మూలకి జరిగింది.

కమల్ చెయ్యి పాంటు జేబులోంచీ యివతలికి వచ్చింది. పాము పడగలా దూసుకెళ్ళి జేబురుమాల్ని శిరీష మొహంమీద అదిమి పట్టుకుంది అతని చెయ్యి.

ఏం జరుగుతోందో ఊహించే అవకాశం లేకుండానే శిరీష తలని బలహీనంగా పక్కకి వాల్చేసింది.

కమల్ ఆమెమీదకి వాలి, ఆమెవైపున్న కిటికీ

అద్దాన్ని పైకెత్తేశాడు. కాసేపట్లో అతనివైపున్న అద్దం కూడా పైకి లేచింది. కారు మరో మలుపుతిరిగి జోరుగా వెళ్తోంది. జేబురుమాలు కమల్ జేబులోకి మాయమయింది.

## 5

కారును పోర్టికోలో ఆపి కౌండిన్య కిందికి దిగాడు.

తను రావడం ఆలస్యమయింది. తనవాళ్ళను యెవర్నీ తోడుగా వుంచుకోడానికి శిరీష ఇష్టపడనందుకు విచారిస్తూ అతను గుమ్మం ముందు ఆగి, బజర్ నొక్కాడు.

తలుపు తెరిచిన వంటామెని ఆశ్చర్యంతో చూశాడు.

“మంగమ్మా, నువ్వింకా వెళ్ళిపోలేదేం?”

“అమ్మగారింకా రాలేదు....” అందామె ఆవులింతను ఆపుకుంటూ. కౌండిన్య అర్థం కానట్టు ఆమెవంక చూశాడు.

“ఎక్కడి కెళ్ళింది?”

“ఆరింటికి పార్కు కెళ్ళారు. ఇంకా తిరిగిరాలేదు” మంగమ్మ మెల్లిగా అంది. అంత ఆలస్యమైనా తను యింటికి వెళ్ళలేక పోయిందన్న విచారం ఆమె కంఠంలో ధ్వనించింది.

“రోజూ ఏడింటికే తిరిగొచ్చేది. ఇవాళ యెందుకింత ఆలస్యం చేసింది?” కౌండిన్య ప్రశ్నించాడు. వంటామె ఆ ప్రశ్నకి జవాబివ్వలేదని అతనికి తెలుసు. మంగమ్మ మాట్లాడకుండా పెదవి విరిచింది.

కౌండిన్య వెనక్కి తిరిగాడు. “మంగమ్మా, పార్కు కెళ్ళి కార్లో శిరీషను తీసుకొచ్చేస్తా. మరో అయిదు నిమిషాలాగి వెళ్దువు గానీ....” అంటూ చకచకా కారు వైపు నడిచాడు.

కారు మెల్లగా వెళ్తోంది. కౌండిన్య రోడ్డుకి రెండు వేపులా పేవ్ మెంట్స్‌ని పరీక్షగా చూస్తూ ఆలోచిస్తున్నాడు. తొమ్మిది దాటుతున్నా యింటికి రాకుండా శిరీష పార్కులో యేం చేస్తోంది? ఆడుతునే పిల్లల్ని చూస్తూ కలలు కంటోందా? ఆలోచిస్తూ పార్కు ముందు కారాపి అతను దిగాడు.

పార్కు దాదాపు నిర్మానుష్యంగా వుంది. సిమెంటు బెంచీలమీద నలుగురైదుగురు పడుకుని వున్నారు. మగాళ్ళు. శిరీష ఎక్కడుంది? కళ్ళుతిరిగి, సుస్తీ చేసి యే చెట్టుకిందో, బెంచిమీదో పడుకుందా? కౌండిన్య కంగారుగా అడుగులు వేయసాగాడు.

పొదలచాటునా, చెట్లకిందా, చీకటి నక్కి దాక్కున్న ప్రదేశాల్లో అతను వెతకడం ప్రారంభించాడు. తనకి తెలీకుండానే కౌండిన్య పార్కుని మూడుసార్లు ప్రదక్షిణం చేశాడు. అతనికి శిరీషమీద విసుగు పుట్టుకొస్తోంది. తను ఇప్పుడు మామూలు మనిషి కాదు. వేళకి భద్రంగా ఇల్లు చేరుకోవాల్సింది. ఆడవాళ్ళు, అందునా కడుపుతో వున్నవాళ్ళు పసిపిల్లల్లా, తిక్కగా ప్రవర్తిస్తారు. మట్టిబెడ్డలూ, చింతకాయలూ, చెత్తా చెదారం అంతా పసిపిల్లల్లా తినాలంటారు!

కౌండిన్య పార్కు మధ్యలో విగ్రహంలా నిలబడ్డాడు. ఆలోచిస్తూ, గుండ్రంగా తిరుగుతూ పార్కంతటినీ మళ్ళీ వోసారి పరిశీలించాడు. శిరీష లేని పార్కు దేవత లేని గుడిలా అవుపిస్తోందతనికి.

గేటువేపు నీరసంగా అడుగులేస్తూ అతను టైం చూసుకున్నాడు. తొమ్మిదీఇరవై. శిరీష ఈపాటికి ఇల్లు చేరుకుని వుంటుందేమో! అతను కారు స్టార్టు చేశాడు.

వెనక్కి తిప్పి ఇంటివేపు వేగంగా పోనిచ్చాడు.

"లేరా బాబుగారూ?" ఒంటరిగా కారు దిగిన కౌండిన్యను ప్రశ్నించింది వరండాలో చతికిలబడివున్న మంగమ్మ.

కౌండిన్య మెట్లకింద నిలబడి ఆమె మొహంలోకి ఆదేశంగా చూశాడు. శిరీష ఇంటికి రాలేదని ఆమె ప్రశ్న తనకి చెప్తోంది. అతను బరువుగా మెట్లెక్కాడు. మంగమ్మ లేచి నిలబడింది.

"ఏ ఫ్రెండింటికో వెళ్ళుంటుంది. వస్తుంది. నువ్వెళ్ళు" అన్నాడతను మంగమ్మతో.

"వెళ్ళి తీసుకొస్తారా? మీరొచ్చేదాకా వుంటాను" అందామె.

కౌండిన్య ఆమెని చిరునవ్వుతో చూశాడు. "జాగరగా ఇంటిపట్టున వుండి చక్కగా రెస్టు తీసుకొమ్మని శిరీషకి లక్షసార్లు చెప్పాను తనున్న స్థితిలో ఇలా వెళ్ళడం...." అతను ఆగి నిస్సహాయంగా మంగమ్మను చూశాడు. మంగమ్మ జాలిగా చూసింది.

"....మంగమ్మా, నువ్వెళ్ళిరా.... నేను ఫోన్ చేసి కనుక్కుంటాను" అన్నాడు కౌండిన్య.

"డైనింగ్ టేబుల్ మీద అంతా సర్దాను. అమ్మగారికి ఫ్లాస్క్‌లో వేడి పాలున్నాయి...." అంటూ మంగమ్మ మెట్లు దిగింది.

కౌండిన్య ఇంట్లో ప్రవేశించి తలుపుని సగం మూశాడు. గబగబా వెళ్ళి టెలిఫోన్ ముందు సోఫాలో కూచున్నాడు.

శిరీష ఎవరింటికి వెళ్ళివుంటుంది? తను ఈమధ్య యువ

రింటికీ అంతగా వెళ్ళటంలేదు. పార్కులో, ఇంట్లో లేదంటే మరెక్కడికో వెళ్ళివుండాలి. కౌండిన్య కళ్ళు మూసుకున్నాడు. శిరీషకి బాగా సన్నిహితులైన ఫ్రెండ్సునీ వాళ్ళ ఫోన్ నంబర్లనీ గుర్తు చేసుకోసాగేడు.

మెల్లగా కళ్ళు తెరిచి, రిసీవర్ని అందుకున్నాడు. అతని చూపుడు వేలు ఒక నంబర్ని డయల్ చేయసాగింది....

# 6

ఇరుకుగా వున్న గుహ అరలో డిమ్‌గా వెలుగుతోన్న పెట్రోమాక్స్ లైట్ కాంతి, స్వాభావికంగా యేర్పడ్డ రాతి గోడలమీద నీడల్ని సృష్టిస్తోంది.

కొంచెం పెరిగిన గెడ్డాన్ని తడువుకుంటూ పరమేశ్వర్ శిరీషవైపు చూశాడు. ఆమె నిశ్చలంగా వెల్లకిలా పడుకుని వుంది.

కార్లో ఆమెకి వాసన చూపిన క్లోరోఫామ్ ప్రభావం తగ్గేలోగా, దార్లో వాన్‌లోకి యెక్కించి ఆమెకి ఫోర్ట్విన్ ఇంజెక్షన్ ఇచ్చాడు, కమల్. సుమారుగా మరో రెండు గంటలు ఆమె నిద్రలోనే వుంటుందన్నాడతడు. ఆలోచిస్తూ పరమేశ్వర్ టైమ్ చూసుకున్నాడు.

తొమ్మిది దాటింది. కమల్ లెక్కప్రకారం మరో గంటలో ఆమె మేల్కోవచ్చు....

అరంగుళం పొడవు పెరిగిన గెడ్డం, పక్కపాపిడిని చెరిపేసి నున్నగా వెనక్కి దువ్విన క్రాపూ పరమేశ్వర్ పోలికల్ని చాలావరకు మార్చేశాయి. రహస్యంగా అతను అమర్చుకున్న కాంటాక్టు లెన్సెస్ అతని మారువేషానికి పరిపూర్ణతని తెచ్చిపెట్టాయి.

బైట చప్పుడైంది. కాన్వాస్ తెరను తోసుకొని,

హోల్డాల్స్‌నీ, ఇతర పార్సెల్స్‌నీ మోసుకుంటూ పైనికల్లా లోపలికొస్తున్న అనుచరుల్ని పరమేశ్వర్ చిరునవ్వుతో చూశాడు.

రాజా, భద్రం తమ బరువుల్ని కిందికి దించారు. భుజమ్మీదున్న హోల్డాల్ని కింద కుక్కి, కమల్ అలసటగా చూశాడు. మొహానికి పట్టిన చెమటని రెండు చేతుల్తో తుడుచుకుని, అరచేతుల్ని పాంటుకి రుద్దాడు.

"నాలాంటి వ్యక్తికి బరువులు మోసే పని వుండకూడదు. మేధావుల్ని శారీరక కష్టం చేయనువడం దేశానికి నష్టం!" అన్నాడతను విసుగ్గా పరమేశ్వర్ వైపు చూస్తూ.

పరమేశ్వర్ ఎగతాళిగా నవ్వాడు, "కొంగ ఎప్పటికీ హంసకాదు డాక్!"

రాజా, భద్రం చిన్నగా నవ్వారు. కమల్ వాళ్ళని కోపంగా చూశాడు, ఇద్దరూ వస్తువుల్ని సర్దడానికి ఉపక్రమించారు.

కమల్ దృష్టి శిరీషమీద వాలింది. బరువుగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు జరుపుతున్న ఆమె ఛాతీ పైకీ కిందికీ అలలా కదులుతోంది. కోరుకుంటూ నేలమీద పారేరే కోడిపిల్లను ఆకలిగా చూసే డేగ చూపుల్లా వున్నాయి కమల్ చూపులు.

పరమేశ్వర్ చిన్నగా దగ్గాడు. కమల్ ఉలిక్కిపడి, అతి ప్రయత్నంమీద తన చూపుల్ని పరమేశ్వర్ వైపు తిప్పాడు.

"పేషెంటు యెప్పుడు మేల్కొంటుంది, డాక్?" పరమేశ్వర్ ప్రశ్నించాడు.

"ముప్పావు గంట పట్టొచ్చు" కమల్ నిర్లక్ష్యంగా

జవాబిచ్చాడు.

"వెళ్ళి, బైటకూచుని రెస్టుతీసుకో. ఇసుకలో బండి లాగిన ఎద్దులా వొగురుస్తున్నావ్!" పరమేశ్వర్ నవ్వుతూ అన్నాడు.

"యస్. నీరసమొచ్చేసింది. ఐ వాంట్ సమ్ విస్కీ" అన్నాడు కమల్.

"భద్రం, డాక్టర్‌కి అతిథిమర్యాదలు చెయ్. స్టవ్ వెలిగించి అందరికీ మేత తయారుచెయ్. కాఫీకూడా!" పరమేశ్వర్ ఉత్తరువిచ్చాడు.

భద్రం అట్టపెట్టెలోంచీ తీసి క్వార్టర్ బాటిల్ విస్కీని కమల్‌కి అందించాడు. కమల్ ఉషారుగా గుహ ముందు భాగానికి వెళ్ళాడు. తెచ్చుకున్న రగ్గుల్నీ, హోల్డాల్స్‌నీ అక్కడా ఇక్కడా సర్దేశాడు రాజా. వెనకున్న అరలో స్టౌ వెలిగించి, వంటపనిలో భద్రం నిమగ్నమయ్యాడు.

పరమేశ్వర్ రాతికి వీపు ఆనించి బెడ్డింగ్ మీద కూచున్నాడు. జేబులోంచీ సిగరెట్ తీసి వెలిగించాడు. సగం మూసుకున్న అతని కళ్ళు నిస్సహాయంగా పడుకున్న శిరీష మీదే వున్నాయి.

రాజా అతని ముందు నిలబడ్డాడు. నున్నగా గీసుకున్న గెడ్డం. హిట్లర్ మీసాలు. ముక్కుకొనమీద కుంకుడుగింజ సైజులో నల్లటి మచ్చ, వులిపిరికాయలా కనిపిస్తోంది. మామూలుగా శుభ్రంగా దువ్వబడి వుండే రాజా క్రాపు చిందరవందరగా వుంది. చిన్న చిన్న మార్పులు అతని రూపాన్ని మార్చేశాయి...

"బాస్...." రాజా పిలిచాడు. తపస్సులోంచి మేలుకున్న వ్యక్తిలా పరమేశ్వర్ అర్ధనిమీలిత నేత్రాల్తో

ఆతన్ని ప్రశ్నార్థకంగా చూశాడు.

"బాస్....యిప్పుడేం చేయాలి మనం? యింతవరకూ అంతా అనుకున్నట్టు జరిగింది...."

పరమేశ్వర్ సగర్వంగా నవ్వాడు. "పని పూర్తయ్యేదాకా అంతా మనం అనుకున్నట్టే జరుగుతుంది, రాజూ! పేషెంట్ మేలుకోగానే ఆమె భర్తకి అందజేసే చిన్న సందేశాన్ని టేప్ చేస్తాను. ఆ సందేశాన్ని నేనే ఆమెకి డిక్టేట్ చేస్తాను. ఆమె కంఠస్వరం, ఆమె సందేశం మనం చేసిందీ, చెప్పేదీ, చేయబోయేదీ నిజమే అని ఆతనికి నమ్మకం కలిగిస్తాయి!"

"ఆమె చెప్తుందంటారా?" అడిగాడు రాజు.

"ఆమె యిప్పుడు అడకత్తెరలో వక్క రాజూ!" పరమేశ్వర్ క్లుప్తంగా అన్నాడు.

రాజు తృప్తిగా తల పంకిస్తూ సిగరెట్ వెలిగించాడు.

"రాజూ! ఆ బాగ్‌లోంచి టేప్‌రికార్డర్ తియ్యి. ఆమె లేచేసరికి అంతా సిద్ధంగా వుండాలి. అవతల కౌండిన్య భార్య యెక్కడికెళ్ళిందో తెలీక కాలు కాలిన పిల్లిలా తిరుగుతూ వుంటాడు పాపం!" అన్నాడు పరమేశ్వర్. భద్రం కాఫీకప్పుల్తో వాళ్ళ దగ్గరగా వచ్చాడు.

పరమేశ్వర్ కాఫీకప్పు అందుకున్నాడు. "భద్రం, తెల్లారగానే మన పేషెంటుకి గుహ వెనుకభాగంలో వున్న సందులో బాత్‌రూమ్ యేర్పాటు చెయ్. కాన్వాస్ సన్నగా కట్ చేసి, తెరకట్టెయ్...."

"రెండు కాన్స్‌లో నే నీళ్ళు తెచ్చాం. స్నానాలకి నీళ్ళు చాలవు...." భద్రం అమాయకంగా అన్నాడు.

పరమేశ్వర్ ఫకఫక నవ్వాడు. "తనున్న స్థితిలో ఆమె

స్నానం గీనం చేయదు. బాత్ రూమ్ పర్సన్ వేరు...."

భద్రం అర్థమైనట్టు తలాడిస్తూ వెళ్ళిపోయాడు.

## 7

కౌండిన్య చేతిలోంచి రిసీవర్ క్రేడిల్ మీదికి జారింది. తలెత్తి యెదురుగా వున్న గోడకేసి చూశాడు.

స్టెయిన్ లెస్ స్టీల్ ఫ్రేములో అందంగా బిగించబడిన శిరీష కలర్ ఫొటో అతన్ని చిరునవ్వుతో చూస్తోంది. తన స్నేహితురాళ్ళ నెవర్నీ శిరీష యివాళ కల్సుకోలేదు. ఎవరింటికీ వెళ్ళలేదు వాళ్ళతో ఆమె మాట్లాడి కూడా రెండువారాలు దాటింది. అతను టైమ్ చూశాడు పదిన్నర! శిరీష ఎక్కడికెళ్ళింది?

కౌండిన్య తన మతిమరుపును తిట్టుకుంటూ మళ్ళీ రిసీవ రెత్తాడు. ఏదేనా సు సీచేసి శిరీష ఒక్కతే పార్కు నుంచి యే టాక్సీలోనో డాక్టర్ సుబ్బలక్ష్మి నర్సింగ్ హోమ్ కి వెళ్ళివుండొచ్చు! అతని చూపుడు వేలు చకచకా నెంబర్ని తిప్పింది.

అటువేపు ఎవరో పలికారు. కౌండిన్య శిరీషను గురించి అడిగాడు. నిమిషంపాటు విని, రిసీవర్ని పడేశాడు బల హీనంగా. శిరీష తనకి బాగా తెలుసనీ, ఆమె హాస్పి టల్ కి రాలేదనీ అంది డ్యూటీ నర్స్.

కౌండిన్య అలసటగా సోఫాలో వెనక్కి వాలాడు. మండుతున్న కళ్ళని రెప్పలతో కప్పేశాడు. అతని మెద డులో, అతని హృదయంలో, అతని ప్రతి అణువులో ఒకటే ప్రశ్న: శిరీష ఎక్కడికెళ్ళింది?

ఆమెకి యేదేనా యాక్సిడెంట్ సంభవించిందా? ఎవ రేనా ఆమెని యేదో హాస్పిటల్లో చేర్పించారా? తనకి ఫోన్ చేయలేని స్థితిలో వుందా ఆమె? కమ్మీలతో కది

పిన నిప్పులోంచి లేచే రవ్వల్లా ఎన్నో ఆలోచనలు అతని లోంచి లేస్తున్నాయి.

తనిప్పుడు చేయగలిగిందల్లా సిటీలోని పోలీస్ స్టేషన్కీ, ప్రైవేట్ హాస్పిటల్స్కీ ఫోన్ చేయడమే. ఫోన్ కిందున్న డైరెక్టరీని తీసి అతను నెంబర్లు వెతకడం ప్రారంభించాడు.

ఉన్నట్టుండి టెలిఫోన్ మోగింది. కౌండిన్య అదిరిపడి, రిసీవర్ని ఎడం చెవి దగ్గరకు లాక్కున్నాడు.

“యస్....” అన్నాడు.

“సినీరచయిత కౌండిన్యేనా?” బొంగురు కంఠం మళ్ళీ ప్రశ్నించింది.

“యస్!....మీ రెవరు....?” కౌండిన్య అడిగాడు.

“మిస్టర్ కౌండిన్యా. నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి. పక్కన ఎవరూ లేరుగా?”

ఏకవచన ప్రయోగం! తనని ఏకవచనంలో సంబోధించే నలుగురైదుగురు సన్నిహితుల్లో యే వొక్కరి కంఠమూ కాదది!

“హు యీజ్ దట్?” కౌండిన్య కొంచెం కోపంగా అడిగాడు.

అటువేపు నుండి బొంగురుకంఠం నవ్వింది. “చెప్పినా నీకు తెలీదు! వొంటరిగా వున్నావా?”

“వేళాపాళా లేకుండా యేమిటి న్యూసెన్స్! యూ ఆర్ వేస్టింగ్ మై....” కౌండిన్య అరిచాడు.

“ఐ నో యూ ఆర్ డిస్టర్బ్‌డ్! నీ భార్య, నెల రోజుల్లో నీ కో కొడుకుని బహూకరించబోయే నిండు చూలాలైన నీ అర్థ ప్రాణం నా చేతుల్లోవుంది!”

“వాట్? ఏమిటిది? ఎవరు?....” కౌండిన్య ఆత్రంగా

బొబ్బలెట్టసాగేడు.

"నోరు మూసుకుని, చెవులు తెరుచుకుని విను. నీ భార్య నా చేతిలో ఇరుక్కుని వుంది. ఆమె క్షేమంగా వుండాలంటే, ఆమె గర్భిణిగా నీకు దక్కాలంటే నువ్వు నేను చెప్పినట్టు వినాలి! ఇరవై నాలుగు గంటల్లోగా నువ్వు నాకు...."

"వాటీస్ దిస్? ప్రాక్టికల్ జోకా?" కౌండిన్య అడ్డొస్తూ అడిగాడు.

"షటప్! నీతో సరసాలాడ్డానికి నాకు టైమ్ లేదు. ఇది ప్రాక్టికల్ జోక్ కాదని నీ భార్య కంఠం నీకు రూఢి చేస్తుంది. ఆమె సందేశాన్ని నీకు వినిపిస్తాను. చెవులు రిక్కించి విను...."

ఆశ్చర్యంతో, ఆందోళనతో కౌండిన్య చెవులు రిక్కించాడు. ఏవో అర్థంలేని చిన్న చిన్న శబ్దాలు వినిపిస్తున్నాయి. ఉటాలున ఒక స్త్రీ కంఠం ఆ శబ్దాల్ని మింగేసింది.

"ఏమండీ, నేను .... నేను .... శిరీషని. వీళ్ళు.... వీళ్ళెవరో నన్ను .. బంధించారు. వాళ్ళడిగింది మీరు యిస్తే. నన్నొదిలేస్తారుట...." ఆమె కంఠంలో ఏడుపు ధ్వనిస్తోంది. "నాకు.... నా కెంతో గాబరాగా వుంది. భయంగా వుంది. వాళ్ళడిగింది యిచ్చేసి నన్ను యింటికి తీసుకెళ్ళండి. నేను...." ఏదో బటన్ నొక్కబడిన శబ్దం వినిపించింది కౌండిన్యకి.

మొదట్లో అది శిరీష కంఠంకాదేమో అనిపించిందతనికి. కానీ మాట్లాడే వేగం. అక్షరాన్ని నొక్కుతూ పలికే విధానం అది శిరీష కంఠమే అని చెప్తున్నాయి. అతని మొహం, వొళ్ళూ చెమటతో తడుస్తున్నాయి. జరుగు

తోంది కలా? నిజమా? బొంగురుకంఠం అతని అనుమానాన్ని, ఆలోచనల్ని తుడిచేసింది.

“నీ భార్య చెప్పింది విన్నావు. ఏ అపాయమూ జరక్కుండా ఆమె నిన్ను చేరుకోవాలంటే నువ్వు పది లక్షలు చెల్లించుకోవాలి; ఇరవై నాలుగ్గంటల్లోగా!”

“ఇది అన్యాయం. కిడ్నాపింగ్ కి శిక్ష యేమిటో నీకు తెలీదనుకుంటాను. ఆమెని వొదిలెయ్. పోలీసు రిపోర్టు ఇవ్వకుండా జరిగింది మరిచిపోతాను....”

“షటప్! నీ నుండి ఇండియన్ పీనల్ కోడ్ గురించి వినడానికి నిన్ను పలకరించలేదు. ఇచ్చిన గడువులోగా నువ్వు మదుపు చెల్లించకపోతే, నీ భార్య నీ దగ్గర కొస్తుంది. కాని ఇప్పట్లా కాదు. ఆమె గర్భంలో అతి జాగ్రత్తగా మీరు కాపాడుకుంటున్న మీ యిద్దరి ప్రతిరూపం బైటికి లాగబడుతుంది. ఒక మొరటు వైద్యుడు మత్తుమందు యివ్వకుండా, చేతులకి గ్లవ్స్ వేసుకోకుండా ఆమె గర్భాలోంచి శిశువుని లాగేస్తాడు; ఆవు కడుపులోంచి చచ్చిపోయిన దూడను ముక్కలు ముక్కలుగా నరికి యివతలికి లాగినట్టు! అర్థమైందా?”

కాండిన్స్య తన చెవుల్ని నమ్మలేకుండా వున్నాడు. రిసీవర్ని పట్టుకున్న అతని చెయ్యి వణుకుతోంది. గొంతుకలోంచి యేదో ద్రవం నాలుకమీదికి ప్రవహిస్తోంది. వాంతి అయ్యేలా వుంది.

“అర్థమైందా?” బొంగురుకంఠం అతని చెవిలో మొరిగినట్టు అడిగింది.

తనని మెల్లిగా అదుపులోకి తెచ్చుకుని, కాండిన్స్య నాలుకతో పెదాల్ని తడుపుకున్నాడు. “శిరీషని యేమీ చేయకండి! ప్లీజ్ ....ఆమె....”

అటువైపు కంఠం నవ్వింది. "నేను చెప్పినట్టు నువ్వు చేస్తే ఆమెని యేమీ చెయ్యం. అంతా రహస్యంగా వుంచు. పోలీసుల దాకా వెళ్ళకు. ఫోన్ ద్వారా కూడా ఈ విషయాన్ని నువ్వు యెవరికీ రిపోర్టు చెయ్యకు. నిజం చెప్పాలంటే నేను చూడకుండా నువ్వెక్కడికీ వెళ్ళలేవు; నాకు వినిపించకుండా నువ్వు యెవరికీ యేమీ చెప్పలేవు. నా మూడో కన్ను అనుక్షణం నిన్ను గమనిస్తూ వుంటుంది. దానికి వినే శక్తి కూడా వుంది! నా హెచ్చరిక కాని నువ్వు యేమాత్రం నిర్లక్ష్యం చేసినా నీ భార్య నిర్దాక్షిణ్యంగా, రాక్షసంగా శిక్షింపబడుతుంది.

"ఆమెని కంట్రోల్ చేస్తున్న వ్యక్తులు గర్భవతిని రేప్ చేయాలన్న విచిత్ర వాంఛతో సతమతమవుతున్నారు. అబార్షన్ ముందు ఆమె చాలామందిని శారీరకంగా తృప్తిపరచాల్సి వుంటుంది. అబార్షన్ జరిగాక ఆమె తిరిగీ గర్భం ధరించే అవకాశం వుండదు. గర్భస్రావం అంత క్రూడ్‌గా జరిపించబడుతుంది. ఆ తరువాత చావుబతుకుల మధ్య వూగిసలాడుతున్న ఆమెని నరమానవుడు కనుక్కోలేని ప్రదేశంలో వొదిలేసి మేం మాయమై పోతాం. నువ్వు విశ్వరూపం ధరించి గాలించేసరికి ఆమె తన శిశువు చేరుకున్న లోకానికి...."

"ఏం చేయాలో చెప్పు!" కాందిశీక్య వినలేక అడ్డొస్తూ అరిచాడు, బొంగురు కంఠంతో.

"రైట్. రేపు సాయంత్రంలోగా పదిలక్షల రూపాయలు పోగుచెయ్. నోట్ల నెంబర్లు గుర్తించుకునే ప్రయత్నం చేయొద్దు. అతర్వాత ఏం చేయాలో చెప్తాను. ఫోన్ ముందు తపస్సుచేస్తూ కూచో ..."

"ప్లీజ్....బీ రీజనబుల్! నా దగ్గర అంత పైకం లేదు.

నాలుగో అయిదో యెంత వుంటే అంతా వూడ్చి యిచ్చేస్తాను...." కాండిన్య వణికే కంఠంతో అన్నాడు.

"నీ దగ్గర లేకపోతే యెవడో ప్రొడ్యూసర్ కి లైఫ్ టైమ్ కాంట్రాక్టుమీద బాండెడ్ లేబరర్ గా నిన్ను అమ్ముకో! నిర్ణయించిన రేటుకి నీ పెళ్లాన్ని కొనుక్కో!" అవతలి కంఠం నిర్దాక్షిణ్యంగా, కర్కశంగా ధ్వనించింది.

కాండిన్య యేదో చెప్పబోయాడు. కానీ అటువైపున డిస్కనెక్ట్ చేయబడింది.

## 8

రిసీవర్ని పెట్టేసి పరమేశ్వర్ లేచాడు. ఫోన్ పక్కనే వున్న టేప్ రికార్డర్ ని జేబులో పెట్టేసుకున్నాడు. గది లోంచీ బైటికి నడిచి, తాళం వేశాడు. మెట్లు దిగి హోటల్ రిసెప్షన్ వైపు అడుగులేశాడు.

ఎంతో ముందు చూపుతో తను హోటల్ హైవేలో కాండిన్య పేరుతో గది తీసుకున్నాడు. పరమేశ్వర్ రిసెప్షన్ ముందు ఆగాడు. కౌంటరు వెనుక గుమస్తా లేనందుకు సంతోషిస్తూ తాళం చెవిని దాని నంబరున్న మేకుకి తగిలించి ఇవతలికి నడిచాడు. కుడివైపుకి తిరిగి వాన్ ఆపిన ప్రదేశంవైపు తీరుగా అడుగులు వేశాడు.

చెట్లచాటులో ఆపిన వాన్ కి ఆనుకుని నిలబడ్డ రాజు అతన్ని చూసి చిరునవ్వు నవ్వాడు చీకట్లో. పరమేశ్వర్ అతన్ని సమీపించాడు. ఇద్దరూ వాన్ యెక్కారు.

"రాజా నాటకంలో మొదటి రంగం పూర్తయింది. ఇరవై నాలుగ్గంటల్లో నాటకం పూర్తవుతుంది...."

"అయిదు రోజులకి మనం అన్నీ సిద్ధం చేసుకున్నాం, బాస్...." రాజు మెల్లిగా అన్నాడు. వాన్ ని స్టార్టు చేసి మెయిన్ రోడ్లోకి ఎక్కించాడు.

"ఎందుకేనా మంచిదని అలా ప్లాన్ చేశాను. కౌండిన్య నిమిషాలమీద పైకం సర్దేసేలా వున్నాడు! పనయ్యాక ఒక్క క్షణంకూడా మనం ఇక్కడ వుండక్కర్లేదు...."

రాజు చిరునవ్వు నవ్వుతూ తలపంకించాడు.

పరమేశ్వర్ సీట్లో వెనక్కి వాలాడు. "నేను అను కున్నదానికన్నా అధికంగా అతను వాడిలిపోతున్నాడు. మనం చేయమన్నా ఆలస్యం చేసేలా లేడు! పాల సము ద్రాన్ని మనం అట్టేసేపు చిలకనక్కర్లేదు, రాజూ!" పరమేశ్వర్ నవ్వుతూ అన్నాడు.

రాజు తేలిగ్గా నిట్టూర్చి చిన్నగా నవ్వాడు. "నాకిప్పు డెంతో తేలిగ్గా వుంది, బాస్. ఈ పని ప్రారంభించిన క్షణంనుంచీ యెందుకో భయం భయంగా...."

"చెరువులో ఈదే వ్యక్తి మొదటిసారి సముద్రంలో ఈదటానికి భయపడతాడు. నాతో చేరావు; క్రమంగా నీ భయం మాయమవుతుంది!" పరమేశ్వర్ సగర్వంగా అన్నాడు.

"థాంక్స్ బాస్!" అన్నాడు రాజు.

# 9

శిరీష తల మూరాళ్ళమీదికి వాలిపోయింది. ఆమె కాళ్ళు, చేతులూ కట్టేసి వున్నాయి. తను కూచున్న గుహలో అవరించిన క్రీనీడలా భయం ఆమెని ఆవరించింది.

తనని బంధించిన కిరాతకులు తన భర్తని యెంత అడుగుతారో ఖచ్చితంగా తెలీకపోయినా, డబ్బుకోసమే ఈ దౌర్జన్యం సాగుతోందని ఆమె ఊహించింది. ఇవ్వ గలిగే మొత్తం అడిగితే కౌండిన్య యెడంచేత్తో పారే స్తాడు, తనకోసం.

తన భర్త బెదిరింపులకి లొంగి, డబ్బిస్తే వీళ్ళు తనని

వదిలిపెడతారా? సాధారణంగా బ్లాక్ మెయిలర్స్ విక్టిమ్స్‌ని ప్రాణాల్తో వదలరని ఆమె యెన్నోసార్లు చదివింది; తనని కళ్ళారా చూసిన వ్యక్తిని ప్రాణాల్తో వదలడం తమకి ప్రాణాంతకమని బ్లాక్ మెయిలర్స్‌కి తెలుసు! శిరీష గుండె దడదడ కొట్టుకుంది. అణువణువునా యేదో ఆందోళన విషంలా వేగంగా వ్యాపిస్తోంది.

తన మాటల్ని రికార్డుచేసి, తన భర్తకి వినిపించడానికి వెళ్ళిన ముఠా నాయకుడింకా తిరిగిరాలేదు. ఈపాటికి తన భర్తకి అంతా తెలిసివుంటుంది. పార్కునుంచీ ఇంటికి రాని తనకోసం కంగారుపడే భర్తకి తన ఉనికి తెలిసి మరో భయంకరమైన గాబరా ప్రారంభించి వుంటుంది. భర్త మనస్తత్వం బాగా తెలిసిన శిరీష అతని రియాక్షన్ ఎలా వుంటుందో ఊహించడానికి ప్రయత్నించింది.

తనకి ఏం జరిగిందో, ఇక్కడికి ఎలా చేరిందో, ఆ 'ఇక్కడ' యెక్కడో ఆమెకి యెంత ఆలోచించినా అర్థం కావడంలేదు. తల కొద్దిగా దిమ్ముగా వుంది. ఏదో మంచు తెర మెదడుని కప్పినట్టు అనుభూతి కలుగుతోంది.

మీద యేదో నీడపడ్డట్టనిపించింది శిరీష తటాలున తలెత్తి చూసింది.

సన్నగా పొడుగ్గా వున్న వ్యక్తి గాలిలో వూగే సరుగుడు చెట్టులా వూగుతూ తనముందు నిలబడ్డాడు. అతని ఎడంచేతిలో యేదో బాటిలుంది. కుడిచేతి వేళ్ళ మధ్య సిగరెట్ కాలుతోంది. అతను రెప్పవేయకుండా తననే చూస్తున్నాడు. పొడుగాటి జుట్టు భుజాలమీద పడుతోంది. మీసాలులేని ఆడంగి మొహం, హిప్పీలా హోమోలా అవుపిస్తున్నాడతను.

కమల్ ఆమె దగ్గరగా అడుగులేశాడు. మోకాళ్ళ మీద గడ్డం ఆన్చుకుని శిరీష అతన్నే చూస్తోంది. ఎర్రగా వున్న అతని చిన్న కళ్ళు ఆమెలో యేదో భయాన్ని నింపుతున్నాయి. అతని పెదవులు విచ్చుకున్నాయి.

"యూ ఆర్ బ్యూటీ!" అన్నాడతను మత్తుగా తూలుతూ. "ఇంత అందంతో లక్షలాది ప్రేక్షకుల కళ్ళకి విందుచేయకుండా కాగితాలమీద పిచ్చిరాతలు రాసే సన్నాసిని కట్టుకుని నువ్వు దేశానికి ద్రోహం చేశావ్!" కమల్ ఆగి, తూలి, ఘాటుగా దమ్ములాగి పొగ వదిలాడు.

వణుకుతున్న చేత్తో విస్కీ బాటిల్ని నోటికి అందించాడు. విస్కీ అతని గొంతులోకి దిగింది. నోటికి రెండువైపుల్నించీ కాలువలుగా కారుతూ అతని ఛాతీని తడుపుతోంది.

సీసాను నోటినుంచీ బలవంతంగా దూరంగా లాగి, గాజు కళ్ళతో అతను ఆమెని చూశాడు. "మాపుల్లో మనుషుల్ని మందలు మందలుగా కట్టేసే నిషన్న చేతులూ కాళ్ళూ కట్టి పడేయడం ... అన్యాయం. నువ్వు సై అంటే కట్లు విప్పి పారేసి నిన్ను ఈ చేతుల్తో బంధిస్తాను! సే సై డార్లింగ్!"

"గెటౌట్!" శిరీష కోపంతో, అసహ్యంతో అరిచింది.

"డోంట్ సే గెటౌట్ డార్లింగ్! నువ్వు.... నా.... పేషెంటువి. ఇవాళ్టినుంచీ నిన్ను చూసుకునేది నేను; డాక్టర్ సుబ్బలక్ష్మి కాదు!" కమల్ పిచ్చిగా నవ్వాడు. "అయామ్ యువర్ పర్సనల్ ఫిజీషియన్, డార్లింగ్.

వానుంచీ మొహం తిప్పుకోవొద్దు!" అంటూ కమల్ ఆమె గడ్డం కింద చెయ్యివేసి ఆమె మొహాన్ని బలవంతంగా తనవేపు తిప్పుకున్నాడు.

నీళ్ళతో నిండిన కళ్ళతో శిరీష దీనంగా చూసింది. "ప్లీస్, నన్నొదిలి వెళ్ళిపో" అందామె.

కమల్ మొండిగా తల అడ్డంగా ఆడించాడు. "ఇంపాసిబుల్. దీపానికి దూరంగా పురుగూ, అయస్కాంతానికి దూరంగా లోహమూ వుండలేవు!" మాట్లాడుతోంటే విస్కీ వాసన గుప్పున కొడ్తోంది.

కమల్ చెయ్యి ఆమె తలమీద పడింది. ఎర్రగా వున్న ఆమె పెదిమల్ని ఆకలితో చూస్తూ అతను ముందుకి జరుగుతున్నాడు. బలాన్నంతా కూడదీసుకుని శిరీష పక్కకి వాలింది. పక్కవాటంగా పడున్న శిరీషని కమల్ చూస్తూ ఆమె మోకాళ్ళు పట్టుకుని వెల్లకిలా తిప్పాడు.

శిరీష కళ్ళలో కోపం, అసహ్యం, భయం, ఆందోళనా కలిసి వున్నాయి. సింహం గుహలో చిక్కిన జింకలా వుందామె. కమల్ చెయ్యి ఆమె బుగ్గల్ని అదిమిపట్టుకుంది. "నీ డాక్టర్ని తిన్నగా ప్రేమగా ట్రీట్ చేయి డార్లింగ్!" అన్నాడతను నవ్వుతూ.

డేగ కాళ్ళకింద ఇరుక్కున్న చిన్నారి పిట్టలా నిస్సహాయంగా చూస్తోందామె. కమల్ మొహం ఆమె మీదికి వాలుతోంది. పొడుగాటి అతని వెంట్రుకలు ఆమె చెంపల్ని తాకుతున్నాయి.

చందమామను కబళించే రాహువులా జరుగుతున్న కమల్ తల హఠాత్తుగా ఆగింది. క్షణంలో అతని శరీరం కూడా తలతోబాటు పైకి లేచింది. శిరీష ఆశ్చర్యంగా చూస్తోంది.

కమల్ బనియన్ వెనక భాగాన్ని వదిలేసి, ముందు భాగాన్ని యెడంచేత్తో పట్టుకున్నాడు భద్రం. వెనక నుంచీ తన ముందుకి వచ్చి నిలుచున్న భద్రాన్ని కమల్ రౌద్రంగా చూశాడు, రెండు చేతుల్తో భద్రం చేతిని లాగేసే ప్రయత్నం చేశాడు.

"లీవ్ మీ!" అరిచాడు కీచుగా.

"కాపలా కాయాల్సిన ప్రదేశం వదిలిపెట్టి ఇక్కడి కెందుకొచ్చావ్, డాక్టర్?" భద్రం తీక్షణంగా చూస్తూ అడిగాడు.

"షటప్! నన్నడగటానికి నువ్వెవరు?" కమల్ హుంకరించాడు.

భద్రం చెయ్యి ఒకసారి ముందుకి జరిగింది. కమల్ తల తటాలున వెనక్కి వాలింది. మెడలో మెటిక విరిగింది. కమల్ బాధతో పళ్ళు ఇకిలించాడు. "ఉండ మన్నచోట ఉండాలి డాక్టర్!" భద్రం వికటంగా నవ్వుతూ అన్నాడు.

"వదులు!" కమల్ అరిచాడు.

"ఆమె దగ్గరగా వెళ్ళొద్దని బాస్ నీకు చెప్పాడు..."

"నా కెవడూ బాస్ లేడు నాకు బాస్ నినే!" కమల్ హుంకరించాడు, గుడ్లురుముతూ.

భద్రం యెగతాళిగా నవ్వాడు. "ప్రస్తుతం విస్కీ నీ బాస్‌గా వుందని నాకు తెలుసు! బుద్ధిగా ఉండకపోతే బోర్లా పడుకోబెట్టి తాగిన విస్కీనంతా కక్కేలా మోకాలితో వీపుమీద తొక్కుతాను!" అంటూ విసురుగా కమల్ని వెనక్కి తోశాడు. కమల్ వెల్లకిలా పడ్డాడు.

భద్రం ముందుకి నడిచి, కమల్ పొట్టకి రెండు వేపులా కాళ్ళుంచి నించుని, తీక్షణంగా అతని కళ్ళల్లో

చూశాడు. కమల్ కళ్ళల్లోని కోపం భయంగా మారింది. మెల్లిగా జరిగి, కూచున్నాడు.

"లేచి వెళ్ళి బైట కూచో డాక్టర్! ఈసారి తిక్క వేషాలేస్తే ముక్కలు విరగ్గొట్టి పుత్తూరుకి పార్శిల్ చేస్తా!" భద్రం నవ్వుతూ అన్నాడు. కమల్ తోక ముడుచుకుని, మెల్లిగా బైటికి నడిచాడు.

భద్రం తలతిప్పి శిరీష వైపు చూశాడు కొల్లకిలా, నిస్సహాయంగా పడున్న శిరీష ఆశ్చర్యంతో అతన్నే చూస్తోంది, భద్రం ఆమె దగ్గరగా నడిచి, గోడలాగా ఉన్న బండకి ఆమె వీపుని ఆన్చి కూచోబెట్టాడు. శిరీష మౌనంగా అతన్నే చూస్తోంది. భద్రం లోపలికెళ్ళి ప్లాస్టిక్ మగ్ తో తిరిగొచ్చాడు. ఆమె దగ్గరగా ఆగాడు.

"కాఫీ తాగుతానంటే తాగిస్తాను. కట్లు విప్పడానికి బాస్ అనుమతిలేదు" అన్నాడు ఆమెవైపు చూస్తూ.

శిరీష వద్దన్నట్టు తల అడ్డంగా తిప్పింది. భద్రం వెనుదిరిగాడు. శిరీష అతన్నే చూస్తోంది....

## 10

సిగరెట్ పీకని కిటికీ విసిరి మరో సిగరెట్ వెలిగించాడు కౌండిన్య.

గంటనుంచీ అతను కాలు కాలిన పిల్లిలా గదిలో తిరుగుతున్నాడు. మనసుని కలచివేస్తున్న ఆలోచనలు అతన్ని స్థిమితంగా కూచోనివ్వడంలేదు. సిగరెట్ పీకలు చిందరవందరగా పడి అతని కాళ్ళకింద నలుగుతున్నాయి.

తనకి ఎవరూ శత్రువులు లేరు. తను ఎవరికీ ద్రోహం చేయలేదు అయినా తనకి అక్రమంగా శిక్ష విధించబడుతోంది తను దూరంగా ఉండి మంటవేడిని భరిస్తు

న్నాడు. అమాయకురాలు శిరీష మంటల్లో కాలుతోంది!

ఈ భయంకరమైన విపత్తు గురించి తను యెవరికీ చెప్పకోడు! ఎవరి సహాయమూ తీసుకోలేడు. "అనుక్షణం నా మూడో కన్ను నిన్ను గమనిస్తూ వుంటుంది!" కౌండిన్య శరీరం ఒక్కసారి జలదరించింది.

ఏదో ఎక్స్‌ట్రా నేత్రం తన ప్రతి కదలికను గమనిస్తోందన్న ఆలోచన రాగానే అతని గుండె దడదడ కొట్టుకుంది. అంటే బ్లాక్ మెయిలర్ తనని అనుక్షణం గమనించడానికి ఎవడినో నియమించాడు!

అడిగిన పైకం గిరాటేసి శిరీషని రక్షించుకోవాలి. కౌండిన్య లోపల్లోపలే లెక్క వేయసాగేడు. బ్యాంకుల్లో ఆరులక్షలదాకా వుంటుంది. లాకర్‌లో ఉన్న శిరీష నగల్ని అమ్మితే మరో రెండులక్షలు రావొచ్చు. ఎంతో ప్రేమతో తను చేయించిన నగల్ని అమ్మాలంటే అతని కెందుకో బాధగా ఉంది. ఇంకో రెండు లక్షలు తను సర్దాలి.

ఉన్నపళాన రెండులక్ష లడిగితే ప్రొడ్యూసర్ భజగోవిందం యిస్తాడా? చాలా బడ్జెట్‌లో కొత్త చిత్రం ప్రారంభించాడతను. తను వేధిస్తే అంత అవసరం యేమొచ్చిందని అడుగుతాడు. చెప్తే క్షణంలో పదిలక్షలయినా యిస్తాడు. కానీ తను చెప్పలేడు!

'ఎవడో ప్రొడ్యూసర్‌కి లైఫ్ టైమ్ కాంట్రాక్టుమీద బాండెడ్ లేబరర్‌గా నిన్ను అమ్మేసుకో!' బ్లాక్ మెయిలర్ కంఠం అతని చెవిలో పాముబుసలా శబ్దం చేసింది

పచార్లు మానేసి సోఫాలో కూలబడి కౌండిన్య టెలిఫోన్ రిసీవరెత్తాడు.

అప్రయత్నంగా టైమ్ చూశాడు. రెండు దాటింది. ఏదీ కాని వేళ నిద్ర లేపితే భజగోవిందం పనుక్కుంటూ లేస్తాడు. అయినా తప్పదు.

కౌండిన్య ఆలోచిస్తూ భజగోవిందం నెంబరు తిప్పాడు....

## 11

జానీవాకర్ బాటిల్లోంచి రెండు గుక్కలు తాగి పరమేశ్వర్ బాటిల్ని పక్కనే ఉన్న భద్రానికి అందించాడు.

రెక్కలు కత్తిరించి కాళ్ళు ముడేసిన పావురంలా కూచున్న శిరీషని అతను తదేకంగా చూశాడు. ఆమె కళ్ళల్లో ప్రత్యక్షమౌతున్న భయం అతనికి చక్కిలిగింతలు పెడ్తోంది.

"భద్రం! ఆమె చేతులు మాత్రం విప్పేయి!" పరమేశ్వర్ ఆజ్ఞాపించాడు.

భద్రం శిరీష చేతుల్ని విప్పాడు. శిరీష అర్థంకానట్టు చూస్తోంది. డాక్టర్నంటూ తనమీదికి యెగబడ్డ కోతి తప్ప తతిమ్మా ముగ్గురూ తాగుతున్నారు. వాళ్ళు తెలీకుండా తాగి తనని....

భద్రం తనని రక్షించినప్పట్నుంచీ తనమీద అత్యాచారం జరగదనిపిస్తున్నా కూడా ఈ క్షణంలో ఆమె గుండెని భయం పిడికిలిలా బిగిస్తోంది.

"మన అతిథికి చపాతీ సర్వ్ చేయ్ భద్రం!" పరమేశ్వర్ ఆర్డరిచ్చాడు.

క్షణంలో చపాతీ ప్లేటుని ఆమె కాళ్ళదగ్గరగా పెట్టి భద్రం దూరంగా జరిగాడు.

శిరీష క్షణకాలం చపాతీని చూసి, పరమేశ్వర్ వైపు

కళ్ళు తిప్పింది. అతని కళ్ళు చంద్ర నిప్పుల్లా ఎర్రగా వున్నాయి. శిరీష కట్లు తప్పించబడిన తన చేతుల్ని చూసు కుంది. ఎర్రగా యేర్పడ్డ వాతలు గాజుల్లా అవుపిస్తు న్నాయి. ఎడమ చేత్తో కుడి చేతిని మెల్లగా రుద్దు కుంది....

"చపాతీ తీసుకో!" పరమేశ్వర్ కంఠం విని ఆమె తలెత్తి చూసింది.

సిగరెట్టు నోట్లో పెట్టుకోబోతూ అతను ఆమెవైపు చిరునవ్వుతో చూశాడు. అతని కళ్ళు నవ్వడంలేదు, లైటర్ క్లిక్ మంది. ఆ వెలుగులో అతని కళ్ళు నివురు తొలగించడ్డ నిప్పుకణాల్లా మెరిశాయి.

అతని చెయ్యి భద్రంవైపు సాగింది. భద్రం విస్కీ బాటల్ని అందించాడు. నోటి నిండుగా విస్కీ తాగి పుక్కిలిస్తున్నట్టు విస్కీని నోరంతా కలయదిప్పాడు. చివరికి గుటకలు వేసి, తృప్తిగా నిట్టూర్చాడు.

శిరీష అతన్ని తదేకంగా చూసింది. "ఆయనతో మాట్లాడావా?" వణికే కంఠంతో ఆమె అడిగింది.

పరమేశ్వర్ కనుబొమలు కొద్దిగా పైకి లేచాయి. నోట్లో యిరుక్కున్న సిగరెట్ కదిలింది. "ఆహా! పరిస్థితి వివరించాను. పదిలక్షలు చెల్లించి నిన్ను విడిపించుకొమ్మ న్నాను...."

"ఆయన....ఆయ నేమన్నారు?" శిరీష కంగారుగా ప్రశ్నించింది. పదిలక్షలు! గుడ్ గాడ్ ...

"అంత లేదన్నాడు. బేరం చేశాడు. నువ్వు క్షేమంగా వుంటే అదే తనకి 'పదివేలు' అన్నట్టు మాట్లా డాడు! అతని టేలెంట్ని పర్మనెంట్గా ఎవరికో అమ్మేసి, పదిలక్షలు పోగుచేసి, నిన్ను కొనుక్కొమ్మని

సలహా యిచ్చాను!" అన్నాడు పరమేశ్వర్.

శిరీష తన అసహాయతని తాత్కాలికంగా మరిచిపోయింది. "మేం నీకేం అపకారం చేశాం? ఈ స్థితిలో వున్న నన్ను ఇలా తీసుకురావడానికి నీకు బుద్ధెలా పుట్టింది? నువ్వు ..."

పరమేశ్వర్ సిగరెట్‌ని తీసి, బూడిదను చూసి, కింద పడేశాడు. అరచేత్తో ప్రేమగా తన మెడని రుద్దుకున్నాడు. నవ్వుతూ చూశాడు. "నిజం చెప్పాలంటే నువ్వేం అపకారం చేయలేదు. నీ భర్త అర్థంలేని అక్షరాలు రాసి లక్షలు లక్షలు సంపాయించి, బ్లాక్ మనీ మేట వేస్తున్నాడు. డబ్బు ఒకేచోట నిలవ వుండకూడదు. ఒక్క ముక్కలో చెప్పాలంటే చెమటోడ్చకుండా సంపాయించి, దోచి డబ్బు మేట వేయడం నీ భర్త చేసిన, చేస్తున్న అపకారం!"

"నీ వాదన పిచ్చిగా వుంది. న్యాయంగా డబ్బు సంపాదించే శక్తిలేని నీలాంటివాళ్ళ వాదన యిలాగే వుంటుంది...."

"షటప్! అడిగిన మొత్తాన్ని ముట్టజెప్పి నీ భర్త నిన్ను విడిపించుకు వెళ్ళాలని ప్రార్థించు!" అన్నాడు నవ్వుతూ.

అడిగిన మొత్తం పదిలక్షలు! శిరీష ఆందోళనతో ఆలోచించింది.

"పదిలక్షలు యివ్వకపోతే....ఏం చేస్తారు?" ఆమె సన్నటి కంఠంతో ప్రశ్నించింది.

పరమేశ్వర్ విస్కీ బాటిల్ని నోటికి అందించబోతూ ఆగాడు. ఆమెని తదేకంగా చూశాడు. చిరునవ్వుతో అతని పెదవులు కదిలాయి. "ఇవ్వలేకపోయినా, ఈ

విషయం ఇతర్లకి చెప్పినా, పోలీసు రిపోర్టిచ్చినా, డబ్బు అందజేయడానికి నా సూచనలకు విరుద్ధంగా వొంటరిగా రాకపోయినా, నాకు అనుమానం కలిగేలా ప్రవర్తించినా, అతని ఆరోప్రాణమైన నీకు అబార్షన్ చేయబడుతుంది. దానికి ముందు....”

"నో!" శిరీష బిగ్గరగా అరిచింది. ఆమె అరుపులో గుహ మార్మోగింది. తటాలున రెండు చెవుల్నీ మూసుకుంది.

అప్రయత్నంగా ఆమె రెండు చేతులూ జోడించింది. "నీ కాళ్ళు పట్టుకుంటాను. అంత....అంత....దారుణం చేయకు....” అందామె వెక్కుతూ.

పరమేశ్వర్ చిరునవ్వుతో చూశాడు. "నా కాళ్ళా వేళ్ళా పడి లాభంలేదు. నీ భర్త నా మాట పాటించాలని ప్రార్థిస్తూ కూచో. నేను రికార్డు చేయబోయే నీ రెండో సందేశంలో నీ మొగుణ్ని ప్రాధేయపడు. అర్థించు!....ప్రస్తుతానికి ఆ చపాతీ తిను!”

శిరీష కళ్ళు తుడుచుకుంది. తను పాషాణం ముందు ప్రార్థన చేస్తూ కూచుంది! ఆమె కళ్ళు చపాతీ ప్లేటు వైపు తిరిగాయి. ఆమె కుడిచెయ్యి ప్లేటు వైపు జరిగింది. వేళ్ళు ప్లేటు అంచుని చుట్టేశాయి. మరుక్షణం పింగాణీ ప్లేటు చక్రంలా గిర్రున తిరుగుతూ వెళ్ళి ఎదురుగా వున్న రాతి గోడకి కొట్టుకుని శబ్దం చేస్తూ పగిలింది. ప్లేటుముక్కల్ని కాసేపు చూసి, పరమేశ్వర్ పగలబడి నవ్వాడు. నవ్వుకుని రాజావైపు చూశాడు.

"రాజు, ఇద్దరూ పడుకోండి. గంటదాకా నేను మేలుకుంటాను. తరవాత మిమ్మల్ని లేపుతాను” అన్నాడు సిగరెట్ తీస్తూ. సాలోచనగా శిరీషవైపు చూశాడు.

"భద్రం, ఆమె చేతులు కట్టేయ్. లేకపోతే సత్యభామ బాణాలు విసిరినట్టు ఆమె చక్రాలు విసురుతుంది!" అన్నాడతను నవ్వుతూ.

ఆమె చేతులు యథాప్రకారంగా కట్టేసి ఇద్దరూ నిద్రకు పడ్డారు.

శిరీష అరగంటకి పైగా అలాగే కూచుండిపోయింది.

ఆమెకి నిద్ర రావడంలేదు. సలసలాగొట్టినట్టున్న శరీరం నొప్పిని ఆమె పూర్తిగా మరిచిపోయింది.

మతా నాయకుడు చెప్పిన వరకు ఆమెను గందరగోళంలో ముంచేసింది. ఉద్దేశపూర్వకంగా కాకున్నా కాండిస్య చిన్న పొరపాటు చేస్తే, పొరపాటు చేసినట్టు బ్లాక్ మెయిలర్ కి అనుమానం వస్తే తన గతేమిటి? నవ్వుతూ క్రౌర్యాన్ని వెదజల్లుతున్న బ్లాక్ మెయిలర్ ఆరి తేరిన దుర్మార్గుడనీ, అతనిలో శాడిస్టు లక్షణాలున్నాయనీ ఆమె పసిగట్టింది. అందర్నీ తను బాగా చూసింది. వాళ్ళ మాటలు వింది.

తన భర్త పైకం చెల్లించినా వీళ్ళు తనని, తమ దారుణ నేరానికి ప్రత్యక్ష సాక్షి అయిన తనని ప్రాణాల్తో వదుల్తారా? ఆమె మూసిన కళ్ళు తెరిచి పరమేశ్వర్ వైపు చూసింది.

భంగుతాగుతున్న గోసాయిలా అతను సిగరెట్ పీలుస్తూ కళ్ళు సగం మూసి కూచున్నాడు. డాక్టర్ నంటూ వచ్చిన నీచుడికి పుట్టిన దుర్బుద్ధి అతనిలో తేనట్టుంది. డాక్టర్ ....! తనకి అబార్షన్ చేయడానికి నియమించబడ్డ డాక్టర్!

శిరీష తల గిర్రున తిరగసాగింది. కళ్ళు గట్టిగా మూసుకుని, తనని అదుపులోకి తెచ్చుకుందామె. తను గాబరా

పడకూడదు! డాక్టర్ సుబ్బలక్ష్మి పదే పదే చెప్పింది....

శిరీష ధైర్యంగా ఆలోచించడం ప్రారంభించింది. స్వప్రయోజనం కోసం, కౌండిన్యని బెదరగొట్టడం కోసం బ్లాక్ మెయిలర్ తన మాటల్ని క్యాసెట్ ద్వారా వినిపిస్తున్నాడు. ఏదో విధంగా తను భర్తకు తన కంఠాన్ని వినిపించగలుగుతోంది.

తను ఏ ప్రదేశంలో వుందో తనకి తెలీదు. కానీ గుహలో వుందని మాత్రం ఖచ్చితంగా తెలుసు. తన ఉనికిని రహస్యంగా తన భర్తకి తెలియజేయాలి. ఎలా? ఎలా? ఎలా?

శిరీష బుర్ర వేడెక్కుతోంది. ఈ అవకాశాన్ని తను తెలివిగా ఉపయోగించుకోవాలి. ఎలా?

## 12

ఉదయం పది కావస్తోంది.

కౌండిన్య సోఫాలో కూచుని ఆలోచిస్తున్నాడు. ఏవేవో హృదయాన్ని కలవరపెట్టే ఆలోచనలు ఒకదానొకటి తరుముకొస్తున్నాయి.

వంటామె పొద్దుటే వచ్చి శిరీష గురించి అడిగింది. స్నేహితురాలితో ఉందనీ మర్నాడొస్తుందనీ అతను అబద్ధమాడి ఆమెని పంపేశాడు. గదంతా చెల్లాచెదురుగా పడున్న సిగరెట్ పీకల్ని చూస్తున్న మంగమ్మ చూపులు అతని అబద్ధాన్ని నమ్మటంలేదని చెప్పాయతనికి!

టెలిఫోన్ మోత అతన్ని ఆలోచనల ఊబిలోంచీ ఇవతలికి లాగింది. అతను రిసీవర్ని చెవికి ఆనించాడు.

“కౌండిన్య! పైకం సిద్ధం చేశావా?”

“శిరీష ఎలా వుంది?” కౌండిన్య ఆత్రంగా అడిగాడు.

అటువైపునుంచీ నవ్వు వినిపించింది. “నా పాటకి

అనుగుణంగా నువ్వు నాట్యం చేసినంతకాలం ఆమె క్షుద్రంగా ఉంటుంది. నా ప్రశ్న విన్నావు నువ్వు...."

కౌండిన్య నిట్టూర్చాడు. "ఆమెని భయపెట్టకండి. మీ రడిగింది యివ్వడానికి ప్రయత్నం చేస్తున్నాను...."

"నాకు తెలిసినంతవరకూ ఆమె నికన్నా ధైర్యంగా వుంది.... అన్నట్టు నీ ఆఖరి ప్రాణం యేదో చెప్తోంది విను...." అన్నాడతను. కాసేపట్లో శిరీష కంఠం తీగమ్మీట పాడుతూ కౌండిన్య చెవిలో ధ్వనించింది.

"ఏమండీ.... ఇప్పటిదాకా క్షేమంగానే వున్నాను. భయంతో రాత్రంతా నిద్ర పట్టలేదు. అతనడిగింది త్వరగా ఇచ్చేయండి. అతను చెప్పినట్టు జాగ్రత్తగా నడుచుకోండి. మీ కు పొరబాటు చేసే వాళ్ళు.... నాకు....అబార్షన్...." శిరీష కంఠం వణుకుతోంది

"ఎలాగైనా సర్దండి. నేను నేను కానేమో అన్న అనుమానం రావొచ్చు. డార్లింగ్.... నేను....నీ శిరీష కుసుమాన్ని ...రాజా....నీ రాకుమారిని రక్షించుకో.... ఆలస్యం చెయ్యొద్దు...."

"విన్నావా?" బొంగురుకంఠం కౌండిన్య చెవిలో గాండ్రించింది.

కౌండిన్య జవాబు చెప్పలేదు. అతని చెవిలో శిరీష మాటలూ, ఏడుపూ ఇంకా గింగురుమంటూనే వున్నాయి. నూతిలోంచి పిలుస్తూ, ఏడుస్తోందామె కంఠం. పాతాళం లోంచి తనని పైకిలాగి రక్షించమంటోంది. వెచ్చగా జారిన అశ్రువుల్ని కౌండిన్య కోపంతో తుడుచు కొన్నాడు. అతనిలో ఆగ్రహం నిస్సహాయంగా బుసకొట్టు తోంది.

"నువ్వు మనిషివేనా? అబార్షన్ చేస్తామని ఆమె

నెందుకు భయపెట్టావ్?" కౌండిన్య అరిచాడు.

బొంగురు కంఠం వికటంగా నవ్వింది. "జరగబోయేది తెల్సుకోవడం మనిషికి ఎప్పుడూ మంచిది!"

తన ఆగ్రహం పనిచేయదని కౌండిన్య గ్రహించి, కంట్రోల్ చేసుకున్నాడు.

"ఆమెని ఇంకా గాబరా పెట్టొద్దు. ఉద్రేకపడితే ఆమెకి అబార్షన్...."

"డోంట్ గెట్ ఎక్సైటెడ్! నీ భార్యకి అంత తేలిగ్గా అబార్షన్ జరిగేలా లేదు. జరగాలంటే మా డాక్టర్ చెయ్యి చేసుకోవాల్సిందే! ఆల్ రైట్....పది లక్షలు రెడీగా వుంచి, అందుబాటులో వుండు. యెలా అందజేయాలో తరువాత తెలియజేయబడుతుంది."

రిసీవర్ని అలాగే ఉంచుకుని కౌండిన్య బొమ్మలా కూచుండిపోయాడు.

# 13

పదిన్నర దాటింది.

కౌండిన్య కారును కాంపౌండులోంచి మెయిన్ రోడ్డు యెక్కించి, ఎడంవైపుకి తిప్పి పోనిచ్చాడు. తన అకౌంట్స్ వున్న నాలుగు బాంక్స్‌కీ అతను ఫోన్ చేశాడు. తను విత్‌డ్రా చేయదలచిన మొత్తాల్ని సిద్ధంగా వుంచమన్నాడు. స్టేట్ బాంక్ లాకర్లో వున్న నగల్ని ధీరజ్‌మల్ దుకాణంలో అమ్మేయడానికి నిర్ణయించుకున్నాడు.

కౌండిన్య కారు మెయిన్‌రోడ్‌లోకి తిరగ్గానే, వంద గజాల దూరంలో ఆగిన నల్లరంగు డాడ్జి కారు కదిలింది. నల్లటి కళ్ళద్దాలు ధరించిన వ్యక్తి సావధానంగా కౌండిన్య కారును వెంబడించసాగేడు. అతని నోట్లోంచి సిగరెట్

వాలుగా వెళ్ళొస్తూ పొగ చిమ్ముతోంది.

పది నిమిషాల్లో కౌండిన్య స్టేట్ బాంక్ ముందు కారాపి దిగాడు. తన కారును ఫాలో చేస్తూ, కొంచెం దూరంలో ఆగిన బ్లాక్ డాడ్జి కారును అతను గమనించే స్థితిలో లేడు.

డాడ్జి కారులోని వ్యక్తి తాపిగ్గా సిగరెట్లు కాలుస్తూ మాటు వేసిన పులిలా కూచున్నాడు అతని కళ్ళు బాంక్ ద్వారంమీదే తాపడం అయిపోయి వున్నాయి.

రెండుగంటలపాటు తిరగాల్సిన చోట్లన్నీ తిరిగి కౌండిన్య కారును యింటివేపు తిప్పాడు. స్పీడుగా వెళ్తూ ఆలోచనల్లో మునిగిపోయాడు. అనుకున్నట్టే రెండు లక్షలు తక్కువపడుతున్నాయి. భుజగోవిందం లక్ష ప్రశ్నలు వేశాడు. రెండు గంటలలోగా రెండులక్షలు సర్దడానికి అంగీకరించాడు.

కౌండిన్య కారును తన కాంపౌండులోకి పోనిచ్చాడు. బ్లాక్ డాడ్జి కారు అతని యింటిని దాటి వేగంగా వెళ్ళిపోయింది. రెండువందల గజాల అవతలున్న చిన్న వీధిలోకి తిరిగి ఆగింది.

పోర్టికోలో కారాపి కౌండిన్య దిగాడు. బరువుగా వున్న సూట్ కేస్‌ని మోస్తూ వరండా మెట్లెక్కి తలుపు తాళం తెరిచాడు. ఇంట్లోకి ప్రవేశించబోతూ మెల్లగా తలతిప్పి రోడ్డువైపు చూశాడు. యెవ్వరూ తనని చూడ్డంలేదు.

అతను గుమ్మం దాటి తలుపు మూసి గొళ్ళెం పెట్టేశాడు. పడగ్గదిలోకి నడిచి సూట్ కేసుని మంచం కిందికి తోశాడు.

అలసటగా కుర్చీలో కూలబడి, సిగరెట్ వెలిగిం

చాడు. నోరు మండుతోంది. చిరాగ్గా సిగరెట్ ని పారేసి కళ్ళు మూసుకున్నాడు.

మినిమమ్ బాలెన్స్ వుంచేసి డబ్బంతసీ తీసేసుకుంటున్న అతన్ని బాంక్ మానేజర్లు వెయ్యి ప్రశ్నలు వేశారు. హఠాత్తుగా అమ్మకానికి వచ్చిన స్టూడియోని కొనబోతున్నట్టు వాళ్ళకి చెప్పాడతను.

కౌండిన్య కళ్ళు తెరిచి వాచీ చూశాడు. రెండవడానికి యింకా అరగంట పైనే వుంది. నిన్నట్నుంచి తను యేమీ తినలేదని అతనికి గుర్తొచ్చింది. అయినా ఎందుకో ఆకలిగా లేదు. కడుపు మండుతోంది. కానీ, ఆకలితో కాదు....

రాగయుక్తంగా ధ్వనించిన ఛైమ్స్ విని కౌండిన్య ఉలిక్కిపడి లేచి నిలబడ్డాడు.

ఎవరు? భుజగోవిందం క్యాష్ పంపించాడా? కారు వచ్చిన శబ్దం తనకి వినిపించలేదు. ఆలోచిస్తూ అతను హాల్లోకి అడుగులేశాడు.

ఛైమ్స్ మరోసారి ధ్వనించాయి. తలుపు తెరిచిన కౌండిన్య గుమ్మంలో నిలబడ్డ అపరిచిత వ్యక్తిని ఆశ్చర్యంతో చూశాడు. అతని కనుబొమలు ప్రశ్నార్థకంగా పైకి లేచాయి.

బ్రౌన్ సూటులో వున్న ఆరడుగుల వ్యక్తి తనవేపు చిరునవ్వుతో చూస్తున్నాడు. పొడుక్కి తగ్గ లావుగా, దృఢంగా వున్న శరీరం. అతని కళ్ళు వజ్రాల్లా వున్నాయి. అతని పెదవులమీద వున్న నవ్వు కళ్ళల్లో లేదు. కౌండిన్య గుండె యెందుకో వేగంగా కొట్టుకోసాగింది.

"మిస్టర్ కౌండిన్యా?" అతని కంఠం బిగ్గరగా

ధ్వనించింది.

"... యస్....మీరు...." కౌండిన్య తడబడ్డాడు. తనున్న విపత్కర పరిస్థితిలో యే అపరిచిత వ్యక్తినీ అతను నమ్మలేకుండా ఉన్నాడు.

"లోపలికి రావొచ్చా?" అపరిచిత వ్యక్తి ప్రశ్నించాడు, అడ్డుగా నిలబడ్డ కౌండిన్యని అవోలా చూస్తూ.

"మీరెవరు?" ఏం కావాలి?" కౌండిన్య కొంచెం చిరాకుగా అడిగాడు.

అతను మాట్లాడలేదు. మెల్లగా తల తిప్పి, కాంపౌండ్ నీ, రోడ్డునీ క్షణకాలం చూశాడు. అతని కుడి చెయ్యి కోటు లోపలిజేబులోకి వెళ్ళింది. కౌండిన్య అనుమానంగా, ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అతని చెయ్యి యివతలకి వచ్చింది. మెల్లిగా కౌండిన్య ముందుకి సాగింది. అసంకల్పితంగా కౌండిన్య కొంచెం వెనక్కి జరిగాడు.

సగం మూసిన అతని అరచేతిమీదే కౌండిన్య కళ్ళు నిలిచాయి. వేళ్ళని కొద్దిగా తెరుస్తూ అతను అరచేతిలో యిరుక్కున్న కార్డుని కౌండిన్యకి కనిపించేలా పట్టుకున్నాడు. "ఇన్ స్పెక్టర్, పృథ్వీరాజ్."

కౌండిన్య గుండె దప్పులా కొట్టుకోడం ప్రారంభించింది. కంగారుగా అయోమయంగా తలెత్తి చూశాడు.

## 14

"మే ఐ కమిన్?" అన్నాడు ఇన్ స్పెక్టర్ చేతిని జేబులోకి పోనిస్తూ.

"అయామ్ బిజీ. వాట్ కన్ ఐ...." కౌండిన్య మాట పూర్తికాకుండానే అతను సున్నితంగా తోసుకుంటూ

గుమ్మం దాటాడు. తలుపు మూసి గొళ్ళెం పెట్టేశాడు. ఇన్ స్పెక్టర్ రాక గురించి తనలో పాము పడగల్లా లేస్తున్న వెయ్యి ప్రశ్నలకి సమాధానాలు వూహించలేక కౌండిన్య సతమత మవుతున్నాడు.

"ఇంట్లో యెవ్వరూ వున్నట్టు లేదు....?" అంటూ అతను కౌండిన్యను తోసుకుంటూ పడగ్గదివైపు నడిచాడు. కౌండిన్య అతనివేపు తిరిగాడు. తడి ఆరిపోతున్న పెదవుల్ని నాలుకతో తడుపుతున్నాడు.

"అయామ్ ఎక్స్పెక్టింగ్ సమ్‌వన్....మీ కేం కావాలి?" పానకంలో పుడకలా వచ్చిన ఇన్ స్పెక్టర్ని ప్రశ్నించాడు కౌండిన్య.

"ఆ గదిలో మాట్లాడుకుందాం?" అంటూ అతను గబగబా నడిచాడు. కౌండిన్య అయిష్టంగా కదిలాడు.

గది మధ్యలో వున్న సోఫాలో కూచున్న ఆ వ్యక్తి కౌండిన్యను చిరునవ్వుతో చూశాడు. "సిడౌన్!" అన్నాడు. కౌండిన్య కుర్చీలో చతికిలబడ్డాడు.

అతను తీక్షణంగా కౌండిన్యని చూశాడు. "మీ భార్య యెక్కడికి వెళ్ళింది?" ప్రశ్నించాడతను.

"ఇఫ్ ఇటీజ్ ఎనీ ఆఫ్ యువర్ బిజినెస్ ఆమె తన స్నేహితురాలింటికి వెళ్ళింది!" కౌండిన్య విసుగ్గా అన్నాడు. ఆ వ్యక్తి చిన్నగా నవ్వుతూ సిగరెట్ వెలిగించాడు.

"ఇన్ స్పెక్టర్, మీకేం కావాలి? త్వరగా చెప్పండి" మళ్ళీ కౌండిన్య కంఠంలో విసుగు ధ్వనించింది.

"సుధారాం! మీ భార్య ఎక్కడికి వెళ్ళింది?" ఇన్ స్పెక్టర్ పృథ్వీరాజ్ నవ్వుతూ అన్నాడు.

"ఇందాకే చెప్పాను!" అన్నాడతను.

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరాజ్ చిన్నగా నవ్వాడు. "ఆల్ రైట్. దాగుడుమూతలాడ్డానికి సమయం లేదు. ఇవాళ స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఆంధ్రాబాంక్, ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్, బ్యాంక్ ఆఫ్ ఇండియాల్లో మీరు ఆరు లక్షల దాకా తీసేసుకున్నారు ధీరజ్‌మల్‌కి లాకర్లోంచి పట్టుకెళ్ళిన నగలు అమ్మేశారు. ఒక్క రోజులో అంత పైకం మీకు ఎందుకు కావాల్సి వచ్చింది?"

"అది కూడా మీకు సంబంధించిన వ్యవహారం కాదు" అన్నాడు కౌండిన్య అసహనంగా. ఇన్‌స్పెక్టర్ ఇదంతా ఎందుకు అడుగుతున్నాడో అర్థంకాలేదు.

"మిస్టర్ కౌండిన్యా. చదువుకున్న మీరు విజ్ఞతతో వ్యవహరించి వుండాల్సింది...." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

కౌండిన్య చివాల్న తల యెత్తాడు. "యేమిటి మీ అర్థం?"

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరాజ్ అతని కళ్ళల్లోకి తదేకంగా చూశాడు. "మీ భార్య కిడ్నాప్ చేయబడింది. పది లక్షలు రాన్సమ్ చెల్లిస్తే గానీ ఆమెకి సేఫ్టీ లేదు..."

కౌండిన్య ఊపిరి పీల్చుకోడం మరచిపోయాడు. అతని కళ్ళల్లో భయం ఉలితో చెక్కినట్టు ప్రత్యక్షమవుతోంది. "మీకు.... మీకు....ఎలా తెలుసు?"

"పదిలక్షలు మీరు చెల్లించకపోతే, ఆమెకి అబార్షన్ చేయబడుతుంది...." కౌండిన్య ప్రశ్నని విననట్టు ఇన్‌స్పెక్టర్ చెప్పుకుపోతున్నాడు.

కౌండిన్య తటాలున లేచినించున్నాడు. విపరీతమైన భయం అతని రక్తంతో కలసి శరీరమంతా ఉధృతమైన వేగంతో పాకుతోంది. మొహంమీద చెమటబిందువులు ప్రత్యక్షమవుతున్నాయి. పెదిమలు వణుకుతున్నాయి.

"ఇన్‌స్పెక్టర్ .... మీకు .... ఇదంతా .... ఎలా .... తెలి తెలిసింది?" తాత్కాలికంగా అతనికి శక్తి వచ్చినట్టయి పోయింది.

"ఎన్నో శాఖలు మాకు కబుర్లు అందజేస్తూ వుంటాయ్!"

కౌండిన్య బలహీనంగా కుర్చీలో కూలబడ్డాడు. ప్రశాంతపూర్వకంగా ఇన్‌స్పెక్టర్ని చూశాడు.

"ఎఫ్టీలో వచ్చినందుకు మీకు ధన్యవాదాలు. ఇన్‌స్పెక్టర్, నాకో సాయం చేస్తారా?" కౌండిన్య మెల్లిగా అడిగాడు.

"తప్పకుండా!"

"మీరు విన్నదంతా కల్ల అనుకోకండి. చూసిందంతా కల అనుకోండి. దయచేసి వెళ్ళిపోండి. అంతా మరిచి పోండి!" కౌండిన్య కంఠం దీనంగా వుంది.

ఇన్‌స్పెక్టర్ సానుభూతితో చూశాడు. "మీ ఉద్దేశాన్ని అర్థం చేసుకోగలను. మీరు మా దారికి వస్తే ఆమెకి అపాయం సంభవిస్తుంది. బ్లాక్ మెయిలర్ గీసిన గీతని మీరు దాటలేరు! కానీ...."

"ఇన్‌స్పెక్టర్ అతడు అడిగిందంతా ఇవ్వడానికి నేను సిద్ధంగా వున్నాను. నా భార్య గర్భంలోని శిశువుతో పాటు క్షేమంగా చెదరకుండా నన్ను చేరుకోవాలి! అంతే!" కౌండిన్య అడ్డొస్తూ అన్నాడు.

"మా ఉద్దేశం కూడా అదే!"

"మీరు రంగంలోకి దిగితే శిరీషకి మరమ్మత్తు చేయలేని అపకారం జరిగిపోతుంది. షీ విల్ బి గాంగ్ రేప్డ్! ఇన్‌స్పెక్టర్, ప్లీస్ .... వెళ్ళిపోండి!" కౌండిన్య నీరసంగా అభ్యర్థించాడు.

ఇన్‌స్పెక్టర్ లేచాడు. తలుపుదాకా నడిచాడు. గిరుక్కున వెనక్కి తిరిగి, కౌండిన్య మొహంలోకి తీక్షణంగా చూశాడు. "డబ్బు చెల్లిస్తే. మీ భార్య సురక్షితంగా తిరిగొస్తుందని మీరు నమ్ముతున్నారా?"

కౌండిన్య కళ్ళు పెద్దగా చేశాడు. "వస్తుందని అతను అన్నాడు...."

"తెగించిన ఆ కసాయివాడిని మీరు నమ్ముతున్నారా?" ఇన్‌స్పెక్టర్ ప్రశ్నించాడు.

"నమ్మక చేయగలిగిందేముంది?" కౌండిన్య బలహీనంగా జవాబిచ్చాడు.

ఇన్‌స్పెక్టర్ అడుగులు వేసి. కౌండిన్య ముందు ఆగాడు. "లెటస్ బీ లాజికల్. మీగు శిరీషను కిడ్నాప్ చేశారనుకుందాం. మిమ్మల్నీ, మీ అనుచరుల్నీ రెండు కళ్ళతో బాగా చూసిన ఆమెని, భవిష్యత్తులో మిమ్మల్ని గుర్తుపట్టగలిగిన ఐవిట్నెస్‌ని మీరు నిర్లక్ష్యంగా వదిలేసి పారిపోతారా?"

కౌండిన్య అయోమయంగా చూశాడు. ఇన్‌స్పెక్టర్ చిరునవ్వు నవ్వాడు.

సాధారణంగా బ్లాక్ మెయిలర్ తన విక్టిమ్‌ని ప్రాణాలతో వదలడు. కిడ్నాప్ కేసుల్లో ఇంతవరకూ అలాంటి సంఘటన జరగలేదని చెప్పాలి. ఆ బ్లాక్ మెయిలర్ మాటని నమ్మడంవల్ల మీకు కొంత మనశ్శాంతి—తాత్కాలికంగా—కలుగుతుంది. అంతే! యథార్థాన్ని ఎదుర్కొందాం: మీరు డబ్బు చెల్లించాక అతను ఆమెకి తీరుబడిగా అబార్షన్ చేయకపోవచ్చు. ఒకే ఒక బుల్లెట్‌తో ఆమెనీ, గర్భంలోని శిశువునీ అతను అంతం చేస్తాడు;

ఆమె నోటిని శాశ్వతంగా మూసేస్తాడు!"

కౌండిన్య దిక్కుతోచనట్టు చూశాడు. "మీ వాదన తార్కికంగా వుంది. నిజం కూడా అంతే కావచ్చు. అయినా, మీరు కేసు పెట్టకుండా వుంటే, నేను అతను చెప్పినట్టు వింటే శిరీష సజీవంగా తిరిగొచ్చే అవకాశం వుంది. మీ గురించి పసిగట్టిన మరుక్షణం ఆమె నాశనం అయిపోతుంది...."

ఇన్‌స్పెక్టర్ కూచున్నాడు. "కీడెంచి మేలెంచమన్నారు. మీరు నమ్ముతున్నట్టు కాకుండా పని ముగియగానే ఆమెను తుదముట్టించి అతను పారిపోతే మీరేం చేస్తారు? కన్నీళ్ళు కారుస్తూ, పళ్ళు కొరుకుతూ మా దగ్గరకొస్తారు. మీ భార్యని అమానుషంగా చంపిన రాక్షసుల్ని శిక్షించమంటారు. మీరు రచయిత. సినిమా కోసం, అమెరికా ప్రజల్ని ఊపేస్తున్న రాంబో లాంటి హీరోని కాగితం మీద సృష్టించి, తెరమీద ఆడించగలరు. అయితే ఆ హీరోలా మీరే స్వయంగా ఈ రంగంలోకి దిగి, సాహసకృత్యాలు చేయలేరు! హంతకుల్ని పట్టుకోలేరు...."

కౌండిన్య రెప్ప వేయకుండా చూస్తున్నాడు. సిగరెట్ వెలిగించి పొగ వదులుతూ ఇన్‌స్పెక్టర్ అతన్ని చూశాడు.

"సర్వనాశనం అయిపోయిన తరవాత, ఎప్పుడో తీసుకోబోయే మా సహాయాన్ని యిప్పుడే, సమయం మించిపోనప్పుడే తీసుకోండి!" ఇన్‌స్పెక్టర్ గంభీరంగా అన్నాడు. కౌండిన్య తటపటాయిస్తూ చూశాడు.

"నేను.... నేను ఎటూ తేల్చుకోలేకుండా వున్నాను. అయామ్ హెల్ప్‌లెస్!" అతను దీనంగా అన్నాడు.

"మమ్మల్ని సహాయం చేయనివ్వండి! మిస్టర్ కౌండిన్యా, మీరు అతని షరతుల ప్రకారం నిరభ్యంతరంగా డబ్బు చెల్లించండి. మా సహాయం తీసుకుంటున్నట్టు అతనికి తెలియాల్సిన అవసరం లేదు. సరైన క్షణం నుంచి నాటకాన్ని మేం నడుపుతాం!"

"ఇన్ స్పెక్టర్, నాకు.... భయంగా, ఆందోళనగా వుంది...." కౌండిన్య నిరుత్సాహంగా అన్నాడు.

"పని పూర్తయ్యాక బ్లాక్ మెయిలర్ మిమ్మల్నీ, మీ కిచ్చిన మాటనీ పూర్తిగా మరచిపోతాడు. అతనికి కావాల్సింది తన క్షేమం! కుండనిండా పాలు పిండుకున్నాక పొదుగుని కోసేస్తాడు. మీ భార్య క్షేమంగా తిరిగిరాదని నా అనుభవం చెపుతోంది. ఆమెని రక్షించడానికి ప్రయత్నం చేద్దాం. ఆ ప్రయత్నంలో ఆమె మీకు దక్కొచ్చు!" ఇన్ స్పెక్టర్ ఉద్రేకంతో అన్నాడు.

"మీ మాటలు నమ్మాలనిపిస్తోంది. అంతా మీ చేతుల్లోకి వదిలి నిశ్చింతగా వుండాలనిపిస్తోంది. కానీ...." కౌండిన్య యింకా యేదో చెప్పబోయాడు. ఇన్ స్పెక్టర్ అతన్ని అడ్డుకున్నాడు.

"నమ్మండి. మా చేతుల్లోకి వదలండి. నిశ్చింతగా వుండండి!" ఇన్ స్పెక్టర్ నవ్వుతూ ప్రోత్సాహించాడు.

"తన మూడో కన్ను అనుక్షణం నా మీద వుంటుందన్నాడు.... అతను మిమ్మల్ని పసికట్టలేడంటారా?" కౌండిన్య సందేహిస్తూ అడిగాడు.

ఇన్ స్పెక్టర్ అతని కళ్ళలోకి చూశాడు. "ఉదయం నుండీ నేను మిమ్మల్ని నీడిలా వెంటాడాను. మీరు గుర్తించారా?"

"నేను మామూలు మనిషిని. అతను ఆరితేరినవాడు!"

కౌండిన్య నవ్వడానికి ప్రయత్నించాడు.

ఇన్‌స్పెక్టర్ కళ్ళు సానబెట్టిన వజ్రాల్లా మెరిశాయి. "మిస్టర్ కౌండిన్యా, మీ బ్లాక్ మెయిలర్ ఒక్కడే అరి తేరినవాడు కాదు. అరితేరినవాళ్ళు అనేకమంది వున్నారు!" అన్నాడు గంభీరంగా. సిగరెట్‌ని యాష్‌ట్రేలో కుక్కి అతను లేచాడు.

"ఇన్‌స్పెక్టర్, ప్లీజ్ సిడౌన్!" అన్నాడు కౌండిన్య మొదటిసారిగా చిరునవ్వు నవ్వుతూ. ఇన్‌స్పెక్టర్ కూచున్నాడు.

"ఇప్పుడేనా చెప్పండి. ఇదంతా మీకెలా తెలిసింది?" కౌండిన్య ప్రశ్నించాడు.

"ఇవాళ ఉదయం మీకూ బ్లాక్ మెయిలర్‌కీ జరిగిన సంభాషణని మరో వ్యక్తి కూడా విన్నాడు.

"ఎవరా వ్యక్తి?" కౌండిన్య కంగారుగా అడిగాడు. విషయం యెవరిద్వారా బైటికి పొక్కినా అది తన ద్వారానే జరిగిందని బ్లాక్ మెయిలర్ అనుకుంటాడు. అది శిరీషకి ప్రమాదం.

"ట్రంక్ లైన్ చెక్ చేయడానికి వెళ్ళిన ఒక టెలిఫోన్ మెకానిక్. మొదట్లో అదొక ప్రాక్టికల్ జోక్ అనీ, ఎవరో ఇద్దరు మాట్లాడుకుంటున్నారనీ అతను అనుకున్నాడు. పూర్తిగా విన్నాక భయంకరమైన నేరం జరుగుతోందని అతను నిశ్చయించుకున్నాడు. తిన్నగా మా దగ్గరకొచ్చాడు...."

కౌండిన్య ఆందోళనతో చూశాడు. "ఇన్స్‌పెక్టర్, అతను బైట నోరు విప్పితే, శిరీషకి ప్రమాదం...."

ఇన్స్‌పెక్టర్ పృథ్వీరావ్ చిరునవ్వు నవ్వాడు. "భయ పడకండి. బైటికి వెళ్ళకుండా అతన్ని మా దగ్గరే పెట్టు

మన్నాం!"

కౌండిన్య నిట్టూర్చాడు తేలిగ్గా. ఇన్స్పెక్టర్ సిగరెట్ వెలిగించాడు. చెయిమ్స్ మోగాయి. కౌండిన్య గాభరాగా ఇన్స్పెక్టర్ని చూశాడు.

"వెళ్ళండి. ఎవరో చూడండి," ఇన్స్పెక్టర్ సలహా ఇచ్చాడు. కౌండిన్య మెల్లగా లేచి హాల్లోకి నడిచాడు. అతను బాధపడుతున్నట్టు అతనినడకే చెప్తోంది. ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ తలుపు వెనక నిలబడి చెవులు రిక్కించాడు. కౌండిన్య యెవరితోనో నవ్వుతూ మాట్లాడుతున్నాడు. ఇన్స్పెక్టర్ లోపలికి నడిచి కుర్చీలో కూచున్నాడు. చిన్న క్యాష్ బాగ్ తో కౌండిన్య తిరిగొచ్చాడు.

"తక్కువపడిన డబ్బును పట్టుకొచ్చిన వ్యక్తి" అంటూ బాగ్ ని మంచంమీద పడేశాడు.

ఇన్స్పెక్టర్ అతన్ని తదేకంగా చూశాడు. "డబ్బు చెల్లించే విధానం, ప్రదేశం అతను మీకు తెలియజేస్తాడు...."

"యస్...."

"ఆ ప్రదేశం ఆమెని బంధించిన చోటుకి దూరంగా ఉంటుందనే మనం అనుకోవాలి. ఆమెకి దగ్గరగా అతను మిమ్మల్ని ఆహ్వానించడు. అంచేత ఆమెని యెక్కడ బంధించారో మనం ముందుగానే కనిపెట్టే ప్రయత్నం చేయాలి...." అంటూ ఇన్స్పెక్టర్ సాలోచనగా కళ్లు మూసుకున్నాడు. రెండుక్షణాల తరవాత కళ్ళు తెరిచి కౌండిన్య మొహంలోకి చూశాడు.

"పొద్దుట అతను మీతో అన్నమాటలు చెప్పండి."

కౌండిన్య బ్లాక్ మెయిలర్ కీ తనకీ మధ్య జరిగిన

సంభాషణని తలిపించాడు.

"క్యాసెట్ ద్వారా మీ భార్య ఏం చెప్పింది?"

కౌండిన్య జాలిగా చూసి నిట్టూర్చాడు. "శిరీష విపరీతంగా భయపడింది. ఏమవుతుందో అనుకుంటూ యేమి చేసిందో...."

ఇన్స్పెక్టర్ చెయ్యెత్తి అతన్ని వారించాడు. "మిస్టర్ కౌండిన్యా, మీ భార్య యెలాంటి వ్యక్తి? పిరికి మనిషా ధైర్యం గల స్త్రీయా? తెలివైందా?"

"శిరీష చురుకైన పిల్ల!" కౌండిన్య సగర్వంగా అన్నాడు.

"ఆల్ రైట్. ఆమె మాటల్ని ఒక్క అక్షరంకూడా పొల్లుపోకుండా చెప్పండి."

కౌండిన్య తన భావావేశానికి కళ్ళెంవేసి, కళ్ళు మూసుకున్నాడు. అతని హృదయంలో ఇంకా ధ్వనిస్తున్న ఆమె మాటలు అతని కంఠంలో ప్రతిధ్వనించసాగేయి.

"ఏమండీ.... ఇప్పటిదాకా క్షేమంగానే వున్నాను. భయంతో రాత్రంతా నిద్రపట్టలేదు .... అతనడిగింది త్వరగా ఇచ్చేయండి. అతను చెప్పినట్టు.... జాగ్రత్తగా నడచుకోండి. మీరు పొరపాటుచేస్తే వాళ్ళు ... నాకు.... అబార్షన్.... యెలాగైనా సరేనండి... నేను నేను కానేమో అన్న అనుమానం కావొచ్చు. డార్లింగ్ .... నేను.... నీ శిరీష కుసుమాన్ని.... రాజా.... నీ పాపమారిని రక్షించుకో.... ఆలస్యం చెయ్యొద్దు...." కౌండిన్య ముగించి కళ్ళు తెరిచి దీనంగా చూశాడు.

ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ జేబులోంచి డైరీతీశాడు. కుడిచేత్తో పేనా పట్టుకుని "మళ్ళీ చెప్పండి" అన్నాడు.

విషాదగీతం పాడుతున్న గాయకుడి కంఠంలో, గాద్గ

దికంగా కాండిన్య మళ్ళీ కల్పించాడు. అతని కళ్ళు ఆవే శంతో చెమ్మగిల్లాయి. తను రాసుకున్నదాన్ని ఇన్స్పెక్టర్ మళ్ళీ చదివాడు, ఏకాగ్రతతో. తలెత్తిచూశాడు.

" 'ఏమండీ' అని ప్రారంభించిన మీ భార్య, చివర ఏకవచనం ఉపయోగించింది. మిమ్మల్ని ఏకవచనంతో పిలిచే అలవాటుందా ఆమెకి?"

కాండిన్య ఆశ్చర్యంతో చూశాడు. ఆ విషయం తన దృష్టికి రాలేదు!

"శిరీష నన్ను బహువచనంతోనే మన్నిస్తుంది...." అన్నాడు మెల్లిగా.

ఇన్స్పెక్టర్ తలపంకించాడు. " 'డార్లింగ్ .... నేను నీ శిరీషకుసుమాన్ని..రాజా. నీ రాకుమారిని రక్షించుకో.. ఆలస్యం చెయ్యొద్దు....' ఇవీ ఆమె చివర్న పలికిన మాటలు. ఇక్కడ ఆమె మిమ్మల్ని 'నువ్వు' అని సంబోధించింది. అవునా?"

కాండిన్య తలాడించాడు.

"ఆమె పూర్తిపేరు శిరీషకుసుమా?" ఇన్స్పెక్టర్ అడిగాడు.

"కాదు..శమాషాకి ఒక్కోసారి నేనలా అనేవాణ్ని.."

"ఆమెకి మిమ్మల్ని 'రాజా' అని పిలిచే అలవాటుందా?"

"లేదు."

"మీరామెని 'రాకుమారీ' అని పిలిచేవారా?"

"లేదు."

"మిస్టర్ కాండిన్యా. ఏవేనా ప్రత్యేక సందర్భాల్లో 'రాజా'. 'రాకుమారీ' అన్న పదాల్ని ఆమె ఉపయోగించేదా?"

"లేదు....అలాంటి సందర్భాలేవీ తటస్థించలేదు...."
కౌండిన్య మెల్లిగా అన్నాడు. ఈ ప్రశ్నల్ని ఇన్స్పెక్టర్ యెందుకు అడుగుతున్నాడు? అతను ఇన్స్పెక్టర్ని చూశాడు. "ఇన్స్పెక్టర్, మీకు పెళ్ళయిందా?"

"అఫ్కోర్స్...." ఇన్స్పెక్టర్ జవాబిస్తూ ప్రశ్నార్థకంగా చూశాడు.

కౌండిన్య మొహంమీద చిరునవ్వు ప్రత్యక్షమైంది. "ఏకాంతంలో భార్య భర్తని 'రాజా' అంటుంది. భర్త భార్యని 'రాణీ'" అంటాడు. అలా పిలవడానికి కారణం పారవశ్యం. మీకు అర్థమైందనుకుంటాను...."

"అఫ్కోర్స్.... కానీ మీ భార్య పారవశ్యంతో మాట్లాడ్డంలేదు. ఆమె అతిభయంకరమైన అపాయం మధ్య చిక్కుకుంది ఆమె పారవశ్యంలో కాదు, పరులవశంలో వుంది!" ఇన్స్పెక్టర్ నవ్వుతూ అన్నాడు.

కౌండిన్య నీరసంగా తలపంకించాడు. ఇన్స్పెక్టర్ తదేకంగా చూశాడు.

"ఏకాంతంలో, పారవశ్యంలో పలికేవిధంగా మీ భార్య ఇప్పుడెందుకు మాట్లాడింది? మిస్టర్ కౌండిన్యా, ఆమె ఉద్దేశపూర్వకంగా యేకవచనం ఉపయోగించిందని నాకెందుకో అనిపిస్తోంది...."

కౌండిన్య అర్థంకానట్టు చూశాడు. ఇన్స్పెక్టర్ కళ్ళు యెందుకో మెరుస్తున్నాయి. "ఆమె మీకు యేదో చెప్పడానికి ప్రయత్నిస్తోంది! ఆమె చెప్పేది మీకు మాత్రమే అర్థంకావాలి!"

కౌండిన్య ఉలిక్కిపడ్డట్టు చూశాడు. చిన్నగా నవ్వాడు. "ఇన్స్పెక్టర్, అధికంగా ఆనందం, భయం కలిగినప్పుడూ భరించలేని కష్టం యెదురైనప్పుడూ మనిషి

తలాతోకా లేకుండా మాట్లాడతాడు. ఆవేశంలో అతను భాషనీ, వ్యాకరణాన్నీ మరిచిపోతాడు! శిరీష అబల, అస్సహాయ స్థితిలో వున్న నిండు చూలాలు....”

“ఒక్క క్షణం.” ఇన్స్పెక్టర్ అడ్డుతగిలాడు. “నిన్నటి సందేశంలో ఆమె ఇలా మీరన్నట్టు తలాతోకా లేకుండా ‘రాజా, రాకుమారీ’ పదాల్నీ, ఏకవచనాన్నీ ఉపయోగించిందా?”

కౌండిన్య కళ్ళు చిట్లించాడు. “....లేదనుకుంటాను... లేదు....” అన్నాడు గొణుక్కుంటున్నట్టు.

ఇన్స్పెక్టర్ నవ్వాడు. “తను కిడ్నాప్ చేయబడిందని తెలుసుకున్న క్షణంలో కలిగే భయంకన్నా, చెరలో ఒకరోజు గడిచాక కలిగే భయం సహజంగా తక్కువగా వుంటుంది... మీ భార్య మీకు రహస్యంగా యేదో చెప్పే ప్రయత్నం చేసిందనుకుందాం. నష్టమేం లేదు. బోనులో చిక్కిన జంతువుగూడా తప్పించుకోడానికి అనేక మార్గాలు వెతుకుతూ వుంటుంది. అపదలో యిరుక్కున్న మనిషికి భయంతోబాటు తెలివీ పెరుగుతుంది. అది సహజ ప్రవృత్తి....” ఇన్స్పెక్టర్ ఆగి సిగరెట్ ముట్టించాడు.

“బాగా గుర్తుచేసుకోండి. ‘రాజా, నీ రాకుమారిని రక్షించుకో’, అని ఆమె యే సందర్భంలోనూ అనలేదా?”

కౌండిన్య బలహీనంగా తలని అడ్డంగా ఊగించాడు.

“పోనీ మరోవిధంగా అడుగుతాను: ఏదైనా ప్రత్యేక సంఘటనని ఈ డైలాగ్ మీకు గుర్తుచేస్తుందా?” ఇన్స్పెక్టర్ అడిగాడు.

కౌండిన్య అదిరిపడి లేచినించున్నాడు. అతని వొళ్ళు వణకడం ప్రారంభించింది. “మై గాడ్!” అప్రయత్నంగా

అతను అరిచాడు.

"ఏమిటి? చెప్పండి!" ఇన్స్పెక్టర్ కుర్చీ అంచుకి జరిగాడు.

"ఇన్స్పెక్టర్, మీరుపయోగించిన 'డైలాగ్' అన్న పదం నాలో మూసుకుపోయిన యేవో తలుపుల్ని తెరిచింది. మెదడుని కప్పిన యెన్నో పొరల్ని వొలిచి ..."

"కమాన్! అసలు విషయం చెప్పండి!" ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ తీక్షణంగా అన్నాడు.

కౌండిన్య ఆవేశాన్ని అపుకునే ప్రయత్నం చేస్తూ కుర్చీలో కూచున్నాడు. "శిరీష హీరోయిన్ గా నటించిన 'యువరాణి' చిత్రానికి నేనే రచన చేశాను. ఆ చిత్రం ద్వారానే మా పరిచయం, పరిణయం జరిగాయి. ఆ చిత్రంలో హీరోయిన్, యువరాణి డైలాగ్ నే శిరీష ఇప్పుడు ఉచ్చరించింది!"

ఇన్స్పెక్టర్ కళ్లు అగ్గిపుల్లలా వెలిగాయి. "హీరోయిన్ ఆ డైలాగ్ ని సినిమాలో యెప్పుడు పలికింది?" ఆవేశంతో అడిగాడతను.

"కౌండిన్య కళ్లు మూసుకున్నాడు. "ఆ జానపద చిత్రానికి రచనచేసి ఆరేళ్లు దాటింది. కాసేపు ఆలోచించుకోనివ్వండి.... యస్ .... అవును..... 'యువరాణి' చిత్రంలో రాకుమారిని విలన్ ఒక కొండగుహలో బంధిస్తాడు. అప్పుడు హీరోయిన్ హాస్యనటిద్వారా హీరోకి ఒక సందేశం పంపిస్తుంది. అక్కడ దొరికిన ఒక ఎండుటాకుమీద కళ్ళకి పెట్టుకున్న కాటుకతో తన సందేశం రాస్తుంది. ఆ సందేశం ఒక్కే ఒక్క వాక్యం: "రాజా, నీ రాకుమారిని రక్షించుకో!" చెప్పడం ముగించి కౌండిన్య కళ్ళు తెరిచి చూశాడు.

ఇన్స్పెక్టర్ తటాలున లేచి నిలబడ్డాడు. "థాంక్యూ మిస్టర్ కౌండిన్యా! మీ భార్య సాధారణ స్త్రీ కాదు. బ్లాక్ మెయిలర్ తనని కొండగుహాలో బంధించాడని ఆమె మీకు తెలియజేసింది. రిమార్కబుల్."

కౌండిన్య పొంగిపోతూ చూశాడు. "మీకు ధన్యవాదాలు చెప్పుకోవాలి నేను. మీ తర్కం ఆమె అందించిన రహస్యాన్ని బయటలికి లాగింది!"

"మనిద్దరం తర్వాత మీ భార్యకి ధన్యవాదాలు చెప్పుకుందాం! మిస్టర్ కౌండిన్యా, ఆమె బంధించబడిన కొండ గుహ ఎక్కడుంది?" ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ నొసలు చిట్లిస్తూ గబగబా అని మళ్ళీ ఇలా అన్నాడు.

"ఇవాళ యేదో ఒక సమయంలో బ్లాక్ మెయిలర్ మీకు ఫోన్ చేస్తాడు. రాన్సమ్ సైకం యెక్కడ, యెప్పుడు, యెలా చెల్లించాలో తెలియజేస్తాడు. ఆమెని జాగర్తగా మీకు అప్పగించమని ఆతృతగా అడగండి. కంగారు వ్యక్తం చేయండి. అతను చెప్పింది తు.చ. తప్పకుండా పాటించండి...." అంటూ ఇన్స్పెక్టర్ డైరీలోంచీ కాగితాన్ని చింపి యేదో రాసి, కాగితాన్ని కౌండిన్యకి అందించాడు. "ఈ నంబరుకి ఫోన్ చేయండి. ఈ ఫోన్ దగ్గరే పాతుకుపోయి వుంటాను. అతను చెప్పిందంతా నాకు తెలియజేయండి."

## 15

తనముందు టేబుల్ మీద పరిచిన ఫారెస్టు అండ్ హిల్ యేరియా మాప్ని క్షుణ్ణంగా పరిశీలించి, ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ కుర్చీలో వెనక్కి వాలాడు. సిగరెట్ వెలిగించి, తన కుర్చీకి ఇరువైపులా నిలబడ్డ నలుగురు ఇన్స్పెక్టర్లని కలయజూశాడు.

"పట్నానికి మూడ్నైపై కిలోమీటర్ల దూరంలో కొండల వరస ప్రారంభమవుతుంది. ఫారెస్టు డిపార్టుమెంట్ ఆ పర్వతశ్రేణిని ఎనిమిది కొండలుగా విభజించింది. అన్ని కొండల్లోనూ గుహాలున్నాయి. ఫారెస్టు గార్డు ఏడు కొండలు చెప్పిందాన్నిబట్టీ, వాటిలో ఒకటైన నగారా కొండలో చాలా గుహాలున్నాయి. నగారా కొండ ఆంధ్రా, కర్ణాటక, తమిళనాడు బోర్డర్లు కలిసే చోటికి దగ్గరగా వుంది....." ఇన్స్పెక్టర్ ఆగి మాప్ మీద పడున్న రెడ్ పెన్సిల్ని అందుకున్నాడు.

నలుగురు ఇన్స్పెక్టర్లూ ముందుకి వంగారు. ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ చేతిలోని పెన్సిల్తో మాప్ మీద ఒక చోట గుండ్రంగా ఒక వృత్తాన్ని గీసింది. "నా అంచనా ప్రకారం, లభించిన ఆధారాల ప్రకారం—ఈ గుహల్లో ఎక్కడో నేరస్థుడు దాక్కున్నాడు. ఎన్. హెచ్. ఫోర్ నుండీ చీలే మఫ్యూసిల్ రోడ్డునుండీ పది కిలోమీటర్ల బండి బాట కొండ అడుగు భాగాన్ని కలుపుతుంది...."

ఎర్రపెన్సిల్ మొదటి వృత్తంచుట్టూ మరో పెద్ద వృత్తాన్ని గీసింది. "దాదాపుగా ఈ వృత్తం వున్న ఏరియాలో ఎక్కడో ఒకచోట పైకం వసూలు జరగొచ్చు. పనయ్యాక నేరస్థుడు ఏ రాష్ట్రంలోకి మాయమవుతాడో చెప్పలేం. అంచేత మూడు రాష్ట్రాల్లోకీ వెళ్ళే రోడ్లమీద, సరైన చోట్లలో నిఘా యేర్పాటు చేయాలి .." ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ తలతిప్పి ఇన్స్పెక్టర్ కుమార్ వైపు చూశాడు.

"యస్సర్ ...." అన్నాడు కుమార్.

"కుమార్, మూడు వాన్స్‌లో సాయుధ సిబ్బందినీ, అంబులెన్సుల్నీ సిద్ధంగా వుంచు. పట్నానికి దూరంగా దాక్కున్న నేరస్తుడు యేదో వాహనాన్ని ఉపయోగిస్తూ ఉండివుండాలి. ఆ రోడ్స్‌లో బోర్డర్స్ దాటి వెళ్ళే ప్రతీ వాహనాన్నీ ఆపి చెక్ చేయండి. అనుమానం వచ్చిన ప్రతి వ్యక్తినీ నయానో భయానా అదుపులోకి తీసుకోండి. మారువేషాలు వేసుకోవచ్చు. కొందరు ఆదా మొత్తంలో పారిపోడానికి వాళ్ళు ప్రయత్నిస్తారు....

"బోర్డర్ యేరియాస్‌లోని తమిళనాడు, కర్ణాటక పోలీసులతో నేను మాట్లాడాను. మీకు పూర్తిగా వాళ్లు సహకరిస్తారు. ఇన్స్‌పెక్టర్ కుమార్ మీకు నాయకత్వం వహిస్తాడు. ఏదేనా తెలిస్తుగానే నన్ను కాంటాక్టు చేయండి. 'ఆపరేషన్ మిడ్‌నైట్' కోడ్‌ని ఉపయోగించండి" ఇన్స్‌పెక్టర్ పృధ్వీరావ్ ఉత్తరు విచ్చాడు.

"యస్సర్!" అన్నారు ఇన్స్‌పెక్టర్స్ ఏకకంఠంతో.

"రఘురాం నువ్వు ఇక్కడే వుండు. నీకు వేరే పని ఇస్తాను."

"యస్సర్."

"సార్...." కుమార్ పిలిచాడు.

ఇన్స్‌పెక్టర్ పృధ్వీరావ్ అతనివేపు చూశాడు.

"అతను మళ్ళీ ఫోన్ చేయడానికి సిటీలో, అటువైపున ఉన్న టౌన్స్‌లో కొళ్ళొచ్చు. నగారా కొండలోకి చుట్టు పక్కలున్న టౌన్స్‌లో, సిటీ లిమిట్స్‌లో అతనికోసం వలవేస్తే...."

"మనకు కావాల్సింది అతను కాదు! బ్లాక్ మెయిలర్స్ చాలా జాగ్రత్తగా ప్లాన్ చేస్తారు. నిర్ణీత సమయంలో ఆ వ్యక్తి తిరిగి వెళ్ళకపోతే పిక్టిమ్‌మీద పగతీర్చుకో

వచ్చు. విక్టిమ్ మనకంట బడేదాకా అతను ఆడమన్నట్టు మనం ఆడాలి. అదేమంచిది. నౌ గో ఎ హెడ్!" పృథ్వీరాజ్ నవ్వుతూ అన్నాడు.

# 16

"చదివింపులు సిద్ధంగా వున్నాయా?" బొంగురు కంఠం అడిగింది.

"ఎప్పుడు, ఎక్కడ, ఎలా అంచజేయాలో చెప్పు. నా భార్య నాకు త్వరగా కావాలి. డోంట్ వేస్ట్ టైమ్!" కౌండిన్య కొంచెం అదుర్దాగా అన్నాడు.

"నోట్ల గురించి అన్ని జాగ్రత్తలూ తీసుకున్నావా?" అతను వెటకారంగా అడిగాడు.

"నువ్వు చెప్పిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాను. నాకు నువ్వూ నీ బలగం అక్కర్లేదు; నా భార్య కావాలి! ఐ వాంట్ మై వైఫ్ బాక్. నాట్ ది డర్టీ మనీ!"

"ఓకే. సరుకుని రెండు నల్లటి సూట్ కేసుల్లో సర్దు. నీ కారులో పడేసుకో. రాత్రి సరిగ్గా పదిగంటలకి బయల్దేరు. మామూలు స్పీడులో మద్రాసు రోడ్డమ్మట పోనీ. నలభై కిలోమీటర్లు వెళ్ళాక ఎడమవైపు చీలుతున్న రోడ్లోకి తిరిగి ఒక కిలోమీటరు వెళ్ళు. కారాపి కిందికి దిగు. రోడ్డుకి ఎడమవైపున వున్న ఊడలమర్రిచెట్టు వెంట్రుకలు విరబోసుకున్న దెయ్యంలా కనిపిస్తుంది. సూట్ కేసుల్ని మోసుకుంటూ మర్రిచెట్టు కిందికి వెళ్ళు. అగ్గిపుల్ల గీయటం లాంటిది, టార్చి వెలిగించటం లాంటిది చేయకు.

పదకొండో నెంబరు ఊడదగ్గరగా సూట్ కేసుల్ని పెట్టెయ్. తిరిగిచూడకుండా నీ కారువైపు వెళ్ళిపో. స్టీరింగ్ ముందు కూచో. సిగరెట్ ముట్టించి, అగ్గిపుల్లని

కింద పడేయ్. ఒక నిమిషంపాటు అలాగే చూస్తో. తరువాత కారును వెనక్కి తిప్పి మెయిన్ రోడ్డు చేరుకో. అర మైలు దాటా?' బొంగురుకంఠం ప్రశ్నించింది.

“అర మైలు దాటింది....” కాండిన్య మెల్లిగా అన్నాడు.

“సిటీవైపు తిరగొద్దు. ఎడమకి తిరుగు. ఆపకుండా యాభై కిలోమీటర్లు వెళ్ళు. చిన్న టౌన చేరుకుంటావ్. అక్కడున్న హోటల్ హైవేలో నీ పేరులో ఇరవై నాలుగో నెంబరు గది రిజర్వ్ చేయబడింది. ఆ గదిలో దిగు...”

“జస్ట్ మోమెంట్! నువ్వడిగింది నీకు ఇచ్చేశాక, నా భార్యను వదిలెయ్. ఆమెను తీసుకుని నా దారిన నేను పోతాను....” కాండిన్య కంగారుగా అడ్డు వస్తూ అన్నాడు.

“మై డియర్ ఫేమస్ రైటర్! డబ్బుని నమ్మినట్టు నేను మనిషిని నమ్మను. నా కోటకి క్షేమంగా చేరుకున్న తరువాత, నువ్వు పోలీసుల్ని ఉసిగొలపలేదని నికరంగా తెలుసుకున్నాక నీ భార్య ఉనికి నీకు తెలియజేయబడుతుంది. అంతవరకూ ఆమె నాకు కవచంగా వుంటుంది!”

“ఇది అన్యాయం. నేను ఎవ్వరికీ యేమీ చెప్పను. నిన్నూ, నీ కిచ్చిన డబ్బునీ పూర్తిగా మరిచిపోతాను” కాండిన్య ఆత్రుతగా అన్నాడు.

“పూర్తిగా విను: నేను ఆడమన్నట్టు నువ్వు ఆడకపోతే, నాకు అనుమానం వేస్తే నీ సూట్ కేసులు మర్రి చెట్టుకిందే వుంటాయి. నేను యిదివరకే ప్రామిస్ చేసిన శిక్షలన్నీ అమలుజరిపించి నా దారిన పోతాను. నువ్వు గాలించి పట్టుకునేసరికి శిశువు చేరుకున్న లోకాన్నే అబార్షన్ జరిగిన తల్లి కూడా చేరుకుంటుంది!”

"....అలాంటిదేం జరగవు....ప్లీస్...."

"జరక్కపోవడం నీ భార్యకూ, ఆమె మోస్తున్న శిశువుకూ మంచిది! చెప్పినట్టు చెయ్. తప్పటడుగు వేయకు!"

అటువైపున ఫోను డిస్కనెక్టు చేయబడింది.

# 17

ఆకాశంలో నక్షత్రాలు గుడ్డిగా వెలుగుతున్నాయి. గుహకి కొంచెం దూరంలో బండరాతిమీద పరమేశ్వర్ కూచున్నాడు. అనుచరులు ముగ్గురూ అతని ముందు నించున్నారు. లోపల బంధించబడి వున్న శిరీష తను మాటల్ని వినకుండా వుండటానికి పరమేశ్వర్ అక్కడ సమావేశం యేర్పాటు చేశాడు.

"చేపిన ఆవు త్వరలో మనకి కడివెడుపాలని అందిస్తుంది. ఎవరి వాటా వాళ్ళు జుర్రుకోవచ్చు!" పర్వమేశ్వర్ పెదవుల మధ్య యిరుక్కున్న సిగరెట్ అతని మాటలకి అనుగుణంగా కదులుతూ గాలిలో గీతలు గీస్తోంది, ఎర్రగా.

"స్ప్లెన్‌డిడ్!" కమల్ ఉత్సాహంతో అరిచాడు.

"డాన్, శృతి తగ్గించు. అవతల నీ పేషెంటు వింటుంది!" పరమేశ్వర్ హెచ్చరించాడు. "నా అంచనా ప్రకారం సరిగ్గా పన్నెండింటికి ధనలక్ష్మి మన వొళ్ళో వాలుతుంది. ఆ తరువాత గంటలోగా మనం యిక్కణ్నుంచీ మాయమైపోవాలి...."

"వాటాలు యిక్కడే పంచేసుకోవడం మంచిదని నా సలహా" కమల్ వేళ్ళు కదుపుతూ అన్నాడు. రాజా, భద్రం సాక్షుల్లా చూస్తూ నించున్నారు.

"సలహాలివ్వడానికి నువ్విక్కడికి రాలేదు! పనయ్యాక పేషెంటుని తీసుకుని మనం మరో స్థావరం చేరుకుంటాం.

అతను మనమీద యే విధమైన చర్య తీసుకోవడం లేదని రూఢి చేసుకున్నాక ఆమెను వదిలిపెడతాం."

"బాస్, ఎక్స్‌క్యూజ్ మీ...." రాజు మెల్లిగా అన్నాడు. "పాలు పితుక్కున్నాక ఆవుని వదిలేయడం క్షేమం అని నాకు అనిపిస్తోంది. కిడ్నాప్ చేసిన వ్యక్తిని అక్కడికీ ఇక్కడికీ తీసుకెళ్ళడం ప్రమాదం!"

పరమేశ్వర్ నోట్లో సిగరెట్ పైకీ కిందికీ ఆడింది. "మనల్ని క్షేమంగా వుంచడానికే ఆమె మనతో వస్తోంది. ఒకవేళ కౌండిన్య ప్రోద్బలంతో పోలీసులు మన కోసం గాలిస్తారనుకుందాం. ఆమె మన కత్తికింద ఉన్నంతకాలం యెవ్వరూ మనల్ని సమీపించలేరు!" అంటూ మెరుస్తున్న నక్షత్రాలకేసి చూశాడు.

"స్టార్‌లైట్ డిన్నర్ పూర్తిచేసుకుని నువ్వూ నేనూ వెళ్దాం. భద్రం, డాక్టర్ యిక్కడ కాపలా వుంటారు. మనం తిరిగొచ్చేలోగా అన్నీ సర్ది రెడీగా వుంచుతాడు. ఆ తరువాత నెల్లగొంచి మనుష్యుల్లోకి పోదాం! ఓ.కే?"

"అబాగన్ అక్కర్లేదా? ఏదో ట్రీట్‌మెంట్ చేస్తేగానీ నాకు తోచదు!" కమల్ మెల్లిగా అరిచాడు.

"గుర్రం బండిని లాగినప్పుడు కమ్చీ ఉపయోగించక్కర్లేదు!"

"కోసుకొచ్చిన గులాబీని నలిపి పెంటు చేయకపోయినా, కనీసం వాసన చూడకుండా తోటలోకి గిరాటేయడం మూర్ఖత్వం!" కమల్ అసంతృప్తితో అన్నాడు.

పరమేశ్వర్ కమల్ వైపు చీకట్లో గుడ్లగూబలా తీక్షణంగా చూశాడు. "కమల్ నీ ఆలోచనల్ని దారి

మళ్ళించు. మన దృష్టి డబ్బుమీదే వుండాలి. డబ్బు ముందలుగా మనుషుల్ని నీ కాళ్ళముందు పడేస్తుంది!" అతను కటువుగా అన్నాడు.

క్షణం ఆగి "భద్రం, స్టార్ లైట్ డిన్నర్!" పరమేశ్వర్ ఆర్డరిచ్చాడు. భద్రం గబగబా గుహవైపు కదిలాడు. కమల్ అసహనంగా కదిలి, సిగరెట్ వెలిగించాడు.

# 18

కోపంగా, అసహనంగా కౌండిన్య అటూ ఇటూ తిరుగుతున్నాడు. స్కాండ్రల్! డబ్బివ్వగానే శిరీషని వదలి పెడతానన్న నీచుడు ఆమెని కవచంగా వాడుకో బోతున్నాడు! అప్రయత్నంగా అతని పిడికిళ్ళు బిగుసు కున్నాయి ఎదురుపడితే వాడిని తన చేతులతో హత మార్చాలనిపిస్తోంది అతనికి. మంచంమీద పడున్న రెండు నల్లటి సూట్ కేసులవైపు అసహ్యంగా చూశాడతను. డబ్బు! డబ్బు తనని ఈ దురవస్థలో పడేసింది. తగు మాత్రంగా ఉన్న డబ్బు సంతోషాన్నీ, శాంతినీ ఇస్తుంది. అధికమయ్యాక అదే డబ్బు మనిషిని అష్టకష్టాల్లో పడేస్తుంది!

టెలిఫోన్ మోత అతన్ని వర్తమానంలోకి లాగింది. పచార్లు మాని రిసీవర్ అందుకున్నాడతను.

"మిస్టర్ కౌండిన్యా! ఇన్స్పెక్టర్ పృథ్వీరాజ్" కంఠం అతనిలోని టెన్షన్ ని క్షణంలో తగ్గించింది.

"ఇన్స్పెక్టర్ గారూ.... అయామ్ సారీ ఆలోచనల్లో మునిగి మీకు రింగ్ చేయడం మరిచాను... అతను సూచనలిచ్చాడు...." కౌండిన్య బ్లాక్ మెయిలర్ చెప్పిందంతా ఇన్స్పెక్టర్ కి వినిపించాడు. "మీరు చెప్పిందంతా

నిజమే అనిపిస్తోంది....రక్షణగా వాడుకున్న శిరీషని వాడు వదిలిపెడతాడంటే ఇప్పుడు నాకు నమ్మకం కలగటంలేదు....ఇన్స్పెక్టర్....!" కౌండిన్య తడబడుతూ అన్నాడు.

"మిస్టర్ కౌండిన్యా, నెవర్ బిలీవ్ క్రూక్! తన ప్రాణంకోసం బ్లాక్ మెయిలర్ తల్లి గొంతుకోయడానికి వెనుదీయాడు! ఆల్ రైట్....తను దాక్కున్న ప్రదేశానికి దూరంగా, మరోవైపున అతను 'పికప్ సీన్' యేర్పాటు చేశాడు...."

"ఆ ప్రదేశం యెక్కడుందో కనిపెట్టారా ఇన్స్పెక్టర్?" కౌండిన్య ప్రశ్నించాడు.

"మనకి లభించిన ఒకటి రెండు ఆధారాల్నిబట్టి అతను నగారా కొండల్లో వుండాలని అనుకుంటున్నా.."

"ఇన్స్పెక్టర్, ఏం చేయాలనుకుంటున్నారు?" కౌండిన్య ఆత్రంగా అడిగాడు.

"మిస్టర్ కౌండిన్యా, బ్లాక్ మెయిలర్ సూచనలకి ఒకటి రెండు సవరణలు చెప్తాను. ఆ ప్రకారం చేస్తారా?" కౌండిన్య ప్రశ్నకి సమాధానం చెప్పకుండా ఇన్స్పెక్టర్ ప్రశ్నించాడు.

కౌండిన్య నిట్టూర్చాడు.

ఇన్స్పెక్టర్ చిన్నగా నవ్వాడు. "అన్నీ అతను చెప్పినట్టే చేయండి కార్ని వెనక్కి తిప్పి యాభై కిలోమీటర్ల దూరంలో వున్న టౌన్ కి వెళ్ళకండి. అయిదు కిలోమీటర్లు వెళ్ళి ఆగండి...."

"అతను చూస్తూంటాడు .... పర్వాలేదంటారా?" కౌండిన్య భయం భయంగా అడిగాడు.

"లంకెబిందెలు చిక్కేదాకా అతను మిమ్మల్ని చూస్తూ వుండడని నా నమ్మకం...."

"ఇన్స్పెక్టర్, చివరి క్షణాల్లో అతని మాటల్ని నిర్లక్ష్యంచేస్తే ప్రమాదం జరగొచ్చు. అతను వెళ్ళమన్న చోటికి...." అనుమానంతో, కంగారుతో కౌండిన్య చెప్పుకుపోతున్నాడు.

"యస్. విశ్వాసపూరితంగా మాట్లాడుతూ వీపులో బాకు దిగేసేవాళ్ళని విశ్వసించకండి!"

"ఇన్స్పెక్టర్, అంతరాంతరాల్లో వాడిని నమ్మాలని లేదు. కానీ నేను .... నేను ... ఈ క్షణాల్లో నిస్సహాయుణ్ని!" కౌండిన్య దీనంగా అన్నాడు

"చట్టం మీకు సహాయంగా వుంది. ఇట్సాల్ రైట్. ముందట అతను చెప్పినట్టూ, తరవాత నేను చెప్పినట్టూ చేయండి. గుడ్ లక్!"

—ముగింపు వచ్చే సంచికలో



• కొమ్మూరి అప్పారావు

(గత సంచిక తరువాయి)

"మనం మాత్రం మంటల్లోంచి యెలా వెళ్ళగలం?"

"ఇంకా మంటలు పూర్తిగా చుట్టుముట్టలేదు. కాబట్టి మనం వాటిని తప్పించుకొంటూ ముందుకు చొచ్చుకుని వెళ్దాం. సౌమ్య యే చెట్టుచాటునో, గుట్టచాటునో దాక్కొని వుంటే మనల్ని చూసి ఎలాగూ బయటికొస్తుంది. ఆమె యీ ప్రాంతాన్నొదిలి వెళ్ళి ఎంతోసేపు కాలేదు గాబట్టి. ఎంతో దూరం వెళ్ళివుండదు. తేలిగ్గానే కనుక్కోగలమని నా నమ్మకం!"

"ఓ.కే! వెళ్దాం పద."

ఇద్దరు నేలమీది మంటల్ని తప్పించుకొంటూ, మంట లేని చోటికి గెంతుతూ కొంతదూరం వెళ్ళేసరికి ఎదురుగా కాగడాలు చేత ధరించి వస్తూన్న కోయలు కనిపించారు.

విషకన్య నవీన్ చేతిని పట్టుకుని ఓ గుబురు పొద

చాటుకు లాక్కు వెళ్ళింది. అక్కడ మంటలు యింకా వ్యాపించలేదు. దాదాపు డెభ్భై ఎనభై మంది ఆటవికులు హడావిడిగా కాల్తున్న గుడిసెలవైపు పరుగులు పెడ్తూ వెళ్ళారు.

విషకన్య నవీన్ వంక సాభిప్రాయంగా చూసి, "ఆ గూడెంవాళ్ళకి సహాయపడటానికి వెళ్తూన్నారు. నా ఊహే నిజమైతే, సౌమ్య కూడా వీళ్ళను చూసే వుంటుంది. ఏదో సురక్షితమైన స్థలంలో దాక్కుని వీళ్ళ నుంచి రక్షించుకొని వుంటుంది.... పద, వెళ్దాం...." అంటూ ఎళ్ళి చాటుమీదికి నడిచింది.

ఇద్దరు పదిగజాలు వెళ్ళేసరికి పక్కనున్న పొదల్లో ఏదో జంతువు మసలుతున్న సవ్వడి స్పష్టంగా వినిపించింది.

విషకన్య చెవులు దోరపెట్టి విన్నది. ఆమె ఆ సవ్వడి ఏ జంతువుదో తేలిగ్గా గుర్తుపట్టింది.

"పొదల్లో చిరుతపులి పొంచి వున్నది. జాగ్రత్త, యే క్షణంలోనైనా అది మనమీద దాడి చెయ్యవచ్చు. చిరుత చాలా వేగంగా పరుగెత్తటమే కాదు. అతి వేగంగా దుముకుతుంది ఆహారం మీదికి. వేటాడటంలో బహు నేర్పరి. బి. ఎలర్ట్" అంది.

నవీన్ పొదలవైపు దృష్టిసారించి చూశాడు.

ఓ పక్క చుట్టుపట్ల మంటలు చుట్టుముట్టి వస్తున్నాయి.

* * *

సౌమ్య ఊపిరి బిగబట్టి ఆ శబ్దం వినిపించినవైపు తల తిప్పి చూసింది.

లోపల్నుంచి అదో రకమైన గబ్బువాసన వస్తోంది. పెద్దపులో, సింహమో, మరేదో క్రూరజంతువు లోపల

వున్న మాట నిజం! అది నిద్రావస్థలో వుందో, లేక చేత నావస్థలో వుందో తెలియదు. మనిషి వాసన గుర్తించే జంతువయితే తప్పకుండా తనమీద దాడి చేస్తుంది!

ప్రాణాలతో చెలగాటమాడే బదులు ముందుగా ఈ గుహ నుంచి బయటపడితే మంచిదనిపించింది సౌమ్యకు.

చప్పుడు చేయకుండా బయటికొచ్చేసింది. ఆ మృగం ఆమెని గమనించి వుండదు. లేకుంటే ఆ పాటికే ఆమెను ఖండ ఖండాలుగా చీల్చేసి వుండేది. తన గుహలోకి తనంతగా వచ్చిన ఆహారాన్ని యే క్రూరమృగమూ వదులుకోదు.

బయట యింకా అడవి తగలబడ్తూనే వున్నదన టానికి సాక్ష్యంగా ఎర్రటి వెలుగు కనిపిస్తోంది. మైదాన ప్రదేశమంతా ప్రశాంతంగా కనిపిస్తోంది. తను యెవరి కయినా యిట్టే కనపడిపోతుంది. కొండగుహను చేర్చి చెట్టుచేమ లున్నాయి. కాని వాటిని చేరుకోవాలంటే మైదానంమీదుగానే నడిచి వెళ్ళాలి.

ఆమె మైదానంమీదికి రాగానే ఒక్కసారిగా అడవి పక్కులు చుట్టుముట్టాయి.

సౌమ్య పై ప్రాణాలు పైనే పోయాయి.

అడవిపక్కులు చీల్చివేయటం ఖాయం!

సౌమ్య వెంటనే వెనుతిరిగి మెరుపు వేగంతో మళ్ళీ అదే కొండగుహలోకి అడుగు పెట్టింది.

అడవిపక్కులు ఆమెను తరుముకుంటూ గుహదాకా వచ్చాయి. మంత్రం వేసినట్టుగ టక్కున నిల్చుండి పోయాయి. ఆ మరుక్షణమే తోకలు కాళ్ళ మధ్యకు తెచ్చుకుని, అక్కడ్నుంచి వేగంగా పరుగుతీశాయి.

సౌమ్య వింతగా చూస్తోంది. ఇంతకీ లోపల నివసి

నున్న జంతువేమిటి? వేటకుక్కల్లాంటి అడవి కుక్కలు భయపడి పరుగెత్తాయంటే అది చాలా క్రూర జంతువే అయివుండాలి!

తను తెలిసి తెలిసి వాళ్ళ యీ గుహలోకే అడుగు పెట్టింది రక్షణ కోసం! అంతటి క్లిష్ట పరిస్థితుల్లోను ఆమెకు నవ్వొచ్చింది. లోపల్నుంచి గుర్రుమంటున్న సవ్వడి వినిపిస్తూనే వుంది.

మనసు చిక్కబట్టుకుని కొద్ది సేపెలాగో కాలక్షేపం చేసింది సౌమ్య. లోపలి జంతువు పైకి లేచిన సవ్వడి మెత్తగా వినిపించింది. బయటికొస్తుందా?

సరిగ్గా అదే సమయంలో బయట్నుంచి ఓ లేళ్ళగుంపు అటుగా పరుగెడుతూ వచ్చింది.

అంతే! గుహ లోపల్నుంచి ఒక్కసారిగా బయటికి ఉరికిన ఆ జంతువును చూసి నిర్ఘాంతపోయింది సౌమ్య.

అది సింహంలా జూలు కలిగివుంది గాని, సింహం కాదు. ఒంటిమీద పెద్దపులికి వుండే చారలున్నాయి కాని పెద్దపులి కాదు, నోటి నుంచి పొడవాటి రెండు కోరలు బయటికి తన్నుకొచ్చాయి భయంకరంగా. దాని తోక చాలా పొట్టిగా కేవలం అరంగుళాల పొడవు మాత్రమే వుంది!

అది బయటికి వురికిన ఆ కొద్ది సేపట్లోనే విచిత్రమయిన గబ్బు వాసనతో ముక్కులు పగిలిపోయాయి సౌమ్యకు.

అది బయటకు పరుగెత్తిన సమయంలో గుహ గోడకు పూర్తిగా బల్లిలా కరుచుకుని వుండిపోయింది సౌమ్య. అది తనను గమనించిందో లేదో గాని, తన జోలికి రాలేదు. ఎకాఎకిన లేళ్ళ గుంపుపై పడింది. గుహకు పదిగజాల దూరంలోనే మైదానంలో వాటిలో రెండు లేళ్ళను నేల

కరిపించింది.

వాటిని గుహ లోపలకు యీడ్చుకుని వచ్చేలోపల తను బయటపడకపోతే చాలా ప్రమాదమని ఆమె గ్రహించింది.

లేళ్ళను చంపిన ఆ క్రూరమృగం అక్కడే ఆత్రంగా చీల్చి ఆరగిస్తోంది. తిండి ధ్యాసలో పడి అది పరిసరాలను గమనించటంలేదు.

ఇదే మంచిదనుకుంటూ మెల్లగా గుహాగోడల నానుకుని పాకుతున్నట్టుగా బయటికొచ్చింది.

మైదానంలో యింకా వెలుగు పడుతూనే వుంది అడవి యింకా రగులుతుంటూనే వుంది. మంటలు ఉధృతంగా లేవు. గాలి వీయటంలేదు. అందుకే మంటలు వ్యాప్తి చెందకుండా స్థిరంగా వుండిపోయాయి.

మైదానంలోకి వచ్చిన మరుక్షణంనించీ మళ్ళీ ఎలాంటి మృగాల వాత పడాల్సి వస్తుందోనని చాలా ఎలర్టుగా వుంది సౌమ్య. కొండగుహాలవంటి మరుగు ప్రదేశాలు యేమయినా వున్నాయేమోనని పరికించి చూసింది.

బండరాళ్ళు గుట్టలుగా పేర్చినట్టున్నాయి. వాటికి కొంతదూరంలో మళ్ళీ చెట్లు, పొదలు, భీకరంగా కనిపిస్తున్నాయి. చెట్ల మధ్యనుంచి దూరంగా కాగడాల వెలుగు కనిపిస్తోంది. అక్కడి చెట్లు అగ్నివాత పడలేదు. మధ్యలో మైదాన ప్రదేశం వుండటంవల్ల మంటలు అంత దాకా వ్యాప్తి చెందలేదు.

సౌమ్య రాళ్ళగుట్ట దగ్గర కొద్దిక్షణాలు ఆగి అలుపు తీర్చుకున్నది. శారీరకంగా అప్పటికే బాగా అలసిపోయి వుండటంతో కళ్ళమీద నిద్ర కూరుకుని రాబోయింది. బలవంతాన నిద్ర నాపుకొన్నది.

ఎప్పుడు పడిపోయిందో ఎక్కడ పడిపోయిందో గాని చేతికి వాచీ లేదు. సమయం ఎంతయిందో ఆమెకు తెలియ లేదు. బహుశా తెల్లవారు ఝామున మూడు, నాలుగు గంటలయి వుంటుందని ఊహించింది.

సరిగ్గా అప్పుడే యెక్కడ్నుంచో గుర్రపు డెక్కల శబ్దం వినిపించింది.

సౌమ్య చెవులు రిక్కించి వింది. దూరంగా తనకు కని పించిన కాగడాల వెలుగు మరింత దగ్గరగా వేగంగా ముందుకొస్తోంది. ఆ వెలుగుతో బాటు, గుర్రపు డెక్కల శబ్దం దగ్గరవుతోంది.

ఈ సమయంలో గుర్రాలమీద ఎవరొస్తున్నారు? తను చాలా తేలిగ్గా వాళ్ళ కళ్ళపడిపోయే ప్రమాద ముంది. ఎందుకంటే తను మైదాన ప్రదేశంలో వున్నది. నాలుగువైపుల్నుంచీ యెలాంటి మరుగుప్రదేశం లేదు. చెట్లు చాలా దూరంగా వున్నాయి. ప్రస్తుతం తను దాక్కోవటానికి యీ బండరాళ్ళ గుట్ట తప్ప మరేం కని పించటంలేదు.

సౌమ్య యేమాత్రం ఆలస్యం చెయ్యకుండా బండ రాళ్ళ గుట్టమీదికి ఎగబాకింది. ఏటవాలుగా వున్న బండ రాళ్ళను ఆసరాగా చేసుకొని మెల్లగా గుట్టమీదకు చేరింది. నాలుగువైపుల మరుగ్గా వున్న బండరాళ్ళను వెతుక్కొని వాటిమధ్యకు చేరింది. తను బయటివాళ్ళకు కనిపించకుండా కొన్ని బండలను తన చుట్టూ పేర్చు కున్నది.

ఇప్పుడా బండరాళ్ళ గుట్ట ఆమెకు ఓ కోటలా యేర్ప డింది. ఎవరైనా రాళ్ళగుట్ట ఎక్కి చూస్తే తప్ప, తాను అందులో వున్నట్టు తెలియదు. తనకి మాత్రం మైదానం,

అడవి, మైదానం చివరనుంచి ప్రారంభమైన చెట్లు, అన్నీ స్పష్టంగా కనిపిస్తూన్నాయి.

సౌమ్య గుర్రాలు వస్తూన్న దిశవైపు పరీక్షగా చూస్తోంది. కాగడాలు గుర్రాలమీదున్న వ్యక్తులు చేత ధరించినట్టు గమనించింది.

ఆ వ్యక్తులెవరు? ఈ సమయంలో యెక్కడికి వెళ్తున్నారు?

సౌమ్య దృష్టిసారించి అటే చూస్తోంది.

గుర్రాలు బాగా దగ్గరయ్యాయి. ఇప్పుడా రౌతులు స్పష్టంగా కనిపిస్తూన్నారామెకు.

• • •

పొదల్లో అలజడి తగ్గింది.

నవీన్ ప్రశ్నార్థకంగా చూశాడు విషకన్య వంక.

"చిరుతపులి దూరంగా నడచిపోతున్నది. అడవి తగలబడుతుంటే యెలాంటి క్రూరజంతువైనా తన ప్రాణాన్ని రక్షించుకోవాలని ప్రయత్నిస్తుంది. చిరుతా అదే పని చేసినట్టుంది...." ఆమె మాటలింకా పూర్తికానేలేదు.

ఒక్కసారిగా ఆమె మీదికి చిరుతపులి మహావేగంగా ఉరికింది. ఆ వేగానికి ఆమె దబ్బున నేలమీద పడిపోయింది.

నవీన్ నిర్ఘాంతపోయి చూశాడు. చిరుత ఆమెమీదికి పంజా విసిరింది. తను నిరాయుధుడు! ఆమెకేవిధంగా సహాయపడగలనా అని ఆలోచిస్తూండగానే, విషకన్య చిరుతపులితో తలపడింది.

ఒక స్త్రీలో అంత బలం నిగూఢంగా దాగి వుంటుందని నవీన్ ఎన్నడూ ఊహించలేదు.

విషకన్య ఊహించలేనంత వేగంగా చిరుత పంజా దెబ్బనుంచి తనను తాను రక్షించుకోవటమే కాక, పంజా విసిరిన చిరుత కాలును నుహా వేగంగా మెలిపెట్టింది.

చిరుత ఒక్కసారిగా తలకిందులుగా పక్కకి ఎగిరి పడింది. మరుక్షణమే మహోద్రేకంతో ఆమెమీద తిరగ బడింది.

విషకన్య బొడ్లోంచి పొడవాటి కత్తిని పైకితీసింది. తనమీది కురికిన చిరుత ముఖంమీద కళ్ళ ప్రాంతంలో రెండుసార్లు పొడిచింది.

చిరుత బాధతో పెడబొబ్బ పెట్టింది. దాని కళ్ళు చితికిపోయినట్టున్నాయి, విషకన్యమీదికి వురకబోయి నేలమీదికి ఉరికింది. ఈలోపల దాని డొక్కలో రెండు సార్లు పొడిచింది విషకన్య.

చిరుత మరోసారి ఆమెమీదికి ఎగరబోయి పక్కకి ఉరికింది. విషకన్య మరోసారి దాని పొట్టలో పొడిచింది.

చిరుతపులి రక్తం మడుగులో గిలగిల కొట్టుకుని ఆఖరి శ్వాస విడిచింది.

అంతవరకు కేవలం ప్రేక్షకుడిలా విషకన్య పోరాటాన్ని తిలకిస్తూన్న నవీన్, మంటలు దగ్గరగా చుట్టు ముట్టడంతో స్పృహలోకి వచ్చాడు.

విషకన్య అతన్ని చూసి చిన్నగా నవ్వి, "నన్నే మోసగించబోయింది చిరుత. వెనక్కి వెళ్ళిపోతున్నట్టు నటించి మెరుపు దాడిచేసింది. నేను శత్రువును అంత తేలిగ్గా వదుల్తానా?" అన్నది.

ఆమె చాలా అలిసిపోయింది.

"పద మంటలు యెక్కువయ్యాయి. మన ముందు దారికూడా సరిగమంగా లేదు. అయినా మన ప్రయత్నం

మానకూడదు. ఈ చిరుతపులాన దాదాపు యిరవై నిమి షాలు ఆలస్యం!" కత్తిని పచ్చి ఆకుల్తో తుడిచి తిరిగి బొడ్లో దోపుకుంటూ అన్నది.

ఇద్దరు మళ్ళీ ముందుకు నడిచారు.

ఓ అరగంట తర్వాత వాళ్ళు ఓ సమతల ప్రదేశాని కొచ్చారు. అక్కడితో అడవి అంతమైనట్టు కనిపిస్తుంది కొత్తవాళ్ళకి. కాని విషకన్య చెప్పింది విని ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేశాడు నవీన్.

"ఇంతక్రితం అడవిలో పుట్టిన కార్చిచ్చు చాలా దారు ణంగా కొన్ని ఎకరాల నేలలో వున్న చెట్లను కాల్చే సింది. కేవలం నుసి మాత్రం మిగిల్చిందంటే నీ కాశ్చ ర్యంగా వుంటుంది. ఈ మైదాన ప్రాంతం ఒకప్పుడు అంటే, కేవలం మూడు నెలల క్రితం కాలు పెట్టలేనంత దట్టంగా చెట్లతోను, గుబురు పొదలతోను నిండిపోయుం డేది. ఇప్పుడు యెలా కనిపిస్తోందో చూడు! అదిగో దూరంగా కనిపిస్తున్న చెట్లు, గుట్టలు, యీ అడవితో కలిసిపోయుండేవి. ఇదంతా మహారాష్ట్రకి చెందిన అరణ్య ప్రాంతం" చెప్పింది విషకన్య.

ముందుకి అడుగు వెయ్యబోతూ చటుక్కున ఆగి పోయింది విషకన్య.

అక్కడ ఓ లేడి కళేబరం వుంది. అంతక్రితమే ఏదో జంతువు తినిపోయినట్టు స్పష్టంగా తెలుస్తోంది. అక్కడికి పదిగజాల దూరంలో కొండగుహ కనిపిస్తోంది.

విషకన్య సాలోచనగా తలూపి, "ఆ కొండ గుహాలో యేదో క్రూర జంతువు వుండివుండాలి. కొద్ది నిమిషాల క్రితమే లేడిని వేటాడి తిన్నది" అంది.

నవీన్ ఉలిక్కిపడ్డాడు. అయితే సౌమ్య కేదయినా

ప్రమాదం?!.... తల విదిలించాడు వేదనతో.

విపకర్త్య అతినిశ్చంక ధైర్యం చెప్తున్నట్టు చూస్తూ, "ఇప్పటిదాకా ఆమె కెలాంటి ఆపదా కలగలేదని ఖచ్చితంగా చెప్పగలను. కనుచూపు మేరలో ఆమె ఉనికి మనకు కనిపించటంలేదు. అంటే ఈ మైదాన ప్రాంతానికి ఆమె చేరుకోకపోయి వుండాలి, లేదా అడవికి అవతలి తట్టుకి చేరిపోయి వుండాలి!" అంది.

నవీన్ మౌనంగా వుండిపోయాడు కొద్ది క్షణాలు. ముందుగా విపకర్త్య దారితీసింది, మైదానం కుడివైపుకి.

ఆమె ఎడమవైపుకి దారితీసివుంటే అక్కడ బండరాళ్ళ గుట్టమీద నుంచి సౌమ్య వాళ్ళను చూసివుండేది. వాళ్ళు కల్సుకోగలిగి వుండేవారు.

• • •

ఆ రాత్రుల్ని పరీక్షగా చూసింది సౌమ్య.

వాళ్ళు—ఆ అడవిలోకి తాము ప్రవేశించటానికి కారకులయిన వాళ్ళు, తాము యిన్ని కష్టాలపాలు కావటానికి కారకులయిన బందిపోటు దొంగలు! ట్రెయిన్ దోపిడి దొంగలు,

అవును, అందులోని బుర్రమీసాలవాడు తనకి బాగా గుర్తు!

ఆ రోజు రాత్రి చెట్టుపై నుంచి నవీన్ తను చూస్తుండగా వాళ్ళు దొంగిలించిన ధనాన్ని యెక్కడో దాచి, మళ్ళీ వెంతిరిగి అడవి బయటకు వెళ్ళిపోయిన సమయంలో ఆ బుర్రమీసాలవాడ్ని తను బాగా గుర్తుపెట్టుకుంది.

వాళ్ళు మొత్తం అయిదుగురున్నారు. తను పన్నెండు మందిని లెక్కించుకున్నట్టు గుర్తు. అంటే యింకా యేడు

గుట్ట యెక్కడో వుండివుంటారు. అయిదుగురు గుర్రాల మీద వేగంగా పోతున్నారు. గుర్రాల మూపుమీద బరువయిన మూట లున్నాయి. దోపిడి సొమ్మయి వుంటుంది!

సౌమ్య వాళ్ళవైపు కసిగా చూసింది. తన చేతిలో ఆయుధముంటే వాళ్ళను ఆ క్షణమే నిలువునా కాల్చేసి వుండేది! కాల్చటానికి అనువైన స్థలంలో బాగా ఎత్తున కూచుని వున్నది. తనని వాళ్ళు గుర్తించేలోపల తను వాళ్ళని చంపేసి వుండేది!

సౌమ్య పిడికిళ్ళు బిగుసుకున్నాయి. కాని తనిప్పుడేం చెయ్యలేని నిస్సహాయ స్థితిలో వున్నది. అవకాశం దొరికినా ఉపయోగించుకోలేని పరిస్థితిలో వున్నందుకు తనని తను నిందించుకున్నది.

నవీన్ వుండివుంటే యెంత బావుండేది. కనీసం చేత ఆయుధం లేకపోయినా, బండరాళ్ళను గురిచూసి విసిరేసి చంపేసి వుండేవాళ్ళు ఆ దొంగల్ని. కేవలం అయిదుగురు! క్రూర మృగాల్ని వేటాడినట్టు వేటాడి వుండే వాళ్ళు....

ఆలోచనల మధ్య ఆమె కొద్దిగా పక్కకు ఒరిగింది!

అంతే. ఆమె చేరబడ్డ బండరాయి దొర్లింది. బండ రాయితో బాటు ఆమె కూడా కూలింది.

ఆ మరుక్షణం ఆమె రాళ్ళ గుట్టమీదినుంచి బాలెన్సు తప్పి కిందికి దొర్లిపోసాగింది. మధ్యలో యేదైనా బండను పట్టుకొని బాలెన్సు చేసుకోవటానికి ప్రయత్నం చేస్తూనే వున్నది.

కాని ఆమె ప్రయత్నం ఫలించకపోగా, ఒళ్ళంతా సన్నటి కత్తుల్లాంటి రాళ్ళ కొనలు గుచ్చుకొని గాయాలు

అయివాయి. కాళ్ళు చేతులు కొట్టుకునిపోయాయి.

సౌమ్య గుట్టమీదినుంచి గుట్ట దిగువ భాగానికి అతి వేగంగా దొర్లి పోయింది. అయితే, ఆమె సమతల ప్రదేశానికి—గుట్ట దిగువకు చేరుకునేటప్పటికి ప్రమాదం పొంచి వున్న సంగతి ఆమె గ్రహించేసరికి, ఆమెకు స్పృహ తప్పింది.

• • •

"వెనక నుంచి యేవో గుర్రాలొస్తున్నట్టున్నాయి, డెక్కల శబ్దం వినిపిస్తోంది" అన్నాడు నవీన్.

విషకన్య ఆగి విన్నది. "ఔను, ఎవరో స్వారీ చేస్తూ వస్తూన్నట్టుంది!" అన్నది.

ఇద్దరు వెనుతిరిగి చూశారు.

ముందుగా కాగడాల వెలుగు కనిపించింది. ఆ తర్వాత అస్పష్టంగా రౌతులు స్వారీ చేసుకుంటూ వస్తూన్న గుర్రాలు కనిపించాయి.

"వాళ్ళు ఎవరో మనకు తెలీదు. ఎందుకైనా మంచిది!" అన్నాడు నవీన్.

విషకన్య పరిసరాల్ని ఓసారి చూసి, "కష్టం! మనం మైదానం మధ్యలో వున్నాం. మనకి చేరువలో చెట్టు గాని రాళ్ళగుట్టలుగాని యేమీ లేవు. వాటిని వెతుక్కునే లోపల వీళ్ళు రానే వచ్చేస్తారు.... గెట్ రెడీ, వాళ్లు మనకేదైనా హాని తలపెడితే మాత్రం వాళ్ళను ప్రాణాలతో వదలకూడదు!" ఫర్మ్‌గా చెపుతున్న ఆ యువతి వైపు కళ్ళింత చేసుకుని చూసాడు నవీన్. పరిస్థితులు అబలనికూడా అఖండ శక్తిమంతురాలుగా మార్చివేస్తా యనటానికి విషకన్య గొప్ప ఉదాహరణ అనుకున్నాడు.

రౌతులు దగ్గరకొచ్చేశారు.

విషకన్య. నవీన్ మౌనంగా ముందుకి నడుస్తున్నారు.

గుర్రాలు సర్గా వాళ్ళముందుకొచ్చి ఆగిపోయాయి.

నవీన్, విషకన్య రౌతులవంక చూశారు.

సరిగ్గా అయిదు గుర్రాలు, అయిదుగురు రౌతులు. వాళ్ళకి ముందు భాగంలో గుర్రాల మూపుమీద మూటల్లో యేవో వున్నాయి.

రౌతుల్లో ఒకడు అరిచాడు హిందీలో... "వాడే.... వాడే, చూడండి! ఇన్నాళ్ళు తిక్కే వున్నాడు. మనల్నించి తప్పించుకుని బతికి వున్నాడు!" అని.

తక్కిన నలుగురు రౌతులు నవీన్ని గుర్తుపట్టారు— నవీన వాళ్ళలో బుగ్గమీసాల వ్యక్తిని చూడగానే త్రుళ్ళిపడ్డాడు. వాడు ఆనాటి రాత్రి తమను అడవి పాలు చేసిన బందిపోటు దొంగల్లో ఒకడు!

అవును, పన్నెండుమంది దోపిడి దొంగల్లోనివాళ్ళే యీ అయిదుగురు!

"అరె బుచ్చా. మానుంచి తప్పించుకున్నానని సంబర పడిపోకు. దేవుణ్ని తల్చుకో!" అన్నాడు బుగ్గమీసాల వాడు కర్కశంగా నవీన్ వంక చూస్తూ. వాడి చేతిలోని కాగడా వెలుగులో వాడి ముఖం ప్రళయ భయంకరంగా మండిపోతోంది!

నవీన్ యేమాత్రం తడబడకుండా సూటిగా వాడి ముఖంలోకి చూశాడు.

"ఔరా, నీతో వుండాల్సిన పిల్ల యేదీ? ఇదెవతె, కొత్త ముఖంలా వుంది! దీపం వెలుగులో కూడా నల్లగానే వుంది అయినా అందగత్తెలాగానే వుందే!" ఒకడు మేళమాడబోయాడు.

అంతే, ఆ మరుక్షణమే విషకన్య వాణ్ణి గుర్రంమీద నుంచి నేలమీదకు లాగేసింది. కాగడా చేత్తో అందుకుని వాడి ముఖాన్ని కాల్చేసింది. ఊహించని ఈ పరిణామం చూసి తక్కిన నలుగురు గుర్రాలమీద నుంచి ఒక్క సారిగా నేలమీదకు దూకేశారు. ఈలోపల విషకన్య వాడి చేతిమీద బలంగా కొరికింది.

అంతే! "మర్ గయారే!" అంటూ చావుకేక పెట్టి వాడు నేలమీదపడి గిలగిల తన్నుకున్నాడు, నోటి చివర్ల నుంచి నురుగొచ్చేసింది.

తక్కిన నలుగురు గన్స్ చేత్తో పట్టుకుని విషకన్య మీద గురిచేశారు.

మెరుపు వేగంతో నవీన్ ఓ బందిపోటుమీదకి దూకి డొక్కలో తన్నాడు. వాడు నేలమీద కొరిగేలోపల వాడి చేతిలోని గన్ని చేజిక్కించుకున్నాడు.

ఈలోపల తక్కిన ముగ్గురు విషకన్యమీద గుళ్ళవర్షం కురిపించారు. విషకన్య వాళ్ళ గుర్రాలని చాటుచేసుకుని గుళ్ళదెబ్బలనుంచి చాలా లాఘవంగా తప్పించుకుంటున్నది.

నవీన్ యీలోపల యిద్దర్ని గురిచూసి కాల్చాడు. వాళ్ళు నేల వాలిపోతూ నవీన్ వంక గురిచూసి కాల్చారు.

కాని యీలోపల విషకన్య గుర్రాల తోకల్ని గట్టిగా కరిచి, ఆ యిద్దరిమీదకు వదిలేసింది. గుర్రాలు పెద్దగా సకిలిస్తూ ఆ రౌతుల దరిమీదనుంచి దూకాయి.

అయిదో బందిపోటు విషకన్య వైపు గురిచూసి కాల్చాడు. కాని విషకన్య ఊహించని విధంగా నేల బారుగా పొర్లాడి ఆ గుండు దెబ్బనుంచి కాపాడుకుంది.

ఆ బందిపోటు మరోసారి గన్ సవరించుకునే లోపల అతని చేతిలోని గన్ని ఓ గుండు దెబ్బతో ఎగర

గొట్టేశాడు నవీన్. ఎప్పటికప్పుడు గన్ లోడ్ చేసుకోవ టానికి విషకన్య కాటుతో మరణించిన బందిపోటు నడుము నున్న బుల్లెట్ బెల్టులోని గుళ్ళు నవీన్‌కి బాగా ఉపక రించాయి.

అయిదుగురు బందిపోట్లు ప్రాణంకోసం కాసేపు మృత్యువుతో పోరాడి అంతిమశ్వాస వదిలేశారు.

విషకన్య విజయగర్వంతో నవీన్ వంక చూసింది.

నవీన్ ఆమెవంక ప్రశంసాపూర్వకంగా చూసి, "వీళ్ళు నా శత్రువులు, అయిదుగురు చచ్చారు, ఇంకా యేడుగు రున్నారు. ఈ అడవిలోనే యెక్కడో ఉండివుంటారు" అన్నాడు.

విషకన్య నవ్వి, "ఓహో, అయితే నా శత్రువులతో కలుపుకుని మొత్తం పదమూడుగన్నమాట!" అన్నది.

"అంటే పదమూడుగురు శత్రువులను సంహరించవలసిన బృహత్కార్యం మన భుజస్కంధాల మీదున్నదన్న మాట!" అన్నాడు నవీన్, చచ్చిపడున్న బందిపోట్లవైపు పరిశీలనగా చూస్తూ. వాళ్ళయిదుగురి బుల్లెట్ బెల్టులు తన నడుముకి కట్టుకున్నాడు. రెండు గన్స్ చేతపట్టుకున్నాడు.

విషకన్య యేదో ఆలోచిస్తూ కొద్ది క్షణాలవరకు అలాగే వుండిపోయింది. బందిపోట్లమీద తిరగబడే సందర్భంలో, వాళ్ళమీద సర్పాలను ఆయుధాల్లాగా ఉపయోగించుకున్నది. తన విషంవల్ల నేలకూలిన ఆయాను సర్పాలు తనని శపిస్తున్నట్టుగా కళ్ళు తేలవేసి చచ్చి పడున్నాయి. ఆ దృశ్యం ఆమె మనసును కలచివేస్తోంది.

మరోపక్క సౌమ్యను కనుగొనలేకపోయినందుకు ఆమె మనసులో చాలా బాధపడుతోంది. ఉగ్రనాగును, తదితర అనుచర సర్పాలను ఉపయోగించుకోవటానికి వీల్లేకుండా

అడవిలో చిచ్చు రగుల్కొన్నది. లేకుంటే ఉగ్రనాగు యీ సరికి సౌమ్య జాడ కనుక్కొని వుండేది!

తన మాటలకు సమాధానం చెప్పకుండా ఆమె దేని గురించి అంత తీవ్రంగా ఆలోచిస్తోందోనని విషకన్య ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు నవీన్. ఆమె ముఖంలో అతనాశించిన మార్పులు కనిపించలేదు. సిద్ధి పొందిన మహర్షి లా గంభీరంగా వున్నది.

ఆమె యేదో చెప్పటానికన్నట్టు నోరు తెరిచింది. సరిగ్గా అదే సమయానికి ఉగ్రనాగు, తదితర అనుచర సర్పాలతో అక్కడికొచ్చింది.

విషకన్య సంభ్రమంగా వాటి వంక చూసి, "అరె, మీరెలా వచ్చారు?" అంటూ అడవివైపు చూసింది. అప్పటికి మంటలు పూర్తిగా చల్లారిపోయినాయి కొంత అవకాశం దొరగ్గానే ఉగ్రనాగు తమ దగ్గరకు పరుగెత్తుకొచ్చేసిందన్న మాట!

నవీన్ కూడా వాటి వంక అపురూపంగా చూస్తున్నాడు. విషసర్పాలు పెంపుడు జంతువుల్లాగా ఆమె కనుసన్నల్లో మెలగటం అతనికి చాలా అబ్బురంగా వున్నది!

విషకన్య "ఉగ్రనాగూ! సౌమ్య ఎక్కడుందో చెప్పగలవా? చాలా వేగిరం ఆమెను మేం చూడాలి!" అన్నది.

ఉగ్రనాగు పడగవిప్పి ఆమె చెప్పిందానికి తలూపినట్టు పడగ అటు యిటు ఆడించి తర్వాత వెనుతిరిగి జర జర పాక్కుంటూ వెళ్ళసాగింది. అంతవరకు తాము నడిచివచ్చిన బాటకు వ్యతిరేక దిశలో వెళ్తోంది ఉగ్రనాగు!

అప్పుడు స్ఫురించింది విషకన్యకు—తను కుడివైపుకు కాక ఎడమవైపుకు తిరిగి వుండాల్సిందని! అప్పుడు తాను అందుగురించి అంతగా పట్టించుకోలేదు. గుహకి కుడిపక్క దారిని ఎన్నుకుని ఆ దారిన ప్రయాణం సాగించింది.

మరో అరగంట తర్వాత ఉగ్రనాగు బండరాళ్ళ గుట్టను చేరుకున్నది, నాగుల వెంట నవీన్ విషకన్య అనుసరించి రాళ్ళగుట్టను చేరుకున్నారు. విషకన్య రెండో గన్ నవీన్ దగ్గర్నుంచి అందుకుని చేతపట్టుకుంది.

ఉగ్రనాగు గుట్టకిందిభాగంవైపు పరిశీలనగా చూస్తూ విషకన్యవైపు తలెత్తి సాభిప్రాయంగా చూసింది. ఆ తరవాత ఆ గుట్ట చుట్టుపక్కల వెతకటం మొదలెట్టింది. ఉగ్రనాగుతోబాటు తక్కిన సర్పాలుకూడా తీవ్రంగా అన్వేషిస్తూనే వున్నాయి.

* • •

సౌమ్య గుట్ట కిందికి దొర్లుతుండగానే ఆమెకు స్పృహ తప్పిపోయింది.

ఆమె గుట్టమీదినుంచి దొర్లుతుండగా నలుగురు ఆటవికులు చూశారు. సౌమ్య అంటించిన గుడిసిల్ని ఆర్పటానికి గూడెం వెళ్ళి వస్తూన్న ఆటవికుల్లోని వాళ్ళే, వాళ్ళు! తిరుగు ప్రయాణంలో వాళ్ళకి గుట్టమీదనుంచి దొర్లుతున్న సౌమ్య కళ్ళబడింది. వెంటనే గుట్టదగ్గరకు పరుగెత్తుకొచ్చారు.

అడవి మధ్యలో చిక్కుకు పోయిన ఆ నాగరిక స్త్రీ వాళ్ళకు వింతగా కనిపించింది. గుడిసిల్ని అంటించటమే కాక ఆ అడవి తగలబడటానికి ఆమే కారకురాలని వాళ్ళకు తెలియదు. వాళ్ళలో యిద్దరు అడవి నుంచి యేవో ఆకులు దూసుకొని వచ్చారు. ఆకులు నలిపి పసరును

ఆమె కళ్ళలోను, ముక్కులోను పోశారు.

సౌమ్య అటు యిటు కదిలి కళ్ళు తెరిచింది. ఎదురుగా వున్న ఆటవికుల్ని చూడగానే నిర్ఘాంతపోయింది. ఆ గూడెంవాళ్ళు తనని పట్టుకుపోవటానికే వచ్చివుంటారని భ్రమపడింది. తను వీళ్ళ కళ్ళకెలా కనిపించానో అనుకున్నదో క్షణం. శరీరమంతా తూట్లు పొడిచేసినట్టు విపరీతమయిన బాధ. సలుపు గుర్తింపులోకి రాగానే, గుట్టమీది నుంచి తను దొర్లిపోతుండగా స్పృహతప్పి పడిపోయిన సంగతి గుర్తొచ్చింది. ఇక వీళ్ళనుంచి తప్పించుకోవటం దుస్సాధ్యమని నిర్ణయించుకుంది.

తనవైపు చూసుకున్నదీ సారి. చీర చాలాచోట్ల చినుగులు పడిపోయింది రాళ్ళు గీసుకుని. శరీరమంతా గాయాలతో నిండిపోయింది. ఈసారి తక్కిన యిద్దరు అనుచరులు అడవిలో నుంచి మరికొన్ని ఆకులు తుంచుకుని వచ్చారు. వాటిని పసరు పిండి ఆమె గాయాలమీద పూశారు.... చల్లగా అనిపించి, ఉపశమనం కలిగిందామెకు.

సౌమ్య వాళ్ళవైపు విచిత్రంగా చూస్తోంది. వీళ్ళు తనకి సపర్యలు చేస్తున్నారు. తనంటే వీళ్ళకు కోపం గాని, శత్రుత్వం గాని లేవా?

వాళ్ళు యేవో అడుగుతున్నారు. తనకేమీ అర్థం కావటంలేదు. తనేం చెప్పినా వాళ్ళకు అర్థంకాదు. మౌనంగా వుండటమే మంచిదనుకుంది. వీళ్ళు తను గుడిసెలు తగలపెట్టిన గూడెంవాళ్ళు మాత్రం కాదని నిర్ధారణగా తెలిసిపోయిందామెకు.

సౌమ్య తమ ప్రశ్నలకు సమాధానం చెప్పకపోవటంతో ఆటవికులు కోపంతో చిందులేశారు. ఆమె కావా

లనే మొండిగా ప్రవర్తిస్తున్నదని అనుకున్నారో, ఏమో వాళ్ళ ముఖాలు కోపంతో, అసహనంతో వికృతంగా మారిపోయాయి.

వాళ్ళలో వాళ్ళే యేదో మాట్లాడుకున్నారు. తనని ఎక్కడికో తీసుకుపోవటానికి నిర్ణయించుకున్నారని వాళ్ళ ముఖకవళికల్ని బట్టి గ్రహించింది. వాళ్ళని ప్రతిఘటించటం అనవసరం. తన శక్తి చాలదు! తటస్థంగా వుండిపోయింది సౌమ్య.

ఇద్దరు ఆటవికులు దగ్గరగా వచ్చి అమాంతం ఆమెను ఒడిసిపట్టుకున్నారు. కెవ్వున అరవబోయి విరమించుకుంది సౌమ్య. వాళ్ళు తనని యెక్కడికో, బహుశా వాళ్ళ గూడేనికి—తీసుకువెళ్తున్నారు. వాళ్ళ నాయకుడి కెవరికో తనని చూపించటానికయివుంటుంది. ఆ తర్వాతనైనా వదుల్తారో, తననేం చేస్తారో అనూహ్యం!

సౌమ్యలో తెగింపు, మొండిధైర్యం చోటు చేసుకున్నాయి. రోకట్లో తల దూర్చాక రోకటి దెబ్బకోసం వెరచి లాభం లేదు. నిండా మునిగిన తనకి భయమెందుకు?

సౌమ్య ఆటవికులతో ఆ పరిస్థితుల్లో వున్నప్పుడే సరిగ్గా ఉగ్రనాగు సర్పజాలంతో అక్కడి కొచ్చింది. ఉగ్రనాగుకి సౌమ్య యిదివరకే తెలుసు. అందుకే యజమానురాలికి యీ విషయం అందచెయ్యటానికి హుటాహుటిన నవీన్, విషకన్య—వున్న ప్రదేశానికి చరచరా వెళ్ళింది.

విషకన్యను వెంటబెట్టుకుని రాళ్ళగుట్ట దగ్గరకు తీసుకొని వెళ్ళింది.

కాని అప్పటికే ఆ ఆటవికులు ఆమెను తీసుకొని వెళ్ళి

పోయారు. అయినా ఉగ్రనాగు, తక్కిన అనుచర బృందంతో ఆ చుట్టుపక్కల వెతుకుతూనే వుంది.

* * *

"ఉగ్రనాగూ! నాకు వెంటనే సౌమ్య కావాలి. యెందుకింత తాత్సారం చేస్తున్నావు?" అంది విషకన్య అసహనంగా.

ఉగ్రనాగు పడగ అటు యిటు వూపి యజమానురాలు కోపంగా వున్నట్లు గ్రహించి, ముందుకి ఉరికింది, దారితీస్తూ.

మైదానంలోని అడుగుజాడల్ని ఆగి ఆగి పరిశీలనగా చూస్తోంది ఉగ్రనాగు. నాయకుడి వెంటనంటపోయే సైనికుల్లా సర్పాలన్నీ ఉగ్రనాగును అనుసరించి పోతున్నాయి.

మైదానం దాటిపోయి అవతలితట్టు అడవిలో ప్రవేశిస్తూండగా ఊహించని సంఘటన జరిగిపోయింది. ఒక్కసారిగా పదిమంది ఆటవికులు చెట్లమీది నుంచి వాళ్ళమీది కురికారు.

అదురుపాటుగా నడుస్తూ వెళుతున్న నవీన్ చేతిలోని గన్ యెగిరి దూరంగా పడింది. అయితే విషకన్య ముందుకి తూలబోయి నిలదొక్కుకుంది.

ఉగ్రనాగు గాని, అనుచరసర్పాలు గాని వీళ్ళను గమనించలేదు. అప్పటికే అడవిలో ప్రవేశించి ముందుకి సాగి పోతున్నాయవి.

విషకన్య ఆటవికుల వంక చూసి, గన్ గురిచేసింది.

ఆటవికుల చేతుల్లో పొడవాటి కత్తులు, బరిసెలు వున్నాయి.

విషకన్య వాళ్ళవైపు పరికించి చూసి ఉలిక్కి

పడింది. "నువ్వా?" అంది ఓ ఆటవికుడి వంక గుచ్చి చూస్తూ.

వాడు వికృతంగా నవ్వాడు. "నేనే! నువ్ రంగు మారినా గుర్తుపట్టలేగాను అనిసినావా? మా సింగన్నను. అడితో తిరిగిన నన్ను నువ్వు జంపాలనుకుంటుండావని నాకు తెల్వదనుకొన్నావా? అందుకే నిన్నెతుకులాడతా వుండాను. నువ్ జంపాలన్కున్నా సింగన్న బతికి లేడు. నేన్నిన్ను జంపడానిక్కె ఒతికుండిన, కాస్కో!" అంటూ చేతిలోని కత్తిని విసురుగా ఆమె మీదికి చర్రున లేపాడు.

తక్కిన ఆటవికులు వెకిలిగా నవ్వుతూ వింత తెలకిస్తున్నట్టు వాళ్ళిద్దరివంకా చూస్తున్నారు.

విషకన్య కళ్ళల్లో రక్తజీరలు కనిపించాయి. క్రోధంతోను, ప్రతీకార వాంఛతోను ఆమె రగిలిపోతోంది.

నవీన్ ఆమెకు సహాయపడట మెలాగా అని రెండు క్షణాలు తొట్రుపడ్డాడు. గన్ దూరంగా పడిపోయింది. దాన్ని అందుకోబటానికి ప్రయత్నిస్తే ఆటవికులు తనని ఖండ ఖండాలుగా నరికేస్తారు. అందరు తమ యిద్దర్నీ వలయాకారంలో చుట్టుముట్టి వున్నారు.

విషకన్య చాలా వేగంగా కదిలింది. తనమీదకు విసురుగా లేచిన కత్తిని తుపాకీ బారెల్‌తో యెగరగొట్టింది.

ఆ ఆటవికుడు విస్తుపోయి చూశాడు. ఆ వెనువెంటనే రెండో చేతిలోని బరిసెను ఆమె మీద ప్రయోగించబోయాడు.

ఈ లోపల విషకన్య చేతిలోని గన్‌ను యింకో ఆట

వికుడు బరిసెతో గట్టిగా కొట్టి యిరగ్గొట్టేశాడు.

విషకన్య నిరాయుధంగా నిలిచిపోయింది. అయితే ఆమె అణుమాత్రం కూడా చలించలేదు.

“నువ్వు నా కోసం చూడటం కాదురా, నేనే నీ కోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తున్నాను” అంటూ తన మీదికి వేగంగా దూసుకొస్తున్న బరిసెపోటు నుంచి లాఘవంగా తప్పించుకుని, యెగిరి వాడి గుండెలమీద తన్నింది విషకన్య.

తక్కిన తొమ్మిదిమంది బరిసెలు కత్తులు ఒక్కసారిగా విషకన్య మీదికి ప్రయోగించబడ్డాయి. కాని ఆ మరుక్షణమే ఆ తొమ్మిదిమందీ నేలమీద విరుచుకుపడిపోయారు. వాళ్ళ గురితప్పి కత్తులు, బరిసెలు దూరంగా పడిపోయాయి. వాళ్ళ నోళ్ళనుండి రక్తం స్రవిస్తుండగా నేలమీద పడి గిలగిల కొట్టుకొంటున్నారు.

విషకన్య విజయగర్వంతో ఆటవికుడివంక చూసింది. ఉగ్రనాగు అనుచర సర్పాలు కులకుల్లాడుతూ ఆ ప్రదేశాన్ని ఆక్రమించేసుకున్నాయి.

ఉగ్రనాగు విషకన్యమీద కత్తుగట్టిన ఆటవికుడ్ని కాటు వేయబోతుండగా ఆమె గట్టిగా అరిచి చెప్పింది: “వాణ్ణి కాటందుకోవద్దు. వాడి సంగతి నా కొదిలెయ్యి!”

ఆ ఆటవికుడు బాగా భయపడిపోయాడు. అయినా బింకంగానే నిల్చున్నాడు. నేలమీదికి వంగి కత్తుల్ని అందుకోబోయాడు. తన సహచరులు మరణయాతనను అనుభవించటం కళ్ళారా చూశాక, విషకన్యని సర్పాలని మట్టుబెట్టాలనే దృఢనిశ్చయంతో వున్నాడు. అయితే అది జరిగేపని కాదని వాడికి తెలిసినా మొండిధైర్యంతో

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 78/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

కత్తుల నందుకోబోయాడు.

సరిగ్గా అప్పుడే విషకన్య యెగిరి వాడి గుండెలమీద తన్నింది. వాడు నేలమీద పార్లి నాడు. చుట్టూ అంగుళం కూడా ఖాళీ లేకుండా సర్పాల మయం!

పడగలమీద నిల్చి మహోగ్రంగా ఫీత్కారాలు చేస్తున్న అన్నిరకాల సర్పాలని చూడగానే వాడి గుండె అవిసిపోయాయి. తన చావు తప్పదనే నిర్ణయాని కొచ్చాడు.

"ఒరే, నా తండ్రిని చంపటానికి ఆ నాయుడితో తులైన ఆ సింగడిని, నీ సహచరు లిద్దర్ని చంపించింది నేనే! నాలుగోవాడివి నువ్వు తప్పించుకున్నా విన్నావుళ్ళు. నిన్ను ఆయుధంతో చంపను, చూడు నిన్నెలా చంపుతానో!" అంటూ వాడి చేతి నందుకుని చీలమండమీద గట్టిగా కరిచింది విషకన్య.

అంతే! మరుక్షణం శరీరమంతా నల్లగా మాడి, నోటినుంచి నురగలు కక్కుకుంటూ విలవిల కొట్టుకుంటూ ప్రాణాలు వదిలాడు ఆ ఆటవికుడు.

విషకన్య ముఖంలో అదోరకమైన ప్రశాంతత, తృప్తి స్పష్టంగా గుర్తించాడు నవీన్.

"మన శత్రువుల లిస్టులోనించి మరొకడు తొలగి పోయాడు. వీడు...." అని చెప్పబోయింది విషకన్య.

"అర్థమయ్యింది. మీ నాన్నగారి శరీరాన్ని ఖండించిన నలుగురు ఆటవికుల్లో వీడొకడు. సింగడ్ని, మరో యిద్దర్ని చంపేయటమో, చంపించటమో చేశావు. నాలుగోవాణ్ణి యిప్పుడు అంతంచేశావు" అన్నాడు నవీన్.

విషకన్య కళ్ళల్లో నీరు చిప్పిల్లింది—తండ్రిని తలుచు

పోవటంవల్ల, కాని కొద్దిక్షణాల్లోనే మళ్ళీ మామూలుగా అయిపోయింది.

ఉగ్రనాగు విషకన్య ఆదేశాల కోసం ఎదురుచూస్తున్నట్టు తల తిప్పి ఆమెవైపు సాభిప్రాయంగా చూసింది. విషకన్య ఆ మూగభాష తెలుసునన్నట్టుగా, "సౌమ్య దగ్గరకు వేగిరం తీసుకు వెళ్ళు!" అన్నది.

నవీన్ కి ఆ దృశ్యం అద్భుతంగా ఉంది. ఓ మానవ స్త్రీ అజ్ఞలను బుద్ధిగాపాటిస్తున్న ఆ విషసర్పం మనిషికన్నా వివేకంగా ప్రవర్తించటం చూస్తే ఎవరికయినా విడ్డూరంగాను, నమ్మశక్యం కానిదిగాను అనిపిస్తుంది. కాని ఎదురుగా కనిపిస్తూన్న నగ్నసత్యాన్ని నమ్మకుండావుండేదెలా?

విషకన్య చెప్పిందే తడవుగా ముందుకు ఉరికింది ఉగ్రనాగు, అనుచర సర్పాలతో.

నవీన్ యీ లోపల కిందపడ్డ గన్స్ రెండిటినీ తీసి ఓదాన్ని విషకన్య కందించాడు. బుల్లెట్స్ బెల్టులో ఓదాన్ని ఆమె తన భుజానికి తగిలించుకున్నది. ఇరువురు సర్పాల్ని అనుసరించి నడుస్తున్నారు.

అప్పటికి తెల్లవారటానికి అట్టే సమయం లేదు.

• • •

సౌమ్య ఆటవికులతో వాళ్ళ గూడేనికి చేరుకున్న సమయానికి, గూడెం ముందు చాలామంది ఆటవికులు గుమిగూడి వున్నారు. తమ మనుషుల వెంట ఎవరో ఆడపిల్ల రావటం వాళ్ళ ఆసక్తిని బాగా పెంచింది. అంత వరకు ఆమెని భుజమ్మీద మోసుకొని వచ్చిన ఆటవికుడు ఆమెని నేలమీద దించాడు.

సౌమ్య నిర్లిప్తంగా, వాళ్ళవైపు అనాసక్తిగా చూస్తూ నిల్చున్నది. ఆమె గుండె బండబారిపోయి చాలా సేపయ్యింది. ఎలాంటి అవాంఛనీయ సంఘటన ఎదురయినా వాటిని ప్రతిఘటించటానికి శక్తి లేనట్టు అలాగే నిల్చుంది.

ఇదివరకటి గూడెం వాళ్ళలాగే యీ ఆటవికులు కూడా నల్లగా తుమ్మమొద్దుల్లా వున్నారు. వాళ్ళ కనుబొమలు దట్టంగా వుండి, చిన్న కళ్ళు గుంటల్లా కనిపిస్తున్నాయి. చూపులు మొరటుగా, రాక్షసంగా వున్నాయి. మొగాళ్ళకి గోచీతప్ప ఒంటిమీద మరెలాంటి ఆచ్ఛాదన లేదు! ఆడవాళ్ళు మొలచుట్టూ ఏదో ఆచ్ఛాదన కట్టుకున్నారుగాని, తక్కిన శరీరమంతా దాదాపు నగ్నంగానే వున్నది. దాదాపు అన్ని విషయాల్లోను వాళ్ళు, కాలిపోయిన గూడెం వాళ్ళలాగే వున్నారు!

'బహుశా యీ రెండు గూడాల వాళ్ళు ఒకే సంతతి వాళ్ళు అయ్యుండాలి!' అనుకున్నది సౌమ్య.

వాళ్ళలో వయసులో బాగా వృద్ధుడిలా కనిపిస్తున్న వ్యక్తి ముందుకొచ్చి ఆ నలుగుర్ని ఏదో అడిగాడు. అది మరాఠి భాష కాదు. పోనీ 'ఆవాగరికులు' మాట్లాడే గ్రామ్యభాష కూడా కాదు. పూర్తిగా కొండభాష! తనకి మరాఠి భాష కొద్దిగా తెలుసు. తన అన్నయ్య వుంటున్న నాగపూర్‌లో చాలామంది మరాఠి మాట్లాడుతారు.

(సశేషం)

